# భారతి

మాసపత్రిక




సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



ఏప్రెల్ 1964

సంపుటము 41 : సంచిక 4


విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రెల్ 1964



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

**26-వ పుణ్యవర్ధంతి : నిజ చైత్ర శుద్ధ ద్వాదశీ గురువారం 23-4-64.**

# మ హి ప్రా స

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ప్రతి నిత్యము వచ్చేదు ఒక
సిత సుందర క్షణము నరుని జీవిత గతిలో—
అతుల చిరస్మరణీయము,
అతి మధుమధురానుభూతి కది తావలమా!

చివరి వీడ్కోలు గడియలు చెల్లగొట్టి
తల్పమున మేను వ్రాల్చి నేత్రముల మూసి
కొనిన వెంటనే ఒంటరి మనసు తిరుగు
లాడ మొదలిడు ఊహాపథాల లోన.

మనసు నపుడు నే వడుగుదు :
దినమంతట ఏ క్షణాన దివ్యసుఖము తా
అనుభవము పొంది తన్మయ
తను మరునం గలిగె కలత తలపుల నెల్లన్.

ఎన్నో ముళ్లు, మరెన్నో విప్పఁగాను వీలే లేని చిక్కుల్, మరిం
కెన్నో సూదులు, లోతుగుండములు, ఇంకెన్నో విషక్లిన్నమై
కన్నుల్ నీళ్లను నింపు ఘట్టములు—లక్షల్ మేలుకొన్నట్టి నే
ళన్ నా గుండెలు నిండిపోవుచు పరిశ్రాంతమ్ముగా చేసినన్.

అది ఏ దుర్దినమైనను
విధిగా ఒక క్షణము మట్టుకు, వెలుగురవంతే
పొదలినది, ఉండి తీరును
చెదరం గొట్టుచు గదించు చీకటి మూకన్!

అది ఏదో మహత్తమ మగు
నదియే కాకుండవచ్చు—అతిక్షణికంబై
నదె, అతి సామాన్యంబగు
నదియే కావచ్చు జీవితాధ్వమునందున్ !

ఎపుడో బ్రదుకు బాట ఎందో జారిన నేస్త
మున్నట్లుగా వ్రాయు ఉత్తరమ్మొ—
దూరంపు తోటలో తీరిక ఎవ్వరో
మ్రోయించు పిల్లనగ్రోవి రవమొ—
పెరటిలో ఎన్నాళ్ల తరువాతనో చిన్ని
మొగ్గలు తొడిగిన పూలతీగొ—
మొదటిసారిగ లేత పెదవులు జోడించి
'మా', 'అమ్మ', అను పాప మధుర గళమొ—
ఏదొ ప్రతిదిన మెప్పుడో ఇంపునింపు
ఒక క్షణమ్మని వచ్చును—ఒకటి మటుకు :
ఆ ముహూర్తము దరిసిన యపుడు, సఖుడ,
దాని గుర్తించు శక్తి నీలోన వలయు !

క్షణికమ్మొ దారి తప్పిన
మిణుగురు పురువటుల ఇరుల మేడను మెరయున్ !
మణిపూస నల్లపూసల,
ప్రణవమ్మటు మధుర శాంతి ప్రదమై వెలుగున్ !



# నయనతార

## శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

"అవును. ఏమాత్రం సందేహంలేదు. ఆయన ఉద్దండరావు పంతులే ...." అనుకున్నాడు రాజశేఖరం.

తనను రైలు దగ్గరికి వచ్చి కలుసుకోవలసిందిగా ఉత్తరం వ్రాసి తీరా కాళ్లరిగేట్టు స్టేషను ఆ చివరినుంచి యీ చివరి వరకూ వందసార్లు వెదికినప్పటికీ కనిపించని స్నేహితుణ్ణి మనసులో తిట్టుకుంటూ గేటు దగ్గర ప్లాట్ ఫారం టికెట్టు యిచ్చి యివతలికి రాబోతున్న రాజశేఖరం తటాలున ఆగి టీ. సి. తో ఘర్షణ పడుతున్న వ్యక్తిని మరింత పరిశీలనగా చూశాడు. అతని సందేహం తీరిపోయింది. ఆయన ఉద్దండరావుగారే.

వేసవికాలపు ఎండ చిటచిట లాడుతున్నది. వెచ్చని గాలి 'రివ్వు'న వీస్తున్నది. టి. సి. తల అడ్డంగా ఊపుతూ ఏమీ లాభంలేదు. మీ రెన్ని కబుర్లు చెప్పినా నేను వినను గాక." వినను .... ఒక్క క్షణం రద్దీ తగ్గేదాకా అలా నుంచుని తర్వాత తీరిగ్గా రశీదు తీసుకుని డబ్బు చెల్లించి వెళ్లండి ....' అంటున్నాడు.

ఉద్దండరావు పంతులు తన ఖరీదైన చేతి కర్రను విలాసంగా ఊపుతూ నిర్లక్ష్యంగా "సరే ...... నేను చెప్పవలసిందేదో చెప్పాను. టిక్కెట్టు పోయింది .... నా దగ్గర చిల్లికానీ కూడా లేదు .. ఆపైన నీ యిష్టం ...." అన్నాడు.

రాజశేఖరం తటపటాయిస్తూనే ముందుకు వెళ్లి చేతులు రెండూ జోడించి "నమస్కారం మేష్టారూ !" అన్నాడు.

ఉద్దండరావుగారు ముందు రాజశేఖరం వంక అనుమానంగా చూసి తర్వాత గుర్తుపట్టి ఒక్క అడుగు ముందుకువేసి "అరె ! నువ్వుటోయ్ రాజూ ! నువ్విక్కడేం చేస్తున్నావు ?" అని అడిగాడు.

రాజశేఖరం బదులుచెప్పి, "మీ రెక్కడ నుంచి రావడం ? మీ అబ్బాయి కులాసాగా ఉన్నాడా ?" అని ప్రశ్నించాడు.

ఉద్దండరావుగారు నవ్వి "ఇంటినుంచే వస్తున్నాను. ఇప్పుడే రైలు దిగాను. మావాడు బాగానే ఉన్నాడు ...... ని న్నప్పుడప్పుడు గుర్తుచేసుకుంటూ ఉంటాడు కూడా ..... ఇప్పు డయితే దూరదూరంగా ఉంటున్నారు కాని, ఎంతయినా చిన్నప్పటి స్నేహం కదా .... ?" అన్నాడు.

రాజశేఖరం "వివరాలన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. ముందు మీరు వెళ్లి ఆ కారులో కూర్చోండి .... నేను ఒక్క క్షణంలో వచ్చేస్తాను" అన్నాడు.

ఉద్దండరావుగా రతనికి టీ. సి. ని చూపుతూ 'ఈయ నేమిటో గొడవ చేస్తున్నాడు. అదేమిటో విచారించిరా ......" అంటూ చేతి కర్ర ఊపుకుంటూ త్వరత్వరగా నడిచి వెళ్లి కారులో కూర్చున్నాడు.

రాజశేఖరం టీ. సి. వంక "ఏమిట" న్నట్టు చూడగా అతడు రశీదు పుస్తకం యివతలికి తీసి "ఆయన రైలు దిగి చేతికర్ర ఆడించుకుంటూ యివతలికి వచ్చేస్తున్నాడండీ .... 'టిక్కెట్టివ్వ' మని అడిగితే 'లేద' న్నాడు. 'వూరికే ఏదైనా పనిమీద స్టేషనుకు వచ్చారా ?' అని అడిగితే, 'కాదు. ఫలానా ఊరి నుంచి వస్తున్నాన' ని అన్నాడు. ఆ పరిస్థితిలో నేనేం చెయ్యను ? చెప్పండి .... డబ్బు కట్టమని అడిగితే చిల్లిగవ్వ లేదంటున్నాడు" అన్నాడు.

రాజశేఖరం పర్సు తీసి "ఎంత అవుతుందో రసీదు వ్రాసి యివ్వండి. డబ్బు చెల్లిస్తాను."

మరు నిముషంలో టీ. సి. రశీదు వ్రాసి యిచ్చి డబ్బు పుచ్చుకున్నాడు. రాజశేఖరం వెనుదిరిగి నడిచివచ్చి కారులో కూర్చుని స్టార్టు చేశాడు.

కారు కదిలిపోతూ ఉండగా ఉద్దండరావు పంతులు వాక్ప్రవాహం కట్టలు తెంచుకుంది.

"ఇప్పుడు మనం మీ యింటికే కదూ పోతున్నాం ?" అని అడిగా డాయన ముందు.

రాజశేఖరం తల ఊపాడు.

ఆయన మళ్ళీ "నీకు ఒక మొగపిల్లవాడూ, ఆడపిల్లా కలిగినట్టు మావా డెప్పుడో చెప్పినట్టు జ్ఞాపకం .... ఏమాత్రం వయసుంటుం దేమిటి వారికి ?" అని అడిగాడు.

రాజశేఖరం "పెద్దవాడికి మొన్న డిసెంబరు నెలతో అయిదేళ్ళు వెళ్ళి ఆరో ఏడు వచ్చింది. చిన్న పిల్లలకు మూడో సంవత్సరం నడుస్తున్నది" అన్నాడు.

ఆయన నిట్టూర్చి "అలాగా ! అయితే నీ కిప్పుడప్పుడే ఆడపిల్లల పెళ్ళిళ్ళూ, తొందరా లేదన్నమాట. అదృష్టవంతుడివి" అన్నాడు.

తర్వాత కొద్ది క్షణాలాగి "నేను రిటైరయి ఎనిమిదేళ్ళయింది. ఏదో ఒంట్లో ఓపిక ఉన్నంత కాలమూ పని చేశాను. ఇంతలో మావాడు చేతికంది వచ్చాడు. బరువు బాధ్యత లన్నీ వాడి చేతుల్లో ఉంచి ప్రశాంతంగా ఉందామనుకున్నాను. ఏదీ ? ఈ మనసు కిప్పుడల్లా ప్రశాంతత లేదు. ఏదో ఒక సమస్య వేధిస్తూనే ఉంది ...." అన్నాడు.

రాజశేఖరం "అదేమిటి మాష్టారూ ! మీకు సమస్య లేమిటి ? మీరు సంపాయించినంత సంపాయించారు. ఒకళ్ళ కింత పెట్టి పోషించారు. ఒక్కగా నొక్క కొడుకును పెద్ద చదువులు చదివించారు. ఒక ఇంటివాణ్ణి చేశారు. అదీగాక మీ వాడు తక్కువ వాడేం కాదుగదా ? నెల తిరిగేసరికి పది హేను వందల రూపాయలు జీతం తెస్తున్నాడు. ఎవరూ వేలెత్తి చూపడానికి వీలులేని స్వభావం అతనిది. ఇక మీకు దేన్ని గురించి చింత ?" అని అడిగాడు.

ఉద్దండయ్య పంతులు మాట్లాడలేదు. ఎటో చూస్తూ కూర్చున్నాడు. రాజశేఖరమే మళ్ళీ "మీ కోడలు ..... మిమ్మ ల్నేమయినా సరిగా చూడటంలేదా ?" అని అడిగాడు.

అతని నోటిమాట నోట ఉండగనే ఉద్దండరావు పంతులు ముక్కున వేలు వేసుకుని "అమ్మో ! అంతమాట అనకు రాజా ! నా కోడలు వంటి మనిషి లక్షల్లో కూడా మరొకతె కనిపించదు. నే మీ మాత్రంగానైనా హాయిగా ఉన్నామంటే అంతా దాని చలవే !! అన్నాడు.

రాజశేఖరం మౌనంగా కారు నడుపుతూ కూర్చున్నాడు. కారు వేగంగా సాగిపోతున్నది. అతడు ఒక్కసారి ఉద్దండరావు పంతులు మొహం వంక చూసి తల తిప్పుకున్నాడు.

ఉద్దండరావు పంతులు రాజశేఖరానికి హైస్కూలుకో స్కూల్‌ఫైనల్ వరకూ క్లాసు టీచరు. రాజశేఖరం తండ్రి పోయిన తర్వాత అతనికి గార్డియన్‌గా కూడా వ్యవహరించాడు. ఆయన వయస్సులో ఉండగా పేరుకు తగ్గట్టుగా గంభీరంగా, ఉండేవాడు. హెడ్మాష్టరుకు ఆయనపట్ల ఎంతో గౌరవమూ, ఆదరణ ఉండేవి. ఇతర ఉపాధ్యాయులకు చక్కని స్నేహభావం ఉండేది. విద్యార్థులు సరేసరి. ఆయనపట్ల ఎంతో భక్తి ప్రప త్తులు కలిగి ఉండేవారు. స్కూల్ మాష్టారుగా రిటైరైన తర్వాత కాస్త విశాలమైనదిగా స్వంత ఇల్లు కట్టుకొని స్థిర పడ్డాడు. అంతకుముందే ఆయన ఒక్కగా నొక్క కొడుకు ఇంజనీరింగ్‌తో పెద్ద చదువులు చదివి చిన్న చిన్న ఉద్యోగా లేవో వస్తే కాదని చివరకు ఏదో ఫ్యాక్టరీ మేనేజరుగా చేరాడు. అతనికి మొదట్లో ఏడెనిమిది వందలు ఇచ్చేవారు. తర్వాత అతడు ఇతర దేశాలు కూడా వెళ్ళి మరింత ఉన్నతమైన డిగ్రీలు తెచ్చుకోవ డమూ జరిగింది. అతనికి తండ్రి అంటే ఎంతో భక్తి. దేవు డిలా చూసుకుంటాడు. చిన్నప్పటినుంచీ తల్లిలేని తనకు తల్లీ తండ్రీ తనే అయి పెంచిన కారణంగా ఆయన అంటే అతనికి ఎంతో ప్రేమ .... అతనికీ రాజశేఖరానికి మొదటినుంచీ మంచి స్నేహం. ఇద్దరూ ఉద్యోగరీత్యా ఎక్కడెక్కడో వేరుగా బతుకు తున్నప్పటికీ ఒకరి నొకరు మరిచిపోలేదు. అలా అని ఇద్దరి మధ్య ఎడతెగని ఉత్తర ప్రత్యుత్తరాలు, రాకపోకలూ కూడా లేవు. నిజానికి ఉద్దండరావు పంతులను రాజశేఖరం కలుసుకోవడం చాలా ఏళ్ళ క్రిందటి సంగతి.

అతడు కారును నడుపుతూనే మళ్ళీ ఒకసారి ఉద్దండరావు పంతులు ముఖంలోకి చూశాడు. ఆయనలో ఏ మార్పూ లేదు. ఉదాసీనంగా కూర్చుని బయటికి చూస్తున్నారు.

రాజశేఖరం "ఇంతకూ మీ మనసులో దేమిటో చెప్పారు కాదు .... " అని అడిగాడు మళ్ళీ.

ఆయన కళ్ళజోడు సర్దుకుని అతని వంక తిరిగి ఒక్క క్షణం ఆగి "ఏమీ లేదులే, అన్నట్లు ఇంకా ఎంత దూరం వెళ్ళాలి మనం ?" అన్నాడు.

"మరొక అరమైలు .... అంతే." అని సమాధానం చెప్పాడు రాజశేఖరం.

ఒక్క నిముషం నిశ్శబ్దం తర్వాత ఉద్దండరావు పంతులు రాజశేఖరం భుజం తట్టి, లాల్చీ జేబులో నుంచి దేన్నో తీసి గుప్పిటలో ఉంచుకుని "ఇలా చూడు. ఇదేమిటో చెప్పుకో." అన్నాడు.

రాజశేఖరం నవ్వి "ఎలా చెప్పగలను ?" అన్నాడు.

ఆయన గర్వంగా చూస్తూ తన చేతిలో వస్తువును అత నికి చూపించాడు. అది చూడగనే రాజశేఖరం నోట మాట రాలేదు. అతడు నివ్వెరపోయాడు. అది రైలు టిక్కెట్టు.

ఆయన ఒక్క క్షణం ఆగి తన లాల్చీ రెండవ జేబులో నుంచి అయిదు వందల రూపాయల నోట్లను తీసి రెప రెపలా డిస్తూ లెక్కపెట్టి మళ్లీ జేబులో ఉంచుకొని రాజశేఖరం వంక చూసి నవ్వాడు. తర్వాత తనలో తాను గొనుక్కుంటూ "మా మనుమరాలు రైలు టిక్కెట్టు కావాలన్నది. ఎలాగూ రైల్లో వచ్చాను గదా ? ఆ టికెట్టు వాడి కిచ్చేస్తే నా మనుమరాలికేం చెప్పేది ?" అన్నాడు.

రాజశేఖరం కొద్దిగా షాక్ తిని తేరుకుని జాగ్రత్తగా కారు మలుపు తిప్పి ఇంటి ముందు ఆపి హారన్ మోగించాడు.

*           *           *           *

హారన్ మోత విని డాబా వంచలో ఆడుకుంటున్న రవీ, రేణుకా ఇద్దరూ పరుగెత్తుకుంటూ గేటు దగ్గరికి వచ్చారు. ఉద్దండరావు పంతులు కారు దిగి "ఇదేనా మీ ఇల్లు .... బాగుంది" అన్నాడు. రాజశేఖరం "రండి లోపలికి .... ఇదుగో వీడే మా పెద్దవాడు. పేరు రవి .... ఇది చిన్న పిల్ల రేణుక" అన్నాడు.

పిల్లలిద్దరూ ఉద్దండరావుగారి వంక చిత్రంగా చూస్తూ నిలబడ్డారు. ఆయన చూపులు చిన్నపిల్ల మీద నిలిచాయి. దాని వంక కన్నార్పకుండా కొద్ది క్షణాలు చూసి ఆయన ఒక్క ఉదటున ఎత్తుకుని ముద్దు పెట్టుకోబోయాడు. ఆ పిల్లకు కొత్త లేకపోయినా 'అయిష్టత' ఉంది. ఆయన చేతుల్లోనుంచి గింజుకొని క్రిందికి దూకి లోపలికి పరుగెత్తి పోయింది.

ఉద్దండరావు పంతులు నవ్వుతూ ముందుకు నడిచాడు. ముందు హాల్లో వసంత ఎదురై భర్తను పలకరించబోయి వెనక కొత్త మనిషిని చూసి ఆగిపోయింది.

రాజశేఖరం "వసంతా ! నే నప్పుడప్పుడు చెబుతూ! ఉంటానే మా మేష్టారు .... వీరే .... ఇప్పుడే రైలు స్టేషను దగ్గర కనిపిస్తే తీసుకొచ్చేశాను ...." అన్నాడు.

ఆమె 'అలాగా' అని ఉద్దండరావు పంతులుగారి వైపు తిరిగి "ఉండండి. కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు తెస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది.

ఉద్దండరావు పంతులు కాళ్ళు కడుక్కొని చేతి కర్ర ఒక మూల ఉంచి కాస్సేపు పడక కుర్చీలో చేరగిల బడి కళ్ళు మూసుకున్నాడు. రాజశేఖరం ఆయనను పలకరించబోయి మళ్లీ మానుకొని "కాస్సేపు ఆగి వంట అయిన తర్వాత లేవచ్చు. ఈ లోపల మనం స్నానం ముగిద్దాం." అనుకుంటూ లోపలికి వెళ్లాడు.

అతడు స్నానం ముగించి వచ్చేసరికి ఆయన అలాగే పడుకుని ఉన్నాడు. దగ్గరగా నిలబడి "లేచి స్నానం చెయ్యండి మేష్టారూ ! త్వరగా భోజనాలు ముగించేద్దాం. మీరు ఎప్పుడు తిన్నారో ఏమో !" అన్నాడు.

ఆయన లేచి ఒళ్ళు విరుచుకున్నాడు. తాను తొడుక్కుని ఉన్న లాల్చీ విప్పి ఒంకెకు తగిలించి దాని జేబులోవున్న అయిదు వంద రూపాయల నోట్లనూ తీసి రాజశేఖరం చేతికిచ్చి 'నీ దగ్గర ఉంచు' అంటూ స్నానాల గది వైపు నడిచాడు.

రాజశేఖరం ఆయనకు దోవచూపి టవల్సు అందించి మళ్లీ మధ్య గదిలోకి తిరిగి వచ్చి ఆ డబ్బును సేఫ్‌లో ఉంచి నిట్టూర్చాడు.

*           *           *           *

భోజనాలు పూర్తి కాగానే రాజశేఖరం బట్టలు వేసుకొని "మేష్టారూ ! మీరు మధ్యాహ్నందాకా బాగా రెస్టు తీసుకోండి. నే నొకసారి ఆఫీసుకు వెళ్లి రావాలి. సాయంకాలం నాలుగు గంటల కల్లా వచ్చేస్తాను. తర్వాత ఇద్దరం ఎక్కడైనా పోదాం ..." అన్నాడు.

ఉద్దండరావు తలఊపి "ఎక్కడైనా పోవడం కాదు. నాకు ముఖ్యమైన పనులున్నాయి. నువ్వు త్వరగా రా రా...." అన్నాడు.

వసంత ఒక గదిలో ఆయనకు మంచం వాల్చి వచ్చి "బాబుగారూ ! మీరు ఆ గదిలోకి వెళ్లి పడుకోండి. పిల్లలెవరూ అటువైపు రారు. మీకు నిద్రాభంగం కాదు." అన్నది.

ఆయన అలాగే కూర్చుని "అలాగేనమ్మా" అన్నాడు. కాని లేవలేదు. కొద్ది క్షణాలు ఆగి ఉన్నట్టుండి "అమ్మాయీ ! మీ యెరుకలో చుట్టుపక్కల మంచి సంబంధా లున్నాయా ? మా మనుమరాలి పెళ్లి నా కొక సమస్యగా ఉందమ్మా" అన్నాడు.

వసంత భోజనానికి కూర్చుంటూ "పిల్ల కెన్నేళ్లు ఉన్నా యేమిటి ?" అని అడిగింది.

ఆయన త్వరత్వరగా "రేపు మాఘమాసానికి పదహారో సంవత్సరం ప్రవేశిస్తుంది. నాకు బాధ్యత తప్పదుకదా ! మావాడేమో ఏ విషయమూ పట్టించుకోడు, వాడి లోకమే వాడిది. ఇక కోడలు ఉన్నదంటే .... ఆడది—ఏం చెయ్యగలదూ ? అక్కడికీ మావాడికి అనేక విధాల చెవి నిల్లుకట్టుకుని చెప్పిచూశాను. వాడు వింటేనా ? అయినా పెద్దవాళ్లు ఎంతకాలమని అన్ని పనులూ చేసిపెడుతూ ఉండగల రంటావు ? ఏమిటో ! నాకు ఆ పిల్ల పెళ్లి బ్రహ్మాండమైన సమస్య ఇప్పుడు ..... నిద్రాహారాలు సరిగా లేవనుకో .... మంచి వరుణ్ణి చూడాలి .... వాళ్ళు మనకు అన్ని విధాలా తగినవారుగా ఉండాలి....కట్నం కానుకల విషయంలో అభ్యం తరమేమీ లేదనుకో .... నచ్చితే అడిగినంత మొహాన పారేస్తాము. అన్నిటికన్నా ముఖ్యం పిల్లవాడు నచ్చాలి .... పిల్లకు అన్ని విధాలా తగినవాడై ఉండాలి .... ఇన్నీ కుదిరి ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే తర్వాతంటావూ .... బెడద తీరిపోతుంది. హాయిగా కృష్ణా

రామా అనుకుంటూ ఒక మూల కూర్చుండి పోతాను. పిలుపు వచ్చే వరకూ .... '' అన్నాడు.

ఇంతసేపూ ఆయన కళ్లలో, కంఠస్వరంలో చిత్రమైన బాధ గోచరించింది. వసంత అనునయంగా చూసి ''అలాగేలెండి బాబుగారూ ! ఆయన రాగానే మాట్లాడి ఏవైనా సంబంధా లున్నాయేమో ఆలోచిద్దాం. ముందు మీరు వెళ్లి విశ్రాంతి తీసుకోండి'' అన్నది.

''ఆఁ ! ఏ విశ్రాంతో ! కళ్లు మూస్తే ఇదే మనసుని వేధి స్తున్నది !!'' అంటూ ఆయన లేచి ముందు గదిలోకి వెళ్ళి పడుకున్నాడు.

పది, పదిహేను నిముషాల తర్వాత వంట ఇంట్లో పని ముగించుకొని, వసంత పిల్లల నిద్దరినీ 'అటువైపు వెళ్లవద్దనీ,' 'గోల చేయువద్దనీ' హెచ్చరించి ఆ గది గుమ్మంలో నిలబడి లోప లికి తొంగిచూసింది. ఉద్దండరావు పంతులు గురక పెడుతూ హాయిగా గాఢంగా నిద్రపోతున్నాడు.

రాజశేఖరం తిరిగి వచ్చేసరికి ఆయన లోపల గదిలో పీట మీద కూర్చుని వసంతతో ఏదో మాట్లాడుతున్నాడు, ఆమె ఆయన చెబుతున్న విషయాలు వింటూ మధ్య మధ్య ఊఁకొడుతూ ఉండి, ఉండి ''అలాగా !'' అంటూ తన పని చూసుకుంటున్నది. పిల్లలిద్దరూ, ముఖ్యంగా రేణుక, ఉద్దండరావుగారి బుంగ మీసా లకు భయపడి బిక్కు బిక్కు మంటూ చాటు చాటుగా తిరుగు తున్నారు. ఆయన అంతకుముందు ఎంత లాలించి పిలిచినా ఆ పిల్ల రాతిబొమ్మలా నుంచున్నదే తప్ప ఆయన దగ్గరికి వెళ్లలేదు.

రాజశేఖరం లోపలికి వచ్చి చొక్కా విప్పుతూనే ''ఇదేమి దారుణమే వసంతా ! మా మేష్టార్ని పీటమీద కూర్చోబెట్టి మాట్లాడుతున్నావు !'' అన్నాడు.

ఆ మాటలు విని వసంత నవ్వి ''నే నెంత దూరమో చెప్పి చూశానండీ బాబూ, ఆయన వింటేనా ? వాళ్ల ఇంట్లో మధ్యాహ్నం కాఫీ వేళకు వంట ఇంట్లో ఇలాగే కోడలితో కబుర్లు చెబుతూ కూర్చోడం ఆయనకు అలవాటుట'' అన్నది.

ఉద్దండరావు పంతులు వెనక్కు తిరిగి ''నీ భార్యకూ నాకోడలికీ పోలికలున్నాయోయ్ రాజా ! అదీ ఇంతే. నేను చెప్పే కబుర్లన్నీ వింటూ తల ఊపుతూ తన పని తాను చేసుకుపోతుంది. ఒక పసిపిల్లవాణ్ణి చూసినట్టే చూస్తుం దనుకో నన్ను. నాకు డాక్టర్లు లక్ష ఆంక్షలు పెట్టారు. ఎప్పుడూ ఏవో టానిక్కులూ వేళ తప్పకుండా భోజనం .... అందులో చప్పటి కూరలు..ఎక్కువ కారమూ, ఉప్పూ, పులుసూ .... ఏది తినేందుకు వీలులేదు. చలి గాలి, మంచూ, ఎండా, ఏదీ ఒంటికి తగలరాదు. ఊరికే ఇరవై నాలుగంటలూ గోళ్ళు గిల్లుకుంటూ ఇంట్లో కూర్చోవాలి......'' అన్నాడు.

తర్వాత ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా ''అందుకే నేను మా మనవరాలితో రకరకాల ఆటలు ఆడుతుంటాను. అదీ ఇంట్లో ఎవరూ లేనప్పుడే .... మిగిలిన సమయాల్లో అది కూడా నాతో మాట్లాడదు. ముంగిలా కూర్చుంటుంది. ఎవరూ లేన ప్పుడు దానితో కారమ్సు, పేక, అన్నీ ఆడుతుంటాను ... నిజానికి నన్నర్థం చేసుకున్నదా యింట్లో మా మనవరా లొక్కతే....'' అన్నాడు. ఆయన కళ్ళు మెరిశాయి.

రాజశేఖరం కాళ్లు కడుక్కొని రాగానే వసంత ఇద్దరికీ ఫలహారం సిద్ధం చేసింది. ఉద్దండరావు పంతులు ఫలహారానికి ఉపక్రమిస్తూ గంభీరంగా ''ఏమోయ్ రాజా ! మా మనవరాలికి మంచి సంబంధ మేదైనా చూసి పెట్టనోయ్'' అన్నాడు.

అది విని రాజశేఖరం తల ఎత్తి ''మీకు పెళ్లి యీడుకు వచ్చిన మనవరా లుందా మాస్టారూ ?'' అని అడిగాడు.

ఆయన ''సరే బాగానే ఉంది .... అదేమిటోయ్, అలా అడుగుతావు? ఆడపిల్లలు ఎంతలోకి ఎదుగుతారు ? నిన్న మొన్నటి దాకా అది చిన్న పిల్లే .... అయితేనేం ? పదిహేనేళ్ళు నిండు తున్నాయ్. మరి ....' బాధ్యత కలవాణ్ణి నా ప్రయత్నాలు నేను చెయ్యవద్దూ ?'' అన్నాడు.

రాజశేఖరం తల ఊపి ''అలాగా ? అయితే చూద్దాం లెండి.' అన్నాడు.

ఉద్దండరావు పంతులు ''అదిగో !'' చూద్దాం లెండి ! అని తప్పించుకుంటే లాభంలేదు. వివరాలన్నీ చెబుతాను, విను. నా సంగతి నీకు తెలుసు గదా ! మా వాడి సంగతి కూడా బాగా తెలుసు, మా అంతస్థు యోగ్యతా కూడా నీకు తెలుసు. ఇక నా మనమరాలిని గురించి.... ఇప్పుడే చెప్పాను గదా ? దానికి పద హారో యేడు రాబోతున్నది. మనిషి బంగారపు బొమ్మలా ఉంటుంది. నా నోటితో చెబితే పొగడ్త అనుకుంటావు.దాని ఒంటిమీద బంగారం కనిపించ దసలు. ఇక కను ముక్కు తీరు చెప్పనే అక్కర్లేదు .... చిదిమి దీపం పెట్టుకోవచ్చు ..... ఎటువంటి ఇంటికైనా వెలుగు తీసుకురాగల యోగ్యురాలు. ధాని నెమ్మదీ, ఓర్పూ, సహనమూ నేను చూసిన ఆడపిల్లల్లో ఎక్కడా లేవు. లక్ష మందిలో వెదికినా అల్లాంటి పిల్ల దొరకదు.'' అంటూ వసంత వైపు తిరిగి ''అమ్మాయ్ వసంతా ! ఇతర విషయా లెలా ఉన్నా నీకూ దానికీ ఒక్క పోలిక ఉంది. నీకు మల్లేనే దానికి కూడా నవ్వినప్పుడు బుగ్గలు అందంగా సొట్టలు పడ తాయి'' అన్నాడు.

# నయనతార

రాజశేఖరం వసంతవైపు కొంటెగా చూశాడు. ఆమె సిగ్గుతో తలదించుకున్నది.

ఉద్దండరావు పంతులు గొంతు మార్చి "ఇక దాని పేరేమిటో తెలుసా? నయనతార. ఎలా ఉంది పేరు? అందంగా లేదూ? నేనే పెట్టాను దానికాపేరు." అన్నాడు గర్వంతో.

రాజశేఖరం కళ్లముందు పదహారేళ్ల బంగారపు బొమ్మ వంటి మెరుపుతీగ వంటి అద్భుత సౌందర్యవతి రూపం కట్టినట్లైంది. ఆ పేరు అతని చెవులకు అద్భుతంగా ధ్వనించింది. నయనతార! ఎంత అందమైన పేరు!

ఉద్దండరావు పంతులు ప్లేటులో చెయ్యి కడుకుంటూ "ఏమయ్యా, నేనడిగిన దానికి జవాబు చెప్పూ? నీ ఎరుకలో చుట్టుపక్కల ఏవైనా మంచి సంబంధాలున్నాయా?" అని అడిగాడు.

రాజశేఖరం ఆలోచనలోపడ్డాడు. వసంత కాఫీ కప్పులో పోసి అందిస్తూ "అన్నట్టు.....ముష్టి వారబ్బాయి నాగరాజు ఉన్నాడుగా! చక్కగా ఇంజనీరింగ్ పూర్తి అయిందని మొన్ననే మీారన్నారు. వారిని కనుక్కో రాదూ?" అన్నది.

రాజశేఖరం చిటికెవేసి "అవును సుమా! బాగా గుర్తు చేశావు. ఆ సంబంధం మంచిదే........."అన్నాడు.

ఉద్దండరావు పంతులు కాఫీ చప్పరించి "అదేమిటమ్మా అమ్మాయ్! ముష్టివాళ్లతో సంబంధమేమిటి?" అన్నాడు.

రాజశేఖరం ఆదిరిపడి "బాబోయ్! వారి ఇంటిపేరు ముష్టి వారండీ.....మనవాళ్లే....లక్షాధికారులు......."అన్నాడు.

ఉద్దండరావు కాఫీ కప్పు క్రింద ఉంచి పై పంచెతో మూతి తుడుచుకొని "ఇంతకీ పిల్లవాడెలా ఉంటాడో చెప్పవేం" అని అడిగాడు.

రాజశేఖరం "ఒవస్తున్నానుండండి మరీ" అని తనకుతానే ఒక పెద్దరికం అవలంబించి, కాఫీ తాగడం ముగించి నింపాదిగా "కుర్రవాడికి ఇరవైనాలుగేళ్లు ఉంటాయి. ఇంజనీరింగ్ పూర్తి అయింది. మనిషి చాలా శుభ్రంగా, అందంగా ఉంటాడు. పచ్చగా దబ్బపండులా ఉంటాడు. పెద్దలంటే భయమూ, భక్తీ ఉన్నాయి. తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. పేరేమో నాగరాజు" అని చెప్పాడు.

ఉద్దండరావు పంతులు ఒక్క ఉదటున లేచి "అయితే వెంటనే బయలుదేరు...పద గుడ్డలు మార్చుకో...అమ్మాయ్ నా చేతికర్ర ఇలా అందుకో అమ్మా, ఆ చేత్తోనే పంచాంగం కూడా తీసుకురా....వర్జ్యం ఉందేమో చూద్దాం. ఆ బల్లమీద కళ్లజోడు పెట్టాను. చూడు...ఇంకా అలాగే కూర్చున్నావా రాజా నువ్వు?" అంటూ తొందర పెట్టాడు.

*　*　*　*

ఇద్దరూ వీధిలోకివచ్చారు. ఉద్దండరావు పంతులు నడుస్తూ "మనం వెళ్లి ముందు పిల్లవాణ్ణి చూద్దాం. నచ్చితే వారిని వచ్చి పిల్లను చూసుకోమని అడుగుదాం. ఆ అడ్డంకికూడా తీరితే ఆపైన ఇతర వ్యవహారాలన్నీ మాట్లాడుకుని తాంబూలాలు పుచ్చేసుకుందాం" అన్నాడు.

"అలాగేలెండి. వాళ్లు నాకు బాగా తెలుసు. వారి ఇంట్లో ఒకడినిగా తిరుగుతూ ఉంటాను నేను. అలాగే చేద్దాం." అన్నాడు రాజశేఖరం.

అలా ఇద్దరూ పది నిముషాలు సేపు నడచి ఒక పెద్ద భవంతి ముందు ఆగారు. అది రెండంతస్థుల మేడ. ఇంటిముందు విశాలమైన ఆవరణ, అందులో రకరకాల మొక్కలు చెట్లూ ఉన్నాయి. ప్రహరీ గోడకు ఒకవైపున 'కుక్కలున్నవి జాగ్రత్త' అని చిన్న బోర్డు ఉంది.

పంచలో పేము కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్న వ్యక్తి గేటు తీసిన సవ్వడి విని, తలతిప్పి చూసి, లేచి నిలబడి "రావోయ్ రాజా! ఏమిటి, ఇవాళ దోవ తప్పినట్లున్నావే! నిన్ననే మా పిన్నమ్మ నీ విషయం గుర్తుచేసుకుని 'కనిపించడం లేదెందుకో' అన్నది కూడా." అన్నాడు.

రాజశేఖరం మెట్లెక్కుతూ "ఎప్పుడూ ఏదో ఒక పని, అందునా సీజను కదా! ఊపిరి సలపటం లేదు....లేకపోతే మీా ఇంటికి రావడానికేం చేదా? చక్కగా వచ్చినప్పుడల్లా కాఫీలూ టిఫిన్లూ ఇస్తూ ఉంటారు కూడా........."అన్నాడు.

తర్వాత ఉద్దండరావు పంతులు గారిని పరిచయం చేస్తూ "వీరు మేష్టారు. నేనీ మాత్రంగానైనా ఉన్నానూ అంటే అది అంతా వీరి చలవే....టీచరుగానే కాకుండా నాకు గార్డియన్ గాకూడా ఉండే వారు. చిన్నతనంలోనే మా నాన్న పోయాడా? ఆ తర్వాత పెద్ద దిక్కు అంటూ లేని నన్ను కన్న కొడుకుతో సమానంగా చూసుకున్నారు. ఇప్పుడీ ఉద్యోగాల మూలంగా దూరదూరమై పోయాము. వీరి అబ్బాయి పెద్ద ఇంజనీరు. విదేశాలకు కూడా వెళ్లి వచ్చాడు. నెలకు పదిహేనువందల రూపాయలతనికి జీతం......."అని చెప్పాడు.

తర్వాత ఆ వ్యక్తిని చూపించి ఉద్దండరావు పంతులుతో "వీరు విశ్వనాథంగారు, ఇన్‌కంటాక్సు ఆఫీసరుగా రిటైరయినారు." అన్నాడు.

వారిద్దరూ 'ఒహో' అంటే 'అలాగా' అనుకుని కుర్చీలలో కూర్చున్నాక తరువాత అతడు ఉద్దండరావు పంతులుతో "మీా

రిద్దరూ మాట్లాడుకుంటూ ఉండండి; మేష్టారూ, నేను మా పిన్నమ్మకు కనిపించి వస్తాను.'' అంటూ లోపలికి వెళ్ళాడు.

*　　　*　　　*

అతడు ''పిన్నమ్మా! ఎక్కడున్నావు?'' అని కేకవేస్తూ వంట గదిలోకి వెళ్ళాడు. ఆమె పెరట్లో ఎవరితోనో మాట్లాడుతూ ఉంది హాబోలు కేక విని లోపలికి వచ్చి ''నువ్వు ట్రా అబ్బాయీ! చేరి తప్పి వచ్చినట్లున్నావే....''అన్నది.

రాజశేఖరం పీటమీద కూర్చుంటూ ''ఇప్పుడే చిన్నాయన ఆ మాట అన్నాడులే. మళ్ళీ నువ్వు అనడం దేనికి?'' అన్నాడు.

ఆమె ఫ్లాస్కులోనుంచి కప్పులోకి కాఫీ ఒంచి అతని ముందు పెట్టింది. అతడు దాన్ని అందుకుని ఒక్క గుటకవేసి ''అన్నట్టు మన అభిమన్యుడెక్కడా కనిపించడేం?'' అని అడిగాడు.

ఆమె కూర్చుంటూ ''వాడికి ఏమీ తోచటం లేదుట— షికారుకని వెళ్ళాడు.....ఇంటికి వచ్చి పట్టుమని పది రోజులైనా కాలేదింకా.....వాడి కప్పుడే మొహంమొత్తింది....'' అన్నది.

''అవునుమరి....హాస్టళ్లల్లో హాయిగా గోంచేస్తూ సరదాగా ఉండి వచ్చిన వాడికి ఇక్కడేం బాగుంటుందిలే. పోనీ, తొందరగా వాణ్ణొక ఇంటివాణ్ణి చేసెయ్యరాదూ పిన్నమ్మా! నీ బాధ్యతలూ తప్పుతాయి....వాడి తిరుగుడూ తగ్గుతుంది. కట్టేసినట్టు ఇంట్లోనే పడుంటాడు....'' అన్నాడు రాజశేఖరం.

ఆమె నిట్టూర్చింది. ''ఆ రోజు రావాలిగా నాయనా! మనచేతిలో ఏముంది చెప్పు.......వాడు కూడా ఇప్పటి వాళ్లలాగే పెళ్లిచేసుకోనని మొండికెత్తడం లేదసుకో...అయినా ఆ ఘడియ రావద్దూ........''అన్నది.

రాజశేఖరం కప్పు క్రింద ఉంచి ''ఆ ఘడియ వచ్చిందిలే... లేకపోతే నిక్షేపంలాగా గడప దాటకుండా కాలం గడిపే శ్రీ శ్రీ శ్రీ ఉద్దండరావు పంతులుగారు, అస్మదీయ గురువర్యులు, పితృతుల్యులు, పదిహేను వందల రూపాయల జీతగాడి తండ్రి, అనవసరంగా స్టేషను దగ్గర నాకెందుకు తారసపడినట్టు? పడెనుపో మా ఇంటికి వచ్చి మనవరాలి పెళ్లి సంగతి తనకు అర్జంటనీ, సంబంధాలు చూడమనీ నన్నెందుకు అడిగినట్టు? అడిగెనుపో మా ఆవిడకు మెరుపుమెరిసినట్టు మీ సంబంధం ఎందుకు గుర్తు వచ్చినట్టు? ఇదంతా చూస్తే మన అభిమన్యుడికి కళ్యాణ ఘడియలు దగ్గరికి వచ్చినట్లే అనుపిస్తుంది....'' అన్నాడు.

ఆమె కళ్ళు పెద్దవి చేసి ''ఏమిటి నువ్వు చెబుతున్నది?'' అని అడిగింది.

నిజం పిన్నమ్మా! వాకిట్లోకి వెళ్లి చూడు. చిన్నాన్న, మా మేష్టారూ, ఈపాటికి శాఖలూ, గోత్రాలూవంటి మైనర్ పాయింట్లు మాట్లాడేసుకుని ఉంటారు. ఇక 'మా అమ్మాయిని చూసుకునేందుకు మీరు సకుటుంబంగా, అంటే భవదీయుడితో కూడా బయలుదేరి రమ్మని మా మేష్టారు అడగటమూ, చిన్నాన్న 'సరే' ననటమూకూడా మరికొన్ని నిముషాల్లో జరగబోతున్నది... అన్నాడు రాజశేఖరం.

ఆమె గబగబా ముందు హాల్లోకి వెళ్లి గుమ్మం వెనక నిలబడి తొంగిచూసి తిరిగివచ్చి ''నిజమేరా, అన్నట్టు పిల్ల ఎలా ఉంటుందో?'' అని అడిగింది.

రాజశేఖరం కాఫీకప్పు ముందుకు నెట్టి ''మరి కొంచెం కాఫీ పొయ్యి పిన్నమ్మా నీచేతి కాఫీ బలే రుచి....'' అని అడిగి పోయించుకుని నెమ్మది నెమ్మదిగా గుటకలు వేస్తూ'' నేను మాత్రం పిల్లను చూశానా? అయినా ఆయన చెప్పిన వివరాల ప్రకారం ఆ పిల్ల చాలా బాగుంటుందనీ, సద్గుణాల రంగరించి పోసి పెంచారని తెలుస్తున్నది. వయసేమో పదిహేనో యేడు వెళ్లబోతున్నట్లు కూడా చెప్పారాయన. ఇక కుటుంబమూ, సాంప్రదాయమూ అంటావా? ఎవరూ వేలెత్తి చూపడానికి వీల్లేదు. చాలా ఉత్కృష్టమైన కుటుంబం'' అన్నాడు.

తర్వాత ఒక్క క్షణం ఆగి ''పిల్ల పేరేమిటో చెప్పనా? నువ్వెన్నడూ అంత మంచి పేరు వినికూడా ఉండవు....నయనతార. నయనతార....'' అన్నాడు.

''అమె, సరే చూద్దాం కానీ... ఆ భగవంతుడెక్కడ రాసి పెట్టాడో......''అన్నది.

రాజశేఖరం వరండాలోకి వచ్చేసరికి పెద్దలిద్దరూ ఏదో విషయం మీద నవ్వుకుంటున్నారు. విశ్వనాథం గారు ఒక్క క్షణం ఆగి ''అలాగే లెండి. మా వాడు కూడా సెలవులకు ఇంటికి వచ్చాడు. పైవారంలో మంచి రోజు చూసి బయలుదేరి వస్తాం...........'' అన్నాడు.

రాజశేఖరం మరో కుర్చీలో కూర్చుంటూ ''అబ్బో! చాలా దూరం వచ్చిందే...నేను లేకుండానే అన్ని విషయాలూ మాట్లాడుకున్నారన్నమాట....''అన్నాడు.

విశ్వనాథంగారు ''అదేమిటోయ్ అలాగంటావు? వారిని తీసుకువచ్చింది నువ్వేగా? పైగా నువ్వు ఇద్దరికీ కావలసిన వాడివి. పెళ్లి నీ అజమాయిషీ క్రిందనే జరిపించి..పెద్దలం ఆనందిస్తాం. పైగా ఆడపిల్ల కలవాడివి. అనుభవం ఉండటమూ మంచిదే...'' అన్నారు.

తర్వాత ముగ్గురూ ఏవేవో విషయాలు మాట్లాడుకున్నారు. చివరకు ఉద్దండరావు పంతులు లేచి నిలబడి ''ఇక పోదాం పదవోయ్'' అన్న తర్వాత రాజశేఖరం కూడా లేచి ''వెళ్లొ

స్తాం చిన్నాన్నా" అంటూ బయలుదేరాడు. అతనిలో ఆ ఒక్క పూటలోనే చిత్రమైన మార్పు వచ్చింది. ఎంతో పెద్దరికం వచ్చినవాడిలా తయారైనాడు.

ఇద్దరూ వీధిలోకి వచ్చి నడవటం ప్రారంభించారు. ఉద్దండరావు గారు ఉన్నట్టుండి "అన్నట్టు చూడు రాజా! కుర్రవాణ్ణి నేను చూడనేలేదు. ఎలా ఉంటాడో ఏమిటో! మన పిల్లకు తగినవాడవునో కాదో...ఎలా ఇప్పుడు?..." అన్నాడు.

రాజశేఖరం "అదేమిటండీ? మీరేమాత్రమూ సందేహించనక్కరలేదు. నిక్షేపంలా ఉంటాడు. మీకు తప్పక నచ్చుతాడని కూడా నా అభిప్రాయం...." అన్నాడు..

ఉద్దండరావు పంతులు ఆ సమాధానంతో సంతృప్తి చెందినట్లు లేదు. ఆయన చేతి కర్రవూపుకుంటూ విసురుగా నడుస్తున్నాడు. రాజశేఖరం ఉన్నట్టుండి ముందుకు చూసి ఆగిపోయి "మేష్టారూ" అడుగో ఆ వస్తున్న కుర్రవాడే....వెయ్యేళ్లాయుస్సు ఉంటుంది. మాటలో వచ్చాడు...." అన్నాడు. దేవుడు పంపినట్టు సరిగా సమయానికి అతడా వీధిన రావడం అతనికెంతో ఆనందం కలగజేసింది.

అతడు దగ్గరికి రాగానే రాజశేఖరం అతన్ని పలకరించి "ఏమోయ్ అభిమన్యా! ఏమిటి విశేషాలు? నాక్కనిపించడమే మానేశావేం? ఇంటి దగ్గర ఏమీ తోచటంలేదన్నావుటగా? పోనీ మా ఇంటికి రాగూడదూ? లేకపోతే ఆఫీసుకు వచ్చి నాకు కొంచెం సాయం చెయ్యగూడదా?" అన్నాడు.....

అతడు రాజశేఖరం మాటలు విని బిడియపడుతూ నవ్వాడు. అతడు మంచి పొడగరి. పొడుగుకు తగ్గ లావున్నాడు..పచ్చని శరీర చ్ఛాయ. కోల ముఖం..నిరంతరం ఆలోచిస్తున్నట్టుండే కన్నులు. ఉద్దండరావు పంతులు సంతృప్తి చెంది హఠాత్తుగా అతని భుజంమీద తట్టి "ఐ లైక్ యు..." అన్నాడు.

అతడు వెళ్లబోగా రాజశేఖరం కన్నుగీటి సైగచేసి "రండి మేష్టారూ?" అంటూ ముందుకు నడిచాడు. ఇద్దరూ వడివడిగా ఇంటి ముఖం పట్టారు.

అప్పటిదాకా ఆకాశం తంతా మబ్బులుపట్టి 'ఏక్షణంలో కురుస్తుందో' అన్నట్టుంది. వారిద్దరూ ఇల్లు చేరుకోగానే సన్నగా జల్లు ప్రారంభమైనది. వసంత పిల్లలిద్దరికీ అన్నాలు పెట్టడం అయిన తరువాత వారి చేత చదివిస్తున్నది.

వీరిద్దరూ లోపలికి రాగానే ఆమె ఎదురు వచ్చి "అమ్మయ్య వచ్చేశారా? వర్షం వచ్చేటట్టుంది. వీళ్ళిద్దరూ కార్లైనా తీసుక్కు పోకుండా నడిచే వెళ్లారే...." అని ఇందాకటి నుంచీ దిగులుపడుతున్నాను. అన్నట్టు వెళ్ళిన పని ఏమయింది?" అని అడిగింది.

రాజశేఖరం చొక్కా విప్పుతూ "ఏమవుతుంది? పైవారంలో పిల్లను చూసుకునేందుకు వస్తావన్నారు వాళ్ళు..." అని చెప్పాడు.

* * * *

ఆ రాత్రి ఘోరున వర్షం కురుస్తూ ఉండగా ఒంటిగంట వేళకు ఉద్దండరావు పంతులు నిద్రలేచి 'రాజా రాజా' అని పిలుస్తూ పడక గది తలుపు తట్టడం ప్రారంభించాడు.

రాజశేఖరం లేచి తలుపు తీసి "ఏమిటి మేష్టారూ? ఏం కావాలి? " అని అడిగాడు.

ఉద్దండరావు గారు త్వర త్వరగా లాల్చీ తొడుక్కొని గుండీలు పెట్టుకుంటూ "నా చేతి కర్ర ఏదీ? నువ్వాచొక్కా తొడుక్కో.... త్వరగా స్టేషనుకు బయలుదేరు... నేను వెంటనే మాఊరికి వెళ్ళిపోవాలి. ఒంటిగంట బండికి ఇరవై నిముషాలే వ్యవధి ఉంది...." అన్నాడు.

రాజశేఖరం ఆశ్చర్యంతో "ఇప్పుడేం తొందర మేష్టారూ! తెల్లవారిన తర్వాత పోగూడదూ? అంత ముంచుకు పోయే పనులేమున్నాయి గనుక?.." అన్నాడు.

ఆయన చేతి కర్ర వెదికి తీసుకుని " భలేవాడివే..నువ్వేం అడ్డు చెప్పకు..నేనీ బండికి వెళ్ళి తీరాలి. అక్కడ మా అబ్బాయి కోడలూ నేను కనబడక ఎంత దిగులు పడిపోతున్నారో...ఊఁ కానివ్వు. త్వరగా బయలుదేరు...."అన్నాడు హడావిడిగా.

రాజశేఖరం నివ్వెరపోయి తలయెత్తి "అదేమిటి? మీరు ఇంటిదగ్గర చెప్పిరాలేదా?" అని అడిగాడు.

ఉద్దండరావుగారు తల అడ్డంగాఊపి "లేదుగా" అన్నాడు. ఈ లోపల వసంత నిద్రలేచి వచ్చి గుమ్మాని కానుకొనినుంచున్నది.

రాజశేఖరం త్వర త్వరగా చొక్కా తొడుక్కొని సిద్ధమైనాడు. ఉద్దండరావు పంతులు వసంత నుద్దేశించి "అమ్మాయ్, వెళ్లొస్తానమ్మా!" అని చెప్పి ఇవతలికి వచ్చాడు.

ఇద్దరూ కారులో స్టేషనుకు వెళ్లేసరికి రైలు సిద్ధంగా ఉంది. రాజశేఖరం "మేష్టారూ! మీరు వెళ్లి ఎదురుగా ఉన్న పెట్టెలో కూర్చోండి. నేను టికెట్టు తీసుకొస్తాను! అంటూ క్లౌంటరు వైపు పరుగెత్తాడు.

అతడు టికెట్టు తీసుకుని ప్లాట్‌ఫారంమీదికి వెళ్లేసరికి ఉద్దండరావు పంతులు ఒక పెట్టెలో కిటికీ పక్కగా వీలుగా హాయిగా కూర్చొని ఉన్నాడు. రాజశేఖర్ని చూసి ఆయన "ఏదీ టికెట్టు తెచ్చావా? ఇలా ఇవ్వు. దీన్నికూడా నాదగ్గరే ఉంచుకుని మా మనవరాలికి ఇస్తాను..." అన్నాడు గొణుక్కుంటున్నట్టు.

రాజశేఖరం, జేబులో నుంచి అయిదు వందరూపాయల నోట్లు తీసి టికెట్టుతో సహా ఆయన చేతిలో ఉంచాడు.. ఆయన

వాటిని తీసుకుని. అందులో ఒక నోటు ఇవతలికి తీసి రాజశేఖరం జేబులో ఉంచుతూ ''కాదనకు తీసుకో.. ఆడపిల్లకేదైనా వస్తువు చేయించు....'' అన్నాడు.

రాజశేఖరం త్రుళ్ళిపడి ''అబ్బే! ఎందుకు మాష్టారూ! ఒద్దు ఒద్దు, అంటూనే ఉన్నాడు, ఆయన బలవంతంగా అతని జేబు అదిమిపట్టి ఉంచి ''కాదనకు...పెద్దవాణ్ణి నేనిస్తే కాదనవచ్చా? పిల్లకు మెళ్లోకి ఏదైనా చేయించు....'' అన్నాడు మళ్లీ దృఢ స్వరంతో.

బండి కదిలింది. క్రమ క్రమంగా వేగం హెచ్చి రైలు ప్లాటుఫారం వదలి పోయింది. రైలు కిటికీలోనుంచి వెలుగు నీడలు వరుసగా ముఖం మీద పడుతూ ఉండగా ఉద్దండరావు పంతులు రాజశేఖరం వంక కనిపించినంత సేపూ చూస్తూనే ఉన్నాడు. తననుంచి దూరమై పోతున్న కొద్దీ ఆయన ముఖంలో ఏదో వివరించరాని చిత్రమైన ఆవేదన రాజశేఖరం మనసును కలచి వేసింది. అతడు నిట్టూర్చి స్టేషను బయటికి వచ్చి కారులో కూర్చుని స్టార్టు చేసి ఇంటి ముఖం పట్టాడు.

* * * *

మూడవ రోజున ఆఫీసునుంచి ఇంటికి రాగానే వసంత, రాజశేఖరానికి ఒక కవరు ఇచ్చింది. అతడు తీరికగా కూర్చుని ఈలవేస్తూ దాన్ని చింపి చూశాడు.

భర్తకోసం కప్పులోకి కాఫీ వంచుతున్న వసంత అతని ఈల హఠాత్తుగా ఆగిపోవడంతో తల ఎత్తి చూసింది. రాజశేఖరం చేతిలో ఉత్తరం రెపరెపలాడుతున్నది. అతని ముఖంలో రంగులు మారాయి. అతని చూపులెక్కడో ఉన్నాయి. ఆమె ఆ ఉత్తరం తీసుకుని ఇలా చదువుతున్నది.

ప్రియమైన రాజా!

ఉదయమే మానాన్నగారు ఇంటికి వచ్చారు. మొన్నరాత్రి నుంచి ఆయన కనుపించని కారణంగా మేమెంతో ఆదుర్దా పడ్డాము. వచ్చాక, 'ఎక్కడికి వెళ్లారని' అడిగితే అంతా చెప్పారు: ఆయన రోజల్లా మీ ఇంట్లో ఉండి ఏమి చెప్పి ఉంటారో నాకు తెలుసు. ఇటీవల ఆయన చాలా చిత్రంగా ప్రవర్తిస్తున్నారు. మనవరాలి పెళ్లి ఒక పెద్ద సమస్య అని తనలో తాను బాధపడి వారినీ, వీరినీ సంబంధాలు చూడమనటం, తాను స్వయంగా వెళ్లి చూడడం, కొందరిని పిల్లను చూసుకునేందుకు ఇంటికి రమ్మనటం జరిగింది. ఎవరైనా వెంటనే నమ్మేట్టు అతి సహజంగా ఆయన చెప్పడంవల్ల కొందరు వచ్చారుకూడా. వారి కాళ్ల గడ్డాలూ పుచ్చుకొని బతిమాలి మేము సమాధానపరచవలసి వచ్చింది. ఇంతకూ ఆయన తనకున్నదనుకుంటున్న మనవరాలు అసలు లేదు. నీకు బాగాతెలియదేమో. మాకింతవరకూ సంతానం లేదు. పదిహేడు సంవత్సరాలనుంచీ కాపురం చేస్తున్నప్పటికీ మాకు ఒక్క నలుసు కూడా కలగలేదు. అది ఆయనచింత... చక్కని మనవరాలిని ఎత్తుకొని వార్ధ్యకంలో హాయిగా ఉండాలని ఆయన కోరిక కాబోలు. అది నెరవేరని కారణంగా ఆయన ఒక ఊహాచిత్రం గీచుకొని ఆనందిస్తున్నాడు. ఇంట్లో ఎవరూ లేనప్పుడు ఎదురుగా ఒక బొమ్మను ఉంచుకుని దానితో కబుర్లు చెబుతూ ఉంటారు. ఆ బొమ్మకి ఒక అందమైన పేరుకూడా ఉంది, నయనతార అని.

మీ ఇంటి దగ్గర ఎలా ప్రవర్తించారో తెలియదు. ఇప్పుడు దూరంగా ఉంటున్నప్పటికీ మనం చిన్నప్పటినుంచీ అన్నదమ్ములవలె పెరిగిన వాళ్లం. ఆయన మీకేదైనా ఇబ్బంది కలిగించి ఉంటే మన్నింపగలవు....

ఇంతే సంగతులు,
రమాపతిరావు.



# నన్నికవిద్వయము

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

భారతి—అక్టోబరు, 1963—లేఖలలో శ్రీ వై. సీతారామస్వామిగారు శ్రీమదాంధ్ర భారతము కృతిపతిత్వము చర్చను ప్రారంభించుటయు, మార్చి 1964—భారతిలో శ్రీ పాటిబండ మాధవశర్మగారు చర్చ కొనసాగించుటయు జరిగినది.

నాకీ 'రాజా, నారాయణాఖ్య, కరుణార సంపూర్ణ,—రాజ కులశేఖర, విష్ణుమూర్తి !' అను వసంత తిలక పద్య మెట్లు చారిత్రకముగా సమన్వయమగుచున్నదో తెలిసికోవలయు నని జిజ్ఞాస కలిగి నాకు తోచిన యూహను ప్రకటించడ మైనది. చర్చ వివరము.

'రాజా నారాయణ' పదమునందు నారాయణ శబ్దము శ్రేష్ఠ వాచకమని సమాధానము చెప్పుకోవచ్చును. కాని, రాజా నారాయణాఖ్య అను సంబోధనములందు సమాసము లేదు. రాజా సంబుద్ధి, నారాయణాఖ్యా సంబుద్ధి.

'ఈ సంబోధనమువలన కృతిభర్త నారాయణాఖ్యుడని అర్థమగును. మఱి రాజరాజు గతియేమి కావలెను ? లేదా రాజ రాజునకే నారాయణుడను పేరు కలదా ? ఆయన విష్ణువర్ధనుడు కాదా ! అందలి విష్ణు పదమునకు నారాయణ శబ్దము పర్యాయపదమా ? ఇట్టి సంశయములు కలుగుచున్నవి.

'ఈ సంశయములకు పరిష్కారము దొరుకుట సులభ సాధ్యముకాదు.

'పండితు లీ విషయమును చర్చింతురను యాశతో నీ లేఖ వ్రాయుచున్నాను.'

అని శ్రీ వై. సీతారామస్వామిగారి జిజ్ఞాస. ఇక సమాధానము :

'రాజరాజును 'రాజా' యని సంబోధించుటయు 'రాజ నారాయణ' బిరుదమును 'రాజానారాయణ' యని దీర్ఘ జకారముతో బ్రయోగించుట నన్నయగారు చేసిన పనులు కావని చెప్పవలసి యున్నది.

'పాదాంతస్థ లఘువునకుఁ బాక్షిక గురుత్వము తెలుగు ఛందస్సంప్రదాయ మంగీకరింపలేదు. కాని, సంస్కృతమునందు దానిని ('గంతే' యని) పింగళ ముని మొదలుకొని ఛాందసికు లందరు నంగీకరించిరి. కాని, క్రమముగ దాని ప్రయోగము సంకుచితము గావించిరి.

'ప్రసక్తమైన వసంత తిలకము యొక్క ద్వితీయ పాదాంతమందలి 'జా' వర్ణము ('రాజ నారాయణాఖ్య') దీర్ఘము కాదనియు హ్రస్వమే యనియు నాకుఁ దోచుచున్నది.

'నన్నయ్యగారికిఁ బూర్వము తెలుఁగున ఛందశ్శాస్త్రము లున్నట్లు కనఁబడదు. మల్లియ రేచనయు నన్నయకు సమకాలికుడో, అర్వాచీనుఁడో యనఁదగినవాఁడే.

'అనంతర కవు లందు గానరాని విలక్షణ ప్రయోగములు—ఛందో వ్యాకరణ సంబంధులు—పెక్కు నన్నయగారి రచనయందు గలవు. అట్టి వానిలో నిది యొకటి యను కొన్నచో భారత కర్తృత్వము సంశయగ్రస్తము కావలసి నంతటి ప్రమాదము తటస్థింప దనుకొందును..... చిన్నయసూరినిఁ బ్రమాణీకరించి యా మహాకవి [illegible] లఁ బెట్టుఁడని యాంధ్ర మహాజనులకు విన్నవించుకొనుచున్నాఁడను.

అ శ్రీ పాటిబండ మాధవ శర్మగారు ఛందో భంగ విశిష్టతను ప్రతిపాదించినట్లు పూర్వ చర్చ తెల్పుచున్నది.

నాకీ వసంత తిలక ఛందస్సులో ఛందోలోప మున్నట్లు తోచలేదు. 'ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి మేలు నా, నితరులక్షర రమ్యత నాదరింప నానా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్' కొన్నిచోట్ల కొత్త పోకడలో పోయినట్లు కనబడుచున్నది.

'.... భారత ఘోర రణంబునందు నారాయణునట్లు'—'నారాయణభట్టు .... తన కిష్టుడున్ సహాధ్యాయుఁడు నైనవాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపగాన్....నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధుఁడయ్యె జగద్ధితంబుగాన్.'

కొన్ని తాటియాకు ప్రతులలో పై రెండు పద్యములలో మొదటి 'భారత ఘోర రణ' పద్యము లేదు. కాబట్టి

అది ప్రక్షిప్త మనువాదము కూడ కలదు. ఇది భ్రమ.

క్రీ. శ. 1053 తేదీ నన్నయభట్టు వ్రాసిన రాజరాజ నరేంద్రుని నన్ని నారాయణభట్టు దానచరిత్ర—నందంపూడి దాన శాసనచరిత్రకీ 'నారాయణభట్టు తోడయి నిర్వహించి' నా డన్న (భారత పీఠిక) సహాధ్యాయ చరిత్ర వ్యతిరేకమైనది కాదు. అట్లే, ఆశ్వాసాంత పద్యము కూడ వ్యతిరేక చరిత్ర కలది కాదనిపించుచున్నది. పద్య సంబోధనలలోని అక్షర రమ్యతకిది యొక లక్ష్యము.

'రాజా, నారాయణాఖ్య—కరుణారస పూర్ణ !'

ఇట్లే అక్షర రమ్యతయుక్తిని గ్రహింప వీలున్నచో రుచి రార్థ శ్లేష చరిత్ర గోచరించును. కానిచో, అంతా రామ మయం అన్నట్లు సందేహమయంగా గోచరించును.

'నారాయణాఖ్య కవియందు పూర్ణ కరుణారస దృష్టి కలవాడా, ఓ రాజా !'

అను తోడు కవి కర్తృత్వ చిహ్నము వసంత తిలకలో చిగు రించును.

'తన కిష్టుడున్ సహాధ్యాయియునైనవాఁ డభిమత స్థితిఁ దోడ్పయి నిర్వహింపగన్, నన్నయభట్టు తెనుంగునన్ మహా భారత సంహితారచన బంధురుఁడయ్యె' ననుట ముమ్మాటికి సత్యము.

తెనుగు కవులలో తోడు కవులను వాచ్యముగా పేర్కొన్న కవులు తొలి ఛందోకర్త రేచనయు, తొలి పురాణకర్త నన్నయభట్టును మాత్రమే ధ్రువతారలై వెలుగొందు చున్నారు.

ఆశ్వాసాంత పద్యములో నారాయణభట్టు పద్య మున్నట్లే ఆశ్వాసాంత పద్యములో భీమతనూజుని (దానార్ణవ చాళుక్యరాజు —ఛందోరూపమున దేశి కవిత బుట్టించిన—జిన చాళుక్యరాజు) పద్యము కూడ కలదు.

జననుత భీమ తనూజా,
సునయార్పిత విభవ తేజ,
సుభగ మనోజా,
వినుత విశిష్ట సమాజా,
యన నంత్యప్రాస మగున
హార్పతి తేజా. —సంజ్ఞాధికారము

భారత పీఠికలో తోడు కవి చరిత్ర చెప్పినట్లే, కవి జనాశ్రయము పీఠికలో కూడ తోడు కవి చరిత్ర చెప్పబడి బడినది.

'—దాన—వాచకాభరణుఁడు ('భీమనాగసుతుఁడు) ప్రాణ సమాన మిత్రుఁ డీ కృతికి సహాయుడుగా (ప్రీతిన్) మల్లియరేచన ఛందము తెనుగు బాస నరుదుగఁ జెప్పెన్.

ఇట్టి జంట కవులు తెనుగు భాషలో క్రీ. శ. 10 వ శతా బ్దాంతము నుండి కల రనుటకీ చర్చ తార్కాణ మగునో, కాదో విజ్ఞు లాలోచింతురుగాక.

జైన కావ్యము తెనుగులో మొదట పుట్టిన దనుటకీ వైదిక యనుకరణ సాదృశ్యము తార్కాణమున వీలున్నది.

నన్ని నారాయణ—నన్నియభట్టులను నన్ని కవిద్వయ మన్నట్లే—నన్నిచోడుని చేర్చి నన్ని కవిత్రయ మనుట క్రీ. శ. 11 శతాబ్ది కావ్య చరిత్ర కాకపోదు కద !



# రెండు అవతారికలు

శ్రీ కాకరపర్తి ముఖలింగశర్మ

అవతారిక లాంధ్ర వాఙ్మయములో వెనలేని ప్రాముఖ్యమును సంతరించుకొనియున్నవనుట సారస్వత విమర్శకులకు క్రొత్తకాదు. కవి అవతారికలలో గ్రంథ రచనా కారణములను తెల్పును. తత్కాలీన పరిస్థితులను కొన్నిటిని ముచ్చటించును. వ్యక్తిత్వమును వెల్లడించును. స్వీయ చరితమును వివరించును. తన ఇష్ట దైవములను స్తుతించును. సుకవులను పొగడును. కుకవులను తెగడును. పెక్కులేల? గ్రంథ రచనా సౌధమున కవతారికలు ముఖద్వారములు. ఈ వ్యాసమున నన్నయ—నన్నెచోడుల భారత—కుమార సంభవ కావ్యావతారికలను పరిశీలించుటయే నా ముఖ్య లక్ష్యము.

నన్నయ భారతావతారికలో గద్యపద్యము లిరువదియైదు మాత్రమే కలవు. సంస్కృతమున శార్దూల వృత్తముతో ప్రారంభమయినది, దేవతాస్తుతి ఇందు కలదు. సంస్కృత శ్లోకముతో తెనుగు కావ్యము నేల ప్రారంభించెను? శ్రీవాణీ గిరిజలను దేవీత్రయము, తత్పతిత్రయము దేనిని వ్యక్తీకరించును? మొదలగు ప్రశ్నములకు వాఙ్మయ పారావార పరిశోధకులు తమ తమ యభిప్రాయముల నింతకుమున్నె వెల్లడించియుండుటచే వానినిగూర్చి ఇట ప్రసంగించుట యనవసరము.

కృతిపతియగు రాజరాజనరేంద్రుని వర్ణించుచు నన్నయ ముఖ్యముగా మూడు విశేషణములుపయోగించెను. (1) త్రిప్రసాద సమాసాదిత నిత్య ప్రవర్ధమాన మహా మహీవిభవుడు. (2) నిజ భుజ విక్రమ విజితారాతి రాజనివహుడు. (3) అఖిల జగజ్జేగీయమాన నానా గుణరత్న రత్నాకరుడు. ఇవి యా మూడు విశేషణములు. "త్రిప్రసాద సమాసాదిత" అనగా హరిహర హిరణ్యగర్భుల ప్రసాదముచే సమాసాదితమని యర్థము. పై విశేషణములవలన రాజరాజు త్రిమూర్తులను ప్రధాన దైవములుగ నారాధించువాడని తెల్లమగుచున్నది. వీరిలో బ్రహ్మకు పూజార్హత లేదుకదా! అయినచో మిగిలిన వారెవ్వరు? హరిహరులు. తిక్కన హరిహరదేవ రూపకల్పనకు నన్నయ త[illegible]గ నుపయోగించు హరిహర ద్వంద్వమే ముఖ్యకారణము. హరిహర పదము లతికినంతగా శివకేశవులను ద్వంద్వమున్నను, తిక్కన ఈ పదమునే గ్రహించుట నన్నయ యందలి గౌరవాతిరేకమును సూచించును.

బ్రహ్మ, సరస్వతి, వరుసగా వేదములకు, భాషకు ప్రతినిధులని మాత్రమే మనము గుర్తింపవలెను. వారి ప్రసాదముచే నిత్య ప్రవర్ధమానమగుచున్న మహా మహీరాజ్య విభవము గలవాడని మొదటి విశేషణమున కర్థము. రెండవ విశేషణము నిజ భుజ విక్రమముచే విజితులైన అరాతిరాజ నివహము కలవాడని తెలుపుచున్నది. నిత్య ప్రవర్ధమానమైన రాజ్య వైభవము కలవాడని వర్ణించినప్పుడు మరల నీ విశేషణ మేల? అని కొందరి సంశయము. దైవ పౌరుష శక్తులు రెండింటికి సక్రమమైన ప్రాధాన్యము చూపుటయే, ఈ విశేషణముల లోని విశేషము. దైవశక్తినే కేవలము నమ్ముకొని, పురుషకార విహీనుడైనచో వైభవము చేకూరదు. ఎంత పురుషకారము చూపినను దైవశక్తి యనుకూలింపనిదే ప్రయోజనము లేదనుట ఎల్లరెరింగినదే. ఈ శక్తిద్వయ సమ్మేళనమే మానవుని విభవమునకు నిదానము. అవి సంపూర్ణముగ అనుకూలించినవాడు రాజరాజ నరేంద్రుడు. అంతియకాదు. అరాతి రాజులతో నిరంతర ఘోర యుద్ధములు తటస్థించుట—ధర్మపక్షపాతియగు నతడు జయమందుట సంభవించెననుటయు సూచింపబడినది. ఇట్లనుకూలించినను, రాజ్య వైభవ గర్వమున తొంటి సుగుణములన్నియు చెదరిపోయి దుర్గుణములు గూడుకట్టుకొనవచ్చును. ఆ రీతిగ జరుగలేదని "అఖిల జగజ్జేగీయమాన నానా గుణరత్న రత్నాకరు"డను విశేషణము స్పష్ట పరచుచున్నది.

నన్నయ దృష్టిలో రాజరాజు ఉరుకాంతిని తుహినకరుడు. మరియు చళుక్య మన్మథుడు. "విమల విచార, కుమారవిద్యాధర, వివిధాగమ విహితశ్రమ" పదములు రాజరాజు బుద్ధిని స్ఫురింపజేయు పదములు. ఆశ్రిత పోషణము, మనీషి విద్యాశ్రమ తత్త్వవిత్త్వము, దానగుణాభిరతి, వర్ణాశ్రమ ధర్మరక్షణ మహిమము రాజరాజు లక్షణములు. భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతి, భారత శ్రవణాసక్తి, పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా

మహోత్సవము, సంతత దానశీలత, శశ్వత్సాధు సాంగత్యము రాజరాజు నెడదవీడని గుణములు. అతడు తన పరిపాలనా కాలములో నిజ మహీమండల ప్రజను ప్రీతితో పెంచెను. ఇతర మండలాధీశులనదిమి వారివలన కప్పములు ముదముతోఁ గొనెను. కప్పములీయని మండలాధిపతుల యుక్కడగించి, దిక్కులఁ దన యాజ్ఞ వెలిగించెను. విప్ర కులమును గాఁచెను. శరణనిన భీతులను బ్రోచెను. అగ్ర జన్మల కనుగ్రహముతో చారుత రాగ్రహారములను నిర్మించెను. దేవభోగములను మహా విభూతితో దనర జేయుచుండెను. రాజరాజు సనాతనాచారములను— ధర్మములను— చక్కగా నిర్వర్తింప గలిగెనని నన్నయ సంతృప్తి చెందుటచేతనే భారతాంధ్రీకరణమునకు, కృతి పతిగ నతని నెన్నుకొనుటకు సమ్మతించెను. రాజ రాజును కుమార విద్యా ధరుడని వాకొనుచు వివిధాగమ విహితశ్రముఁడని పేర్కొనెను. ఈ "అగమ" పదము ముఖ్యముగ శైవాగమ ములనే సూచించును. నన్నయ నాటికి వేద విరుద్ధ మతము లున్నట్లే శైవమును ప్రబలముగ నున్నది. ముదిరిన శైవము కంటే హరిహరా ద్వైతమే నన్నయ కిష్టము. కానిరాజరాజు విషయమున నీ షద్భేదము కలదు. రాజరాజు పాండితీ సంపదను తెల్పు నీ పద్యము చూడుడు :—

" విమలమతిం బురాణములు వింటి, ననేకము లర్థ ధర్మ శా
స్త్రములు తెలంగఁగంటి, నుదాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి, జగత్పరి పూజ్యములైన యీశ్వరా
గమముల యందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్"

స్వయముగా రాజరాజు నన్నయతో పల్కినవీమాటలు. పురాణార్థ ధర్మ శాస్త్రములకు, ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు సూచుటకు రెండు పాదములు చెల్లినవి. తక్కిన రెండు పాదములలో జగత్పరి పూజ్యములైన యీశ్వరా గమములందు హృదయము భక్తితో నిల్పుట తెల్పఁబడినది. ఈ ఈశ్వరాగమములనగా శైవాగమములని యర్థము. అదియే ముందు నన్నయ చెప్పిన వివిధాగమ విహితశ్రమత్వము. పంద్రెండవ పద్యములో "పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవము" రాజరాజు హృదయమున సుస్థిరమని నిస్సంశయముగ నుదాహరింపఁబడినది. నన్నయ పలుకులలో రాజరాజు త్రిమూర్త్యారాధకుడును, వివిధాగమ విహితశ్రముడు కాగా, రాజరాజు తనను ఈశ్వరాగమములయందు భక్తి నిల్పినవానిగఁ పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవునిగ పరిచయము గావించుకొనెను. క్రోడీకరించి చూడ నన్నయ త్రిమూర్త్యా రాధకుడు. హరిహరా భేదమునంగీకరించును. రాజరాజు శైవుడు, శైవాగమ పండితుడు. ఇదియే కృతి కర్తకు కృతిపతికిఁగల యీష ద్భావభేదము. రాజరాజు కాలము నాటికి వర్ణాశ్రమ ధర్మములు నిల్పుటకు బౌద్ధాదిమతములంగీకరింపనట్లే వీరశైవము నంగీకరింపదు. అవి రాజరాజున కెంతమాత్రము నిష్టము కాక పోవుటచేతనే వర్ణాశ్రమ ధర్మరక్షణ గావించెను. అగ్రహారముల పెక్కింటిని — అందున— చారుతరములనగా ప్రకృతిసుందర గ్రామములను బ్రాహ్మణులకు దానము చేసి, భృతి కల్పించెను. అంతవరకు నితర మతముల తాకిడికి తట్టుకొనలేక, పూజా పురస్కార శూన్యములైయున్న దేవాలయములలో, రాజరాజు నిత్య భోగరాగములకు తగిన కట్టు దిట్టములు గావించెను. అనగా మతస్వాతంత్ర్యము, మతానురక్తి యితని పాలనలోని విశేషములు. కావుననే దేవభోగముల మహావిభూతి తనరఁ జేయువాఁడని నన్నయ ప్రత్యేకముగ వర్ణించెను.

రాజరాజాస్థానములో కూర్చున్న పెద్దల క్రమ మిట్లున్నది. మొట్ట మెదట పేర్కొనఁ బడినవారు "అపార శబ్ద శాస్త్ర పారగులైన వైయాకరణులు." తరువాత భారత రామాయణా ద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు. ఆపై మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులయిన మహా కవులు. వారి తరువాత వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర గరీయః ప్రతిభులైన తార్కికులు విద్వజ్జన ములు. విద్యావిలాస గోష్ఠియందు రాజరాజునకు మక్కువ ఎక్కువ. నన్నయకు పై చెప్పినవారిలో వైయాకరణులం దమిత గౌరవము కలదనుటను వర్ణనాక్రమమే నిరూపించు చున్నది. తనను పరిచయము గావించు కొనునప్పుడును, విపుల శబ్ద శాసనునిగా తొలుదొల్త ప్రకటించుకొనుట యాతని వైయకరణాభిమానమునకు గురుతుగా మనము గ్రహింప వచ్చును. ఇది నన్నయ వ్యాకరణ శాస్త్ర పారీణతను వ్యాకరణ శాస్త్ర రచనను చెప్పకయే చెప్పుచున్నది. "శబ్ద శాస్త్రపారగులైన" "విపుల శబ్ద శాసను" "ఆంధ్ర శబ్ద చింతామణి" యను పదములలోని శబ్ద పదైకత్వమును గుర్తించిన నన్నయయే చింతామణి రచించెననుటలో నభ్యం తరము లేదనుకొందును. అదియు చాలని వారికి చింతామణి లోని మొదటి సూత్రము కొంత సమాధాన పరుపగలదు. ఆ సూత్రము "విశ్వ శ్రేయః కావ్యమ్" "శ్రేయసే" శ్రేయ శ్శబ్దమును వ్యాకరణాదిని, కావ్యాదిని నన్నయ ఎంత నేర్పు మెయి నుపయోగించెనో పరిశీలింప వచ్చును. పై చెప్పినవి కాకతాళీయ ములని తలపోయువారికి వందన సహస్రమర్పించుటయే యుత్త [illegible]

# రెండు అవతారికలు

నిన్న మొన్నటివరకు పురాణ పఠనము, పురాణార్థ ప్రవచనము నొక విద్యగా భారత దేశమున విలసిల్లినది. ఒక వైయాకరణి లేదా, ఒక మహాకవి—లేక ఒక తార్కికుడయినంత మాత్రమున పౌరాణికుడు కాలేడు. ఈ విద్యలో, —శ్రోతృ, పురాణ, పౌరాణికుల సంపుటీకరణమున్నది. అందువలననే యది యొక ప్రత్యేక విద్య. ఆ విద్యలో నన్నయ నిష్ణాతుడు. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడనని నన్నయ చెప్పుట కిదియే కారణము.

మహా భారతాంధ్రీకరణమునకు మున్ను నన్నయ, సంస్కృతభాషలో, తెనుగుభాషలో కావ్యములు రచించి శోభించెను. తెనుగున తాను రచించిన కొన్ని కావ్యనామములైనను వినుచున్నాముగాని, సంస్కృత కావ్యముల నామములైనను తెలియకపోవుట మన దురదృష్టము. ఏ విషయముపై నెట్టి కావ్యమును సంస్కృతమున రచించెనో కూడ మనకు తెలియదు. కాని యవి మృదు మధుర రసభావ భాసుర నవార్థ రచనా శోభితములని మాత్రమూహింపవచ్చును. "ఉభయ భాషా కావ్య రచనాభి శోభితు" అని నన్నయయే చెప్పినందున నిది యూహగా త్రోసివేయరాదని మనవి.

రాజరాజు దృష్టిలో నన్నయ కులబ్రాహ్మణుడు. అనురక్తుడు. అవిరళ జపహోమ తత్పరుడు. సంహితాభ్యాసుడు. సద్వినుతావదాతచరితుడు. సత్ప్రతి భాభియోగ్యుడు. నిత్య సత్య వచనుడు. మత్య మరాధి పాచార్యుడు. సుజనుడు. నన్నయ స్వరూప చిత్రణ కివి తోడ్పడును. కులబ్రాహ్మణ డనుటవలన పురోహితత్వమును, అవిరళ జపహోమ తత్పరుడనుటవలన, అతని కర్మానుష్ఠాన తత్పరతయు, సద్వినుతావదాత చరితుడనుటవలన అతని నిష్కళంక శీలతయు, సత్ప్రతిభాభి యోగ్యుడనుటవలన సమయోచితబుద్ధి, నైశిత్యమును, నిత్య సత్య వచనుడనుటవలన సూనృత వ్రతత్వమును (సత్యవచను డగుటచేతనే శకుంతలచే సభలో సత్య మహిమనంత విపులముగా వర్ణింపజేసెననియు, దుష్యంతునంతటి వాడనృతమేల యాడినాడని మానసిక సంఘర్షణకులోనయినాడనియు కొందరందురు.) మత్యమరాధిపాచార్యు డనుటవలన, క్లిష్ట పరిస్థితులలో నీతినిబుద్ధి రాజరాజునకు సర్వవిధముల నుపయోగించినదనియు, సుజను డనుటవలన జన సామాన్యములో మంచి గౌరవము కలదనియు తెలియును.

నన్నయ ఎంతటి లోకజ్ఞుడో, ఈ క్రింది విషయము నిరూపించును. భారత రచన నా కిష్టమనియు, నా పూర్వులు పాండవులు కావున వారి చరిత్ర విందుననియు, భారత బద్ధ స్పృహులగువారికి బహు యాగముల ఫలము పరమార్థమగుననియు రాజరాజానతిచ్చి, నన్నయను ప్రేరేపింప "దేవా! నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచింతు"ననెను. ఎదురులేని రాజు తన కానతీయ, సంతోషముతో సమ్మతించి—తదితరులకంటె గొప్పవాడనని గర్వించుటకు బదులు విద్వజ్జనంబుల యనుగ్రహంబునంచేసి కావ్యమును నా నేర్చు విధంబున రచింతునన్నాడు నన్నయ. ఏల? నాటి విద్వజ్జనములు తెనుగులో నీ సంహితను పరివర్తనము చేయుటకు సుముఖులుగ లేరు. వారి నంగీకరింపజేయవలెను. అదియు తాత్కాలికాంగీకారము కారాదు. సుస్థిరము చేయవలెను. ఈనాడు రాజు నానతిమెయి రచించినను, విద్వజ్జనముల యనుగ్రహము లేనిదే ప్రచారములోనికి రాలేదు. ఆకారణము వలననే రాజరాజు సంభాషణలోలేని విద్వజ్జనముల యనుగ్రహము నిత డర్థించెను. విశ్వ విద్యాలయములవలె స్వతంత్రములయిననాటి "పరవు వివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజోత్కర రుచిరంబులై సకల గమ్య సుతీర్థములై, మహా మనోహర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాంతర సరసీ వనంబులను" కొనియాడి వారి మన్ననలందెను. ఇదియు నాతని లోకజ్ఞతకు నిదర్శనమే.

నారాయణభట్టు రాజరాజుచే నంతకుమున్ను సంభావితుడై యుండవచ్చును. కాని తన యానతిలో నారాయణభట్టు తోడుగా భారతాంధ్రీకరణము నెరవేర్చుమని రాజరాజు తెల్పలేదు. నన్నయకు నారాయణభట్టు సహాయము మిక్కిలి యవసరము. అత డష్ట భాషా విశారదుడు. బహు భాషల, బహు విధముల భారతమెట్లున్నదో, అందలి పాత్రపోషణ ఎట్లు సాగినదో, అనువాద పద్ధతి ఏ రీతిగనున్నదో చెప్పగల సామర్థ్యము నారాయణభట్టునకు పుష్కలముగా నున్నది. అదియుగాక నారాయణభట్టు తన కిష్టుడు సహాధ్యాయుడు. కవిత్వములో నిపుణుడు. వాదనా పటిమలో కుశలుడు. అట్టివాని తోడ్పాటు "భారత భారతీ సముద్రము దరియంగ నీద" నెంతేని యవసరమున్నదని చక్కగా గమనించుట చేతనే సభ్యుల ముందతని సహాయ మపేక్షించి సాధించెను. "భారత భారతీ సముద్రమ్ము దరియంగ నీదను విధాతృనకైనను1 పోలునే" యనుటలో భావ్యర్థ సూచన మున్నది. "అయినను2 దేవా! నీ యనుమతం

1. "బవిధాతృనకైనను" బ్రహ్మకు అని అర్థము. ఇది కవిబ్రహ్మను సూచించునని పెద్దలు చెప్పిరి.

2. నన్నయ "ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్" అను పంచాయతన స్తోత్రము గావించి "మాతృపూజ గావించెను. షట్ కృత్తికలని కొందరందురు. నన్నెచోడుడు వేరొకచో మాతృస్తుతి యొనరించుటచే దేవతాస్తుతిలో వీరిని చేర్పలేదందురు. లేక సరస్వతీ మొదలగువారికి విశేషణముగ నైన భావించియుండును.

బున'' అను వచనము తన చేతిమీదుగా భారతము పూర్తి కాదన్న విషయమును స్పష్టము చేయుచునే యున్నది. తన యనంత రమునారాయణభట్టు భారత సముద్రమునీదఁ బ్రయత్నించునని నన్నయ నమ్మియుండవచ్చును.

నన్నయ కవితలోని ప్రత్యేకతలు ప్రసన్న కథా కలి తార్థ యుక్తిత్వము, అక్షర రమ్యతలు. అక్షర రమ్యతగూర్చి యుద్దండ పండితులు తమ తమ యభిప్రాయములను వెల్ల డించియున్నారు. అక్షర రమ్యతయన పద రమ్యత యనియే కొందరి తలంపు. నన్నయ నానా రుచిరార్థసూక్తి నిధి. ఈ విశేషణము ఆంధ్రీకరణ నిర్వహణ కంఠగ నుపయోగింపక పోయినను, నానా రుచిరార్థసూక్తులచే నెదుటివారిని తనకు సుముఖులుగా జేసికొను శక్తిని మాత్రము వెల్లడింపకపోదు.

భారతాంధ్రీకృతికి స్వార్థము ప్రేరేపకముకాదు. జగ ద్ధితమే ప్రయోజనము. నన్నయకు, రాజరాజునకు భారతము ప్రీతిపాత్రమగుటకు కొన్ని ప్రత్యేక కారణములున్నను సమిష్టి కారణములుగా—భారత విశ్వ జనీనత, శాస్త్రార్థములు వెల్ల డించుట, నీతులను వాకొనుట, మహా కావ్య లక్షణములుండుట లక్ష్య సంగ్రహమగుట—ఇతిహాసమగుట, పురాణ సముచ్చయ మగుటలు చెప్పవచ్చును. విశ్వశ్రేయస్సు సాధించుట కింత కంటె నేమి కావలయును?

నన్నెచోడ మహాకవి కుమారసంభవ పీఠికలో దేవతా స్తుతిని విపులముగ నొనర్చెను. ఇష్టదేవతా నమస్కారమ్మును సమస్త దేవతా స్వరూపంబును తదీయ గురు చరణారవిందంబు లభినందించుటయు పదునారు గద్య పద్యములలో నున్నది. మొత్త మీతని యవతారిక అరువది ఎనిమిది గద్య పద్యములు.

నన్నయ వేదత్రయ మూర్తులను సంస్కృతమున శార్దూల వృత్తములోను తింపగా, నన్నెచోడుడు మహా స్రగ్ధరావృత్తముతో మహాదేవుని తెనుగున నుతించినాడు. అయ్యు " శ్రీ వాణీ," అని నన్నయ ప్రారంభించినట్లుగనే "శ్రీ వాణీంద్రామరేంద్ర" యని "శ్రీ వాణీ," శబ్దముల నుపయోగించుట నన్నయ భారతము నితడు చదివినాడనుటకు, అతనియందు భక్తి గౌరవములు గలవాడనుటకు, గురుతుగా చెప్పవచ్చును. మొదటి స్రగ్ధరలో "ఎప్పుడు," మాకు," "ఇచ్చుగాతన్,"ఐ, అను తెలుగు పదములు తప్ప తక్కిన వన్నియు సంస్కృత సమములే. దుష్కర్మకములు తీసివేసినచో సంస్కృత శ్లోకమే యగును. నన్నెచోడుడీ చిన్న మార్పు గావించి, తెలుగు పద్యము తోనే ప్రారంభము కావించితి ననిపించు కొన్నాడు. తెనుగునకు సంస్కృతమున వ్యాకరణము వ్రాసిన నన్నయ కావ్యాది నొక్క శ్లోకమయిన వ్రాయనిదే యూరకుండలేడు గదా! నన్నెచోడుడు రెండవ పద్యములో అంబికాధవుడైన శంకరుని, మూడవ పద్య ములో స్మిత వక్త్రుడైన పరమేశ్వరుని నుతించెను. మూడు పద్యములు త్రికరణ శుద్ధి నీ రీతిగా దెల్పు చున్నవి.

వెను వెంటనే సత్వగుణ స్ఫురణ పరమేశ్వరు వామాంగమున జనించిన కమలాధిపుడగు విష్ణుని, రజోగుణ స్ఫురణావహమై పరమేశు దక్షిణాంగమున జనించి, సద్విధి గొల్చి, విశ్వము సృజించు వాగ్విభుని సన్మతి సంస్తుతించెను. ఈ విధముగ నన్నయ యొక్క పద్యములో గావించిన త్రిమూర్త్యారాధ నను నన్నెచోడుడు విపులము చేసెను. తరువాత, భవాష్ట మూర్తులలో వరమూర్తియైనట్టి రవిని చారునిజప్రభ యిచ్చు కొరకై నమస్కరించెను. భారతావతారిక తరలములో నీ రవి ప్రశంస గలదుకదా! నన్నెచోడుడు క్రొత్తగ రవిని సంస్మరింప లేదు. అయ్యు, ఇతడు సూర్యవంశపు రాజు. కావున తన వంశకర్తను త్రిమూర్తుల తర్వాత సుతించటంలో నెంతేని ఔచిత్య మున్నది. ఆపై, గణనాథుని స్మరణమును, అభిమత ఫలంబుల జనులకు దయ నొసగు షణ్ముఖుని గొలిచెను. మరుని కూడా సంస్మరించి, తనకృతి కఖిల వశ్యమతి యీయ వలసినదని ప్రార్థించెను. మదనుడు లేనిదే కుమార సంభవము లేదు. శంకరునకు ప్రతి పక్షియైన మరుడోడినట్లు కన్పట్టినను తుదకు గెల్చినవాడతడే. వశీకరణశక్తి కధి నాథుడు కనుక నతని బ్రార్థించెను. ఈ క్రొత్త సాంప్రదాయమునకు తెనుగున ప్రారంభోత్సవము గావించిన వాడు నన్నెచోడుడే. ఈ మదన సంస్మరణ తప్ప తక్కినవారిని నన్నయ సంక్షేపముగ నుతించినట్లు మనము భారతావ తారికలో చూడ వచ్చును.

వేదాగమ రూపమున మహాదేవునపార గుణ మహా సంస్తుతి సేయు భారతిని గొల్చిన తర్వాత "అమల జ్ఞాన సుదీపవర్తి గొని వృద్ధాచారుడై వేద శాస్త్రములందున్న సదర్థ మెల్ల గొని విద్వత్ప్రీతి గావించువాని, మహాత్ముండనబొల్చు బుణ్యానిధి వాణీముఖ్యు సర్వజ్ఞు జంగమలింగంబగు మల్లి కార్జును సదా కల్యాణు గీర్తించెదన్," అని గురువున కెరగెను. ఈ పద్య రచనా రీతికి, భారతములోని "విమలమతింబురాణ ములు" అను పద్య రచనా రీతికిని గల సామీప్యమును గమ నింప వచ్చును.

వేద ప్రామాణికత్వమును నన్నయవలె నన్నెచోడుడును అంగీకరించినాడు. వీరశైవులు విష్ణునామమును నిందకేతప్ప స్తోత్రమునకు స్మరింపరు. హరుని వామ దక్షిణ భాగ సంజ నితులగుటచే హరి హిరణ్యగర్భులు నితనికి సేవ్యులేయగు చున్నారు. రాజరాజు శైవాగమములయందు చిత్తము నిల్పి

నచ్చే, పార్వతీపతి పదాబ్జ ధ్యాన పూజా మహోత్సవుడై నచ్చే నన్నెచోడుడు నంబికాథవుడగు శంకరు నభీష్ట సిద్ధికై ప్రార్థించెను. నన్నయ కృతిపతి రాజరాజు. నన్నెచోడుని కృతిపతి గురువగు జంగము మల్లికార్జునుడు. తీర్థము స్వార్థము కలిసినట్లు గురుస్తోత్రము నన్నెచోడునకు కలిసి వచ్చినది. నన్నయ గురుస్తోత్రము చేయలేదు. కవులిరువురు మత సహనము కలవారే అయ్యు, నన్నయ భారతాంధ్రీకరణమునకు పూనుకొనుటయు, హరి హరులలో హరిని ముందిడుటయు, నతనియద్వైతసిద్ధికిని—నన్నెచోడుడు కుమార సంభవమును రచించుటయు, తొలు దొల్త హరుని నుతించుటయు, నతని శైవమతాభిమానమునకు తార్కాణములు.

నన్నయ తన యవతారికలో దేవతాస్తవము, తరువాత దుర్భరతపోవిభవాధికుడును, గురుపద్య విద్యకు నాద్యుడును, అంబురుహగర్భ నిభుడునగు ప్రచేతన పుత్రుని నుతించెను. అనంతరము భారత భారతీ శుభగభస్తి చయంబుల జేసి ఘోర సంసార వికార సంతమసజాల విజృంభము వాపి, సూరిచేతో రుచిరాబ్జ బోధన రతుండగు దివ్య బరాశరాత్మజాంభోరుహ మిత్రు ముని పూజితు యశోవిరాజితుని గొల్చెను.

నన్నెచోడుడు

"కవితామృతో దయాంబుధి
కవి సజ్జన జనకు వస్తు కావ్యాబ్జ రవిన్
కవితారంభంబుల స
త్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్.,

నుతించెను.

సత్కవులనగా నన్నెచోడుని యుద్దేశములో నన్నయ. "కవితారంభంబుల,," అను మాటలోని స్వారస్యమును గమనింప—వాల్మీకి సంస్కృత కవితకు మూల పురుషు డనియు, తెనుగు కవితారంభమొనర్చిన నన్నయ ఆదికవి వాల్మీకిని నుతించెననియు తోచు చున్నది. నన్నయ గురుపద్య విద్యకు నాద్యుడని వాల్మీకిని ప్రస్తుతింప— నీతడాదికవియని వాకొనెను. కవితామృతోదయాంబుధి— కవి సజ్జన జనకున్— వస్తు కావ్యాబ్జ రవిన్ అను విశేషణములు నన్నయ కవితకు మెరుగులు దిద్దుట వంటిది. రెండవ పద్యములో వేద వ్యాసుని ప్రశంస నన్నయ వలెనే నన్నెచోడుడు నొనరించెను. అతడు, భారతాది పురాణ రచన పెద్ద పొగడదగినది కాదనియు, అజుడు కూడా సేయనో పని వేద విభాగ మొనరించుట కతన వేదవ్యాసుని నమస్కరింతుననియు దెల్పెను. ఇదియు నన్నయ వర్ణనకు మెరుగులు దిద్దుట వంటిది. ఎట్లన, నన్నయ యుత్పల మాలలో వేదవ్యాసుని పొగడియు వేదవ్యాసత్వము గూర్చి నుడువనే లేదు. నన్నెచోడుడా పురాణాది కర్తృత్వము ఘనము కాదనుచునే పొగడి, అతని వేద విభాగ నైపుణిని కొనియాడెను. తన యుద్దేశమది కానినాడు—రచింపని వేదములను విభజించిన వ్యాసుని కవిస్తుతిలో నన్నెచోడుడు చేర్చియే యుండడు. అనగా—అతని యుద్దేశంలో భారతకవి యగు వ్యాసుని పొగడినప్పుడు వేదవ్యాసత్వము పేర్కొనుట సముచితమని వాల్మీకి వ్యాసుల సంస్మరణానంతరము నన్నయ సత్వభాంతర సరసీవనంబులనే కొనియాడి యూర కుండెను. కాని, నన్నెచోడుడు మరి కొంచెము పురోగమించి కాళిదాస— భారవి— ఉద్భట— బాణులను పొగడినాడు. ఇచ్చట నన్నెచోడుని మతప్రీతి గమనింప దగినది. వాల్మీకి శైవకవికాకపోయినను పొగడెను. వేదవ్యాసుడు నమస్కారార్హుడే. సంస్కృత కవులలో, కాళిదాసు, భవభూతి, దండి, మురారి, మాఘుడు మొదలగు గొప్ప కవులున్నారు. వారిలో కుమార సంభవ రచయిత కనుక కాళిదాసునకు నమస్కరించి, తరువాతి స్థానము భారవి కిచ్చెను. ఇతడు కిరాతార్జునీయమును రచించుటయే యందుకు హేతువు. భారవి తరువాత కుమార సంభవమును గూఢ వస్తుమయ కావ్యముగ చెప్పిన యుద్భటుడును, కరములదునుమగా పరమేశ్వరు ప్రీతికరముగా కవిత్వము చెప్పి మగుడ కరములు వడసిన బాణుడును ప్రశంసింప బడిరి. మీద చెప్పిన కవులు స్తుతి పాత్రులే. సందియములేదు. కవిత్వ భక్తి భావములు రెండును ప్రధానముగ భావించి నన్నెచోడుడీ మార్గమును ద్రొక్కెను. హర విలాసములనుగ్గడించిన కవులనే నన్నెచోడుడు పేర్కొనినాడని తరువాతి శైవ కవులు భ్రమించుటకిది యాధారమైనది.

నన్నయ కవిస్తుతిలో దేశికవులను నుతింపనే లేదు. నన్నెచోడుడును పేరు పెట్టి నుతింప లేదు కాని —

" మును మార్గ కవిత లోకం
బున వెలయగ, దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగ పలువుర్,"

అని చాళుక్య రాజులను సంస్మరించెను. చాళుక్య రాజులనగా రాజ రాజ నరేంద్రాదులు. నన్నయ యుత్తమ చాళుక్యునిగ రాజరాజ నరేంద్రుని పొగడెను. నన్నయనాడు గ్రంథ రచన సంస్కృత మున జరుగ వలసినదే. కాని, తెలుగున గారాదు. అందుచేతనే చింతామణిని సంస్కృతములోనే రచించెను. నిక్షేపముగా తెనుగు వ్యాకరణమును తెనుగున రచించుకొనక సంస్కృత ములోనేల రచింప వలసి వచ్చెను.? దానికి కారణము నాటి యాంక్షయే. అంత వరకు సంస్కృత భాషా కావ్యములే రచించిన నన్నయను— ఆ మార్గము వదలి, దేశి కవిత్వమును చెప్పుమని ప్రోత్సహించిన వాడును రాజరాజే. మనకంటె నన్నయ కాలము

నకు సన్నిహితుడు కనుక నన్నెచోడున కీ విషయములు తెలిసి యుండ వచ్చును. అందుచేతనే దేశికవిత్వమున కాధారభూతు లయిన చాళుక్య రాజులు— అనగా రాజ రాజాదులు— నుతింప బడిరి. మార్గ దేశికవిత్వ లక్షణముల గూర్చి పెక్కు వాదోప వాదములయినవి.

అందులో తల దూర్చుట నాయభిమతము కాదు. అయినను నా యుద్దేశములో మార్గ కవిత్వమనగా సంస్కృత కవిత్వము· దేశికవిత్వమనగా తెనుగు కవిత్వము. ఈ క్రింది పద్యమును గమనింపుడు:—

'సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁ బూజ చేసి, ప
ద్మ్గరు చరణార విందములకుం దగసమ్మతిఁ జేసి కొల్చి వి
స్తర మతులం బురాణ కవిసంఘము, నుత్తమ మార్గ సత్కవీ
శ్వరులను,దేశి సత్కవుల,సంస్తుతిఁ జేసి మనో ముదంబునన్''

ఇందు పురాణ కవి సంఘమనగా వాల్మీకి వ్యాసులు. ఉత్తమ మార్గ సత్కవీశ్వరులనగా, కాళిదాస, భారవి, ఉద్భట, బాణులు· దేశి సత్కవులనగా చాళుక్య రాజాస్థాన కవులు నన్నయాదులు. ఈ సరళమగు నర్థమును మనము గ్రహింపని నాడు— "ఉత్తమ మార్గ'' మునకు శ్లిష్టమైన మార్గమును కేవల పదార్థము తోనే తృప్తి పడవలసి వచ్చును. దేశికవులను నన్నయ నుతింప లేదు. నన్నెచోడుడును పేరుపెట్టి నుతింప లేదు. ఆ యాచార మున కెందుచేతనో యీతడు వరవడి దిద్దలేదు. నన్నయ కవి నింద చేయలేదు. నన్నెచోడుడు కుకవినింద (నాలుగుపద్య ములలో) నొనర్చెను. ఈ సాంప్రదాయము నన్నయ నన్నెచోడుల నడిమి కాలములో నేర్పడియుండునని నా తలంపు. కుకవినింద చేయుటను ఘనత మనకు తెలిసినంతవరకు నన్నెచోడునకే చెందవలెను.

నన్నయ తన కవిత్వమును గూర్చి చెప్పిన క్రింది పద్యము సారస్వత విమర్శకులకు సుపరిచితమే. అది :— (సవర్ణముతో ప్రారంభింప బడినది)

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో
నారసి మేలునా, నితరులక్షర రమ్యత నాదరింప, నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయ భట్టు దెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.''

ఇక నన్నెచోడుని పద్యము :— (ఇదియు "స'' వర్ణముతో ప్రారంభింప బడెను.)

"సరళము గాగ భావములుజాను దెనుఁగున నింపు బెంపుతో
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన, నర్థములొత్తగిల్ల, బం
ధుర ముగఁ బ్రాణముల్ మధువృదుత్వరసంబునఁ గందళింపన
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయన లీల గ్రాలగాన్.''

ఈరెండు పద్యములు రేఫ ప్రాసగాగలవి. ఉత్పలమొకటి చంపకము వేరొకటి. ఇది యనాలోచితముగనే నన్నెచోడుడు చెప్పెనందురా ? ఎన్నటికిని కాదు. నన్నయ తన కవిత్వమున అక్షరరమ్యత ప్రధానగుణమన నన్నెచోడుడు తనయక్షరమున లార్యు లకు కర్ణరసాయన లీలగ్రాలు ననెను. 'అర్థ యుక్తిలో నారసి, యని నన్నయ చెప్పగా, అర్థము లొత్తగిల్ల, అని నన్నెచోడుని వాక్కు. నన్నయ " నానారుచిరార్థ సూక్తి నిధినని చెప్పి కొనగా, నన్నె చోడుడు తన సూక్తులు కర్ణ రసాయనము లనెను. నన్నయభట్టు " తెనుంగునన్,, అని పల్కగా, నన్నెచోడుడు " జాను దెనుంగు నన్,, అని చెప్పెను. చిట్ట చివరకు " బంధురుడయ్యె,, అను నన్నయ పదమును తలపించునట్లు నన్నెచోడుడు " బంధురముగ, అను పదమునే యుపయోగించెను. ఈ రెండు పద్యములు సోదర న్యాయముతోనొప్పారుచున్న వనుటలో నాశ్చర్యమేమున్నది? ఇదియు నన్నయ రచనకు మెరుగులు దిద్దుట వంటిదే. ప్రసన్న కథా కలితార్థయుక్తియు, అక్షర రమ్యతయు నన్నయ కవిత్వ ప్రధాన గుణములు కాగా, "ఇంపు బెంపుతోఁ బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల ప్రాణములు మధు మృదుత్వ రసంబున గందలించి కర్ణరసాయన సూక్తి గ్రాలుట'' నన్నె చోడుని కవిత్వ ధ్యేయ మైనది. సామ్యములు ముందే యుగ్గ డించితిని. కావ్య మెట్లుండ వలెనో యిప్పట్టున నన్నెచోడుడెనిమిది పద్యములలో చక్కగా వివరించెను. నన్నయకు సంక్షిప్త పద్ధతి యిష్టము కాగా నన్నెచోడునకు వివరణాత్మక పద్ధతి యిష్ట ము· కథాప్రధానకావ్య పద్ధతికి చెందిన వాడు నన్నయ కాగా, వస్తు మయ కావ్య పద్ధతికి చెందిన వాడు నన్నెచోడుడు. ఇచ్చట వస్తు వనగా వస్తువర్ణన యని గ్రహింప నగును. కావ్య మెట్లుండ వలెనో చెప్పుచునొక పద్యములో కావ్యరత్న వీధిని వర్ణించి, వేరొక పద్యములో "రత్న పుత్రికయు సత్కవి కావ్యమునొక్క రూపయై యుండ వలదా? యని ప్రశ్నించును. మరియొక పద్యమున " చీకు లావుకం దొక్కిన యట్లు నోర గొలదుల్ పురిగొల్పగా నందులోన నొక్కొక్కడు సక్కనైన గ్రుతియందురె? వాని మెత్తురే ?,, యని హేళన సేయును. ఇంకొక పద్యమున కృతిని వరసతితో పోల్చును. వేరొక పద్యములో " మదనాగంబును బోలెఁ గ్రాల వలదా? మూరెండు లేకున్నతిన్,, అని కృతికి మదనాగ లక్షణములు పట్టించును. సత్కవి కావ్యము, విలుకాని పట్టి నమ్మును సమానములు. పట్టినంత మాత్రమున జాలదు. పర హృద్ఛిద్రమై తలయూపింప వలయునట! అరువది నాలుగ, విద్యలు నేర్చిననే తప్ప కవిత్వము చెప్ప సమర్థుడు కాడనియు· నొకవేళ చెప్పినను, అది నిలువ దనియు నన్నెచోడుని నమ్మకము

కవిత్వ ప్రశంసయు, కావ్యలక్షణ నిర్ణయమును గావించి "జంగమ మల్లయ వరమునందు గనిన వస్తుతతి తగిరి వారి యందె నెగడింతు, నని తలపోసి, గురుడే యిష్టదైవము గాన నతనికి కృతి యిచ్చిన పెక్కు లాభములున్నవని, తన వంశావళిని దెల్పెను. ఇతడు సూర్యవంశపు రాజు. చోడ బల్లికి శ్రీ సతికి తనూజుడు. వీరశైవుడు కాడనుటకు,

" పాత్రుడ నసదృశ కాశ్యప
గోత్రుండ సచ్చరిత నుభయ కుల శుద్ధుండన్
మిత్రాన్వయ శేఖరు డఁ బ
వి(త్రీకృత దేహుడను వివిధ యజ్ఞ ములన్.,,

అను పద్యముపకరించును. నన్నయ తన కుల గోత్రాదుల నొక్క పద్యములో చెప్పి కొనగా నీతడు నాల్గు పద్యములలో వర్ణించు కొనెను. నన్నెచోడుడు వీరశైవ మతస్థుడు కానంత మాత్రమున శైవ మత విజ్ఞానము, పక్షపాతము లేవని తలంప రాదు. ఇతడు తన గురువునకు, పరమ శివునకు అభేదాధ్యవ సాయము చేసి షష్ఠ్యంతాదులు రచించెను. షష్ఠ్యంతములు నన్నయ కవితావతారికలో లేవు. ఈ సాంప్రదాయమునకును నన్నెచోడుడే ప్రారంభకుడు.

నన్నయ భారత పర్వానుక్రమణిక బేర్కొనగా, నన్నెచోడుడును నాచెప్పంబూనిన కథాసూత్ర మిట్టిదని

"సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతు ధ్వంస ముంబా
ర్వతి జన్మంబున్ భవోగ్రవ్రత చరితయు దేవ ద్విషత్ క్షోభమున్ శ్రీ
సుత సంహారంబు భూభృత్సుత తపము నుమా సుందరో(?) ద్వాహమున్ ద
గ్రదతి భోగంబున్ గుమారోదయము నతడనిం దారకుం బోర గెల్పున్.,,

తెల్పెను.

నన్నయ యవతారికలో నెల కొల్పిన సాంప్రదాయములను వీడక, తనకాలమునాటి సాంప్రదాయములను చొప్పించి, కొన్ని మెరుగులు దిద్ది, నన్నెచోడుడు తన కావ్యావతారికను సర్వాంగ సంపూర్ణముగ నొనరించి, తరువాతి తిక్కనాదికవుల కవతారికా రచనా మార్గ దర్శకు డయ్యెను.



# ఎం. ఎన్. రాయ్ తాత్త్విక దృష్టి

## శ్రీ కల్లూరి బసవేశ్వరరావు

ప్రఖ్యాత ప్రపంచ మేధావులలో ఎం. ఎన్. రాయ్ ఒకరు. ఆయన బహు భాషావేత్త. బహు శాస్త్ర కోవిదుడు. బహుముఖ ప్రజ్ఞ కలవాడు. అనేక శాస్త్రాలలో ప్రవేశమే గాక, అఖండ పాండిత్యమును సంపాదించిన మహా మనిషి. ప్రకృతి శాస్త్రములు, భౌతిక శాస్త్రములు ఆయనకు కరతలామలకాలు. సామాజిక శాస్త్రములు క్షుణ్ణములు. రాజకీయ శాస్త్రము కొట్టిన పిండి. ప్రతి శాస్త్రములో గల అత్యంత ఆధునిక సిద్ధాంతములను గూడ ఆకళింపు చేసుకున్నాడు. ప్రతి విషయమును అన్ని కోణముల నుండి, సమస్త శాస్త్రముల దృక్పథమునుండి సమగ్రముగా సమీక్షించి సమన్వయము చేయ గల మేధాసంపన్నుడు. అందువల్లనే ఆయన తత్త్వవేత్త కాగలిగినాడు. తత్త్వవేత్త కుండవలసిన ముఖ్య లక్షణము, లన్నియు ఆయనలో మూర్తీభవించి యున్నవి. సత్యాన్వేషణ, స్వేచ్ఛా పిపాస, జ్ఞాన సముపార్జన, హేతువాదము, నైతిక సంపత్తి, ఆత్మబలము—యివన్నీ ఆయన నొక జిజ్ఞాసువుగా, తత్త్వవేత్తగా, మానసోత్తమునిగా రూపొందించినవి. అయినప్పటికీ రాయ్ తన జీవితములో ఎక్కువ భాగము రాజకీయ రంగములోనే గడిపాడు. మెక్సికో, రష్యా, చైనా విప్లవములలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. భారతదేశమునకు తిరిగివచ్చి ఒక కొత్త రాజకీయ పార్టీని స్థాపించి, ఆ తర్వాత రాడికల్ హ్యూమనిజ మనే ఒక నూతన మానవతావాదన తత్త్వమును ప్రబోధించినాడు. ఈ విధముగా ఎం. ఎన్. రాయ్ కేవలము రాజకీయ వేత్తయే గాదు, శాస్త్రవేత్తయు, తత్త్వవేత్తయు కూడ. కేవలం కర్మవీరుడే కాదు, జ్ఞానవీరుడు, ధర్మ వీరుడు కూడ. అందువల్లనే రాయ్ మహాశయుని "రాజకీయవేత్తగా మారిన తత్త్వవేత్త" గా అభివర్ణించాడు శిబ్ నారాయణ్ రే.

పశ్చిమ బెంగాల్‌కు చెందిన 24 పరగణాల జిల్లాలలోని అర్బేలియా గ్రామంలో ఎం. ఎన్. రాయ్ 1887 ఏప్రియల్ మాసములో జన్మించాడు. తండ్రి దీనబంధు భట్టాచార్య. తల్లి పేరు బసంతకుమారి. రాయ్‌కి తలిదండ్రులు పెట్టిన పేరు నరేంద్రనాథ్ భటాచార్య. 1897 వరకు అర్బేలియాలో ఆయన నివసించాడు. 1897 నుండి తల్లిదండ్రులతోపాటు కొడాలియాలో ఉంటూ వచ్చాడు. హరన్‌బీ ఆంగ్ల—సంస్కృత పాఠశాలలో విద్యాభ్యాసము చేశాడు. 19 వ శతాబ్ది చివరి సంవత్సరములలో విప్లవ జాతీయోద్యమము బెంగాలులో ప్రారంభమైనది. నరేంద్రనాథ్ 14 ఏండ్ల చిరుత ప్రాయమునాడే విప్లవ జాతీయోద్యమములోనికి ఆకర్షింపబడినాడు. 1905 లో ఆయన తండ్రి గతించాడు. బెంగాల్ విభజనతో ఆ విప్లవ జాతీయోద్యమంలో ఆయన పూర్తిగా పాల్గొన్నాడు. 1907 డిశంబరులో కలకత్తాకు 12 మైళ్ల దూరంలో ఉన్న 'చింగ్రిపోటా' వద్ద నరేంద్రనాథ్ నాయకత్వం క్రింద మొదటి రాజకీయ దోపిడి జరిగింది. 1909 లో జతిన్ ముఖర్జీ నాయకత్వం క్రింద విప్లవకారు లందరు సంఘటిత పరుపబడినారు. నరేంద్రనాథ్ ఆయనకు కుడిభుజముగా ఉంటూ ఉండేవాడు. 1910 లో హౌరా కుట్రకేసు సందర్భములోను, 1915 లో గార్డెన్‌రీచ్ వద్ద జరిగిన రాజకీయ దొంగతనము సందర్భముగాను · నరేంద్రనాథ్ అరెస్టు చేయబడినాడు. ఆరోజులలో యితర విప్లవకారులతోపాటు బ్రిటిషు ప్రభుత్వముపై దేశ వ్యాప్తమైన సాయుధ తిరుగుబాటుకు సన్నాహము చేయుటలో నిమగ్నుడైనాడు. సంఘటితమైన దోపిడి ద్వారా డబ్బును కూడబెట్టుటకు పన్నాగము వేయబడింది. ఆర్థిక సహాయం కోసం, ఆయుధాల కొరకు జర్మన్లతో సంబంధం ఏర్పరచుకో

బడింది. 1915 ఏప్రియల్‌లో ఓడ మావరిక్ నుంచి జర్మన్‌లు పంపే ఆయుధాలను అందుకునేందుకు నరేంద్రనాథ్ జావా పంపబడినాడు. జూన్ మాసములో కొంత డబ్బుతో తిరిగి వచ్చినాడు. అయితే ఆయుధాలు మాత్రము తీసుకొని రాలేదు. తిరిగి జర్మనులు వాగ్దానము చేసిన ఆయుధ సామగ్రిని పంపారేమో తెలుసుకునేందుకు జావా వెళ్ళాడు. 1915 సెప్టెంబరులో జితిన్ ముఖర్జీ మరణించాడు. విప్లవ జాతీయోద్యమమును బ్రిటిషు ప్రభుత్వము నిర్దాక్షిణ్యముగా అణచివేసింది. కలుక నరేంద్రనాథ్ భారతదేశమునకు తిరిగి రాకుండా, చైనాకు జపాన్‌కు వెళ్ళి, ఇండియాకు ఆయుధములు సంపాదించుటకు యత్నించి విఫలుడైనాడు. చివరకు 1916 వ సంవత్సరం మారువేషములో క్రైస్తవ మతగురువుగా మార్టిన్ అనే పేరుతో అమెరికా వెళ్ళినాడు.

కాలిఫోర్నియాలోని స్టాండ్‌ఫర్డ్‌లో రెండు మాసములున్నాడు. అక్కడే ఎం. ఎన్. రాయ్ (మానవేంద్రనాథ్ రాయ్) అనే పేరు పెట్టుకొన్నాడు. స్టాండుఫర్డు పట్టభద్రురాలైన ఇవలిన్‌ను వివాహం చేసుకొన్నాడు. తర్వాత న్యూయార్కుకు వెళ్ళి లజపతిరాయ్ స్నేహాన్ని సంపాదించాడు. జర్మన్‌లతో తిరిగి సంబంధం పెట్టుకున్నాడు. ఇంతలో అమెరికన్ ప్రభుత్వము భారత విప్లవకారులపై ఆంక్షలు విధింపగా రాయ్ 1917 మార్చిలో తప్పించుకొని మెక్సికో చేరాడు. మెక్సికోలో ప్రెసిడెంటు కరంజాకు హితు డగుటయే గాక సోషలిస్టు వర్గాలతో సంబంధం పెట్టుకొని పనిజేశాడు. స్పానిష్ భాషలో పుస్తకములను, కరపత్రములను వ్రాశాడు. మార్క్సిజం అభ్యసించాడు. 1919 ఆగస్టు, సెప్టెంబరులలో జరిగిన మెక్సికో సోషలిస్టుపార్టీ జాతీయ మహాసభకు అధ్యక్షత వహించాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రతినిధి బరోడిన్‌ను కలుసుకొని మెక్సికో కమ్యూనిస్టుపార్టీని స్థాపించిన గౌరవమును పొందినాడు. తర్వాత లెనిన్ ఆహ్వానంపై 1919 నవంబరులో మెక్సికోను విడిచి రష్యా బయలుదేరి వెళ్ళినాడు. వి. గార్షియా పేరుతో ఉన్న మెక్సికన్ పాస్‌పోర్టుమీద ప్రయాణం చేశాడు. దారి మధ్యలో జర్మనీ కమ్యూనిస్టు పార్టీతో సంబంధము ఏర్పరచుకొని హెన్‌రిచ్ బాండ్లర్‌తో స్నేహాన్ని పెంచుకున్నాడు.

రష్యా చేరిన వెంటనే మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సమావేశములలో పాల్గొనవలసినదని లెనిన్ రాయ్‌ని కోరాడు. 1920 జులై—ఆగస్టు మాసములలో జరిగిన ఆ సభలలో రాయ్ మహాశయుడు ప్రముఖమైన పాత్రను నిర్వహించినాడు. వలసరాజ్యముల పరిస్థితి వివరణలో లెనిన్‌తో ఆయనకు అభిప్రాయభేదము వచ్చింది. వలసరాజ్యములలో బూర్జువా నాయకత్వము విప్లవపాత్ర నిర్వహింపగలదని లెనిన్ ప్రతిపాదింపగా, అట్లు జరుగుటకు అవకాశములు తక్కువనియు: వలసరాజ్యములలో బూర్జువా నాయకత్వము ఫ్యూడల్ విధానముల ననుసరించుననియు ఎం. ఎన్. రాయ్ ప్రతిపాదించినాడు. రాయ్—లెనిన్ సిద్ధాంతములు రెండును కొద్ది సవరణలతో అంగీకరింపబడినవి. 1928 వరకు ఎం. ఎన్. రాయ్ రష్యాలో ఉన్నాడు. అప్పటివరకు ఆయన అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడు. ఆసియాలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని స్థాపించి నడిపే బాధ్యత, మాస్కో ఈస్టరన్ యూనివర్సిటీలో ఆసియా కమ్యూనిస్టు నాయకులకు శిక్షణ యిచ్చే బాధ్యత ఆయనకు ఒప్పగింపబడింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమమును స్థాపించుటకు మానవేంద్రనాథ్ ఎక్కువగా కృషి చేశాడు. భారతీయ కమ్యూనిస్టులకు గ్రంథములు, కరపత్రములు, ధనము రహస్యముగా పంపేవాడు. ఈ సందర్భంలో ఆయన వ్రాసిన ముఖ్యమైన గ్రంథం "ఇండియా ఇన్ ట్రాన్సిషన్". అంతేగాక 1922 నుంచి ద్వైమాస పత్రిక "ది వాన్‌గార్డు ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్సు"ను నడిపాడు. అందులో నున్న వ్యాసములు ఎక్కువగా ఆయన వ్రాసినవే. ఆ పత్రిక మన దేశములో కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధికి తోడ్పడినది. ఈ చర్యవలన 1924 ఫిబ్రవరిలో జరిగిన కాన్పూరు కుట్ర కేసులో ఆయన భారత దేశములో లేనప్పటికీ బ్రిటిషు ప్రభుత్వమువారు ఆయననే ప్రధాన ముద్దాయిగా నిర్ణయించిరి.

1927లో యం.యన్. రాయ్‌ని అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ చైనా కమ్యూనిస్టుపార్టీ సలహాదారుగా చైనా పంపించింది. చైనాలో కమ్యూనిస్టులు సామ్రాజ్య వ్యతిరేక పోరాటములో బూర్జువా నాయకత్వమునకు తోడ్పడరాదని ప్రత్యామ్నాయ నాయకత్వం క్రింద రైతులు, కూలీలు, మధ్య తరగతి ఉద్యమమును సాగించాలని సలహా ఇచ్చాడు. కాని ఈ సలహాను చైనా కమ్యూనిస్టులు పాటింపలేదు. యం.యన్. రాయ్ చైనా నుండి తిరిగి వచ్చిన తర్వాత ఎక్కువ కాలము కమ్యూనిస్టు ఉద్యమంలో ఉండలేకపోయాడు. కమ్యూనిస్టు సిద్ధాంతమును, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ విధానములను ఆయన నిరసించాడు. స్టాలిన్ పద్ధతులను ఆయన విమర్శించాడ 1928లో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీతో తెగతెంపులు చేసుకున్నాడు. ఆ పిమ్మట సుమారు రెండు సంవత్సరాలు జర్మనీలో ఉండి అక్కడ ఫాసిజ మే విధంగా తలెత్తిందో గ్రహించినాడు. 1930 డిశంబరులో ఫోర్జరీ పాస్‌పోర్టుతో భారత దేశమునకు తిరిగివచ్చాడు. ఏడు మాసముల అజ్ఞాత వాసము తర్వాత 1931 జులైలో బ్రిటిష్ ప్రభుత్వము చేత అరెస్టు

# ఎం. ఎన్. రాయ్ తాత్త్విక దృష్టి

చేయబడినాడు. కాన్పూరులో కోర్టుకు లాగబడి 12 సంవత్సరములు కఠినమైన జైలు శిక్ష విధింపబడ్డాడు. అప్పీలు చేసుకొనగా శిక్షాకాలము ఆరు సంవత్సరములకు తగ్గింపబడినది. 1936 నవంబరులో ఆయన జైలునుండి విడుదలైనాడు. విడుదల అయిన వెంటనే కాంగ్రెసులో జేరి, మితవాద నాయకత్వం త్రోసిరాజని, విప్లవనాయకత్వము కొరకు పోరాడినాడు. రెండవ ప్రపంచ సంగ్రామము ప్రారంభ మయ్యేవరకు అఖిలభారత కాంగ్రెసు సభ్యుడుగా ఉన్నాడు. అయితే రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమైన తర్వాత ఆ యుద్ధము ఫాసిస్టు యుద్ధమనీ, ఫాసిజము యుద్ధములో జయించుట మానవాళి మనుగడకే ముప్పు కాగలదనీ, అందువలన భారతీయులు ఫాసిస్టు నియంతృత్వమునకు వ్యతిరేకముగా బ్రిటిషు ప్రభుత్వమునకు తోడ్పడవలయుననియు చాటినాడు. అంతేగాక యుద్ధము ముగిసిన తర్వాత బ్రిటిషు సామ్రాజ్యవాదము బలహీనమైన కారణముగా వలసరాజ్యములకు తప్పక స్వాతంత్ర్యము లభింపగలదని ముందుగానే ఊహించి చెప్పినాడు. కాని, కాంగ్రెసు తన సిద్ధాంతముల నంగీకరింపనందున 1940 డిశంబరులో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించి, తాను విశ్వసించిన సిద్ధాంతాల కొరకు దీక్షతో కృషి చేసినాడు. చరిత్ర ఎం. ఏన్. రాయ్ వేసిన అంచనాలు అసత్యములు కావని రుజువు చేసింది. ఆయన నాయకత్వములో రాడికల్ డెమోక్రాటిక్‌పార్టీ ప్రజాస్వామ్య సిద్ధాంతములను విరివిగా ప్రచారము చేసింది. 1946 నాటికి ఆయన మార్క్సిజమును సంపూర్ణముగా తిరస్కరించి, రాడికల్ ప్రజాస్వామ్యమున్ను వెలార్చి, దాని స్వరూప స్వభావములను విశదీకరించుచు 22 సూత్రములు రచించినాడు. రాడికల్ ప్రజాస్వామ్యమున 1948 లో రాడికల్ హ్యూమనిజమనే పేరు పెట్టి, ఆ తత్త్వ ప్రచారమునకు రాజకీయ పార్టీ తగిన సాధనము గాదని గుర్తించి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని రద్దుచేసి, హ్యూమనిస్టు లేక మానవతా ఉద్యమమును ప్రారంభించినాడు. మానవత్వ తత్త్వ వ్యాప్తికై 1948 నుండి అవిరళముగా కృషి సలిపి, 1954 జనవరి 25 వ తేదీనాడు స్వర్గస్థుడైనాడు.

రాజకీయ తాత్త్విక రంగములలో ఎం. ఎన్. రాయ్ వలె విశిష్టమైన అనుభవమును సంపాదించిన వేరొక వ్యక్తి ఈ శతాబ్దిలో లేడనుటలో అతిశయోక్తి లేదు. అయితే ఆయన అనుభవము అడవిగాచిన వెన్నెల కాలేదు. జాతీయ వాదములోను, కమ్యూనిజములోను అంతర్భూతముగా నున్న లోపములను ఆయన గ్రహింపగలిగాడు. మానవ ప్రాధాన్యము, విశిష్టత లోపించినందువలననే నేటి జాతీయ, అంతర్జాతీయ రాజకీయములు కలుషితమైపోతున్నవని భావించినాడు. అందువలన ఆ ఫలితములను తన రాజకీయానుభవమునకు జోడించి, వ్యక్తియే ప్రమాణముగా గల్గి, ప్రజాస్వామ్య సమాజ పునర్నిర్మాణానికి తోడ్పడు మానవతావాద తత్త్వమును ప్రతిపాదించినాడు. కారల్ మార్క్సు 1848 లో కమ్యూనిజమును ప్రవచించినాడు. పరోక్షముగా మార్క్సు శిష్యుడు, లెనిన్ సహచరుడూ అయిన ఎం. ఎన్. రాయ్, కమ్యూనిజములోని వైరుధ్యములను గ్రహించి 1948 లో రాడికల్ హ్యూమనిజమును ప్రవచించినాడు.

నూతన తత్త్వ నిరూపణములో రాయ్ మహాశయునికి ఎక్కువగా తోడ్పడినవారిలో ఆయన సతీమణి ఎలెన్‌రాయ్ ముఖ్యురాలు. ఎలెన్ ఫ్రాంసులో జన్మించింది. చదువుసాములన్నియు జర్మనీలో జరిగినై. యువతిగా ఉండగానే కమ్యూనిస్టు ఉద్యమమువైపు మొగ్గినది. ఆమెకు, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషలు బాగా వచ్చును. ఫ్రాజర్ వ్రాసిన "గోల్డెన్ బౌ" అన్న పుస్తకమును ఇంగ్లీషు నుండి జర్మన్ భాషలోకి అనువదించింది. 1930 లో ఆమెకు ఎం. ఎన్. రాయ్‌తో పరిచయ మేర్పడినవి. 1937 లో భారతదేశమునకు వచ్చినది. రాయ్‌ని వివాహము చేసుకొన్నది. రాజకీయ తాత్త్విక రంగములలో ఆయనతోపాటు కృషిచేసినది. డాక్టరుగా సహచరిగా, గృహిణిగా, కార్యదర్శిగా, శిష్యురాలుగా పనిచేసి రాయ్ మేధాశక్తికి, ప్రతిభకు ఒరిపిడిరాయిగా పనిచేసింది. రాయ్ మరణించిన తర్వాత హ్యూమనిస్టు ఉద్యమ వ్యాప్తికై పాటుబడినది. రాయ్ అముద్రిత గ్రంథములను, ఉపన్యాసములను సంకలనముచేసి కొన్ని పుస్తకములు ప్రకటించినది. 1960 డిసెంబరులో డెహ్రాడూన్‌లో స్వగృహమందు హత్య చేయబడినది. ఎలెన్‌రాయ్ అకాల మరణము భారతదేశములో హ్యూమనిస్టు ఉద్యమ వ్యాప్తికి తీవ్రాఘాతమని చెప్పక తప్పదు.

రాజకీయ, సాంఘిక వ్యవస్థలలో మార్పులు రావలయునన్న ముందుగా ప్రజలలో భావ విప్లవము రావలయునని మానవేంద్రుని తలంపు. పాత సిద్ధాంతముల ప్రాబల్యము తగ్గి విప్లవ భావములు ప్రజ్వరిల్లిన గాని సంఘము పురోగమింపదు. భారతీయులలో పేరుకొనిపోయిన అజ్ఞానాంధకారములు, అంధ విశ్వాసములు, మూఢాచారములు మానవేంద్రుని కలవరపరచినవి. వారిలోని మత దృష్టి, మాయావాదము, కర్మ—పునర్జన్మ సిద్ధాంతములు సంఘాభివృద్ధికి నిరోధకములై నిలచినవి. స్వాతంత్ర్యము నభిలషించిన ప్రజలలో స్వేచ్ఛా పిపాస ఉండవలయును గాని, సంప్రదాయమునకు దాసోహమను స్వభావము పనికిరాదు. పరతత్వముపై నున్న మమకారము కార్య కారణ తత్వముపై ప్రసరింపవలయును. జగన్నాటక సూత్రధారుని

శీలలపై గల వ్యామోహము సడలి శాస్త్రీయ దృక్పథము పెంపొందవలయును. అన్నింటికంటె రాయ్ మహాశయుని కలచిన ముఖ్య విషయ మేమంటే, భారతీయులు తమ "వెనుక చూపును", మత సంప్రదాయములను సమర్థించుకొను పద్ధతి. పాశ్చాత్యులు భౌతికవాదు లనియు', భోగలాలసు లనియు—భారతీయులు ఆధ్యాత్మికవాదులనియు, ఆధ్యాత్మి కౌన్నత్యములో వారికి సాటి రాగలవా రేనాడు లేరనియు భారతీయుల విశ్వాసము. ఇంతకుమించిన ఆత్మవంచన మరొకటి లేదని రాయ్ విశ్వాసము. ప్రాచీన కాలములో భారతీయులలో మూర్తీభవించిన శాస్త్రీయ దృక్పథము, లోకాయత వాదమును వారే విస్మరించుట విస్మయకరము. ఇతర దేశములలో ఆధ్యాత్మిక సంపద శూన్య మనుకొనుట శుద్ధ అవివేకము. మధ్య యుగాంతములో ఐరోపా ఖండములో ప్రజ్వరిల్లిన భావ వికాసోద్యమము (రినైజాన్సు) మన దేశములో రాకపోవుటయే యిట్టి అజ్ఞాన తత్త్వమునకు మూలకారణమని ఆయన గ్రహించినాడు. అందువలన ఆయన భారతీయ రినైజాన్సు ఉద్యమమును కొనసాగించి, భారతీయులలో హేతు దృష్టిని, శాస్త్రీయ దృక్పథమును, భావ విప్లవమును రగుల్కొల్పినాడు. వాస్తవమునకు ఇటువంటి భావ వికాసోద్యమమును 19 వ శతాబ్దిలో రాజా రామమోహనరాయ్ స్థాపించి గణనీయమైన కృషి చేసినాడు. కాని, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, బాలగంగాధర తిలక్, మహాత్మాగాంధి వంటి వారలు మత దృష్టితో భారతీయ రినైజాన్సు ఉద్యమమునకు ఎక్కువగా తోడ్పడలేకపోయినారు. మత విరహితమైన శాస్త్రీయ దృక్పథముతో ఎం. ఎన్. రాయ్ ఆ ఉద్యమమును పునః ప్రతిష్ఠించి దానికి ప్రాణము పోసినాడు. 1946 లో "ఇండియన్ రినైజాన్సు', ఇన్స్టిట్యూటును డెహ్రాడూన్‌లో స్థాపించి, హేతువాద వ్యాప్తికి, తాత్త్విక విప్లవమునకు ఇతోధికముగా కృషి సల్పినాడు.

"ఎం. ఎన్. రాయ్ గ్రంథాలయములను జీర్ణించుకొని గ్రంథాలయములను ఉత్పత్తి చేయగలడు" అన్నారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. రాయ్ మహాశయుడు రచించిన ప్రతి గ్రంథములోను మొదటి వాక్యమునుండి చివరి పేరా వరకు ఎడతెగని తర్కము, హేతుబద్ధమైన వాదనాబలము మనకు గోచరించును. ఆధునిక తత్త్వవేత్తలలో గాని పురాతన తత్త్వవేత్తలలోగాని ఒక సిద్ధాంతమును తనకు తానే విపులాతి విపులముగా విమర్శించుకొని, తనకు తానే ప్రశ్నలు వేసుకొని వానికి తనే సమాధానములు పరిశోధించి ఎంతటి జటిలమైన విషయమునైనా సులభముగా చెప్పుటలో రాయ్ వంటి వారు ఏ కొద్దిమందో ఉన్నారు. వివిధ భాషలలో ఆయన వ్రాసిన గ్రంథము లెన్నియో ఇంతవరకు ఖచ్చితముగా తేలలేదు. "ఇండియన్ రినైజాన్సు ఇన్స్టిట్యూట్" వారు ప్రకటించిన లిస్టు ప్రకారము మానవేంద్రుడు షుమారు 66 గ్రంథములు, 40 కరపత్రములు వ్రాసియున్నాడు. ఇవిగాక ఇంకా ఎన్నో అముద్రిత గ్రంథములు, ఉపన్యాసములు ఉన్నవి. అచ్చుకెక్కని గ్రంథములలో అత్యంత ప్రధాన మైనది "Philosophical Consequences of Modern Science" ఈ బృహద్గ్రంథమును ఆయన 9 భాగములుగా వ్రాసియున్నారు. అవసరమైన కొన్ని చేర్పులు మార్పులతో ఈ గ్రంథమును సవరించి ప్రకటించుట ఇండియన్ రినైజాన్సు ఇన్స్టిట్యూట్ వారి ప్రధాన కార్యమై యున్నది. రాయ్ మహాశయుడు నడిపిన పత్రికలలో Independent India ప్రసిద్ధి కెక్కినది. 1937 లో స్థాపింపబడిన యీ వార పత్రిక ఈనాడు కూడ The Humanist way అను పేరుతో నడుచు చున్నది.

మానవేంద్రుడు వ్రాసిన ముఖ్య గ్రంథములను ఈ క్రింది విధముగా విభజింపవచ్చును :—

I ప్రధాన చారిత్రక గ్రంథములు :—

(1) The Russian revolution.
(2) Revolution and Counter Revolution in china.
(3) From Savagery to Civilisation
(4) The Historical role of Islam
(5) Reason, Romanticism and Revolution.

II సైన్సుకు— తత్త్వశాస్త్రమునకు సంబంధించిన రచనలు :—

(1) Man and Nature.
2 Science and Superstition.
(3 Science and philosophy
(4) Philosophical Conseqnences of Modern Science.

III భారతదేశములో భావవికాసోద్యమమునకు సంబంధించిన రచనలు. :—

(1) Materialism
(2) Gandhism, Nationalism and Socialism
(3) War and Revolution
(4) Nationalism, an Antiquated cult

(5) Jawaharlal Nehuru
(6) India's Message.
(7) Crime and karma; Cats and women

IV మానవతావాద తత్త్వ పరిణామమును, స్వరూప స్వభావములను వెలువరించు పుస్తకములు :—

(1) Scientific politics
(2) New orientation
(3) Beyond Communism
(4) New Humanism
(5) Radical Humanism.

ఎం. ఎన్. రాయ్ ప్రతిపాదించిన హ్యూమనిస్టు తత్త్వమును విశదీకరించుచు ఎలెన్‌రాయ్ "In Man's own Image" అను గ్రంథమును, శిబ్ నారాయన్ రే "Radicalism" అను పుస్తకమును వ్రాసియున్నారు.

చివరి రోజులలో రాయ్ తన జీవితానుభవములను వెలువరించి వానికి "స్వేచ్ఛాన్వేషణ" (In Quest of Freedom) అని నామకరణము జేశాడు. నిజమునకు రాయ్ జీవితమును స్వేచ్ఛాన్వేషణ అనుటయే సమంజసము. ఒక సందర్భములో రాయ్ మహాశయు డిట్లు వ్రాసియున్నాడు :— "నేను 14 సంవత్సరముల వయస్సులో స్కూల్ విద్యార్థిగా నున్నప్పుడే రాజకీయ రంగములో దుమికితిని. స్వాతంత్ర్యేచ్ఛ ఆనాడు నన్ను ఉత్తేజ పరచినది. నన్నే గాదు, అనేకమంది జాతీయ వీరులను స్వాతంత్ర్యేచ్ఛ కార్యరంగములోనికి దుమికించినది. వారు జైళ్లను లెక్కచేయలేదు. ఉరికంబములను చూచి భయపడలేదు. ఆనాడు వారు కారల్ మార్క్సును గురించి ఎరుగరు. శ్రామిక నియంతృత్వ మన నేమో వా రెరుగరు. స్వేచ్ఛాపిపాసయే వారిని కదలించిన మహోన్నత లక్ష్యము. ఆనాటినుంచి నేటివరకు స్వేచ్ఛాన్వేషణయే లక్ష్యము. ధ్యేయము. కారల్‌మార్క్సు రచించిన 'దాస్ కాపిటల్' గాని, ఆయన అనుయాయులు రచించిన గ్రంథ జాలముగాని నన్ను ఉత్తేజపరచుటలేదు." దేశ స్వాతంత్ర్య సంపాదనా కార్యక్రమముతో రాయ్ మహాశయుని స్వేచ్ఛా యాత్ర ప్రారంభమైనది. ఈ యాత్రలో ఆయన్ను అనేక జాతీయ, అంతర్జాతీయ దశలు చూచినాడు. ఒకప్పుడు జాతీయవాదమును, మరొకప్పుడు కమ్యూనిజమును విశ్వసించి, చివరకు వ్యక్తి స్వేచ్ఛ ప్రాతిపదికగా గల ప్రజాస్వామ్యమును వరించినాడు. రాయ్ జీవితయాత్రలో విరుద్ధ భావముల మధ్య, పురోగామి, ప్రతీపగామి శక్తుల మధ్య జరిగిన సంఘర్షణలు, నిర్మాణాత్మకమైన విప్లవ పరిణామాలు మనకు స్పష్టముగా గోచరించును. అందువలన రాయ్ "స్వేచ్ఛాన్వేషణ" గత అర్థ శతాబ్దిలో జరిగిన భావ పరిణామ చరిత్ర. ప్రజాస్వామ్యవాదములకు సోదాహరణమైన చక్కని నిఘంటువు. ఇటీవల మానవ దృక్పథములో కలిగిన విప్లవమునకు ఒక నిదర్శనము.

## 2

ఎం. ఎన్. రాయ్‌కి మనిషి ముఖ్యము. ఏ వంకతోనైనా సరే మానవ స్వాతంత్ర్యేచ్ఛ అరికట్టబడగూడదని ఆయన ఉద్దేశము. ఈనాడు మానవుడు అనేక సిద్ధాంతముల మధ్య నలిగిపోవుచున్నాడు. అతని మానవత అనేక నెపములతో, అనేక రూపములలో సంకుచిత మౌతున్నది. మానవుడెంతో విజ్ఞానమును, నాగరకతను సంపాదించుకున్నాడు. అయినా అతనికి కావలసిన శాంతి, సౌఖ్యము, స్వేచ్ఛ నానాటికి దూరమైపోతున్నవి. భయము, అశాంతి, విద్వేషము పెచ్చుపెరిగిపోతున్నవి. గత 50 సంవత్సరములలో రెండు భయంకర ప్రపంచ సంగ్రామాలు జరిగినవి. దారుణ మారణహోమ మయింది. అగ్రరాజ్యముల కూట తంత్రములు పెరిగినవి. ప్రచ్ఛన్నయుద్ధము ప్రబలమైనది. ప్రత్యక్ష యుద్ధములు జరుగుతూ ఉన్నవి. మానవ విజ్ఞానము ఎంతగా పెరిగినప్పటికీ, ఈ అవ్యవస్థకు, ఈ అశాంతి విద్వేషములకు మూల కారణము ఏమిటి ? జాతీయ, అంతర్జాతీయ విషమ పరిస్థితులకు ఆలవాల మేమిటి ? ఇటువంటి ప్రప్రధానమైన సమస్యలను గురించి ఎం. ఎన్. రాయ్ పరిశోధించాడు. ఈనాటి విషమ స్థితికి సాంస్కృతిక అవ్యవస్థయే ప్రధాన కారణమని రాయ్ అభిప్రాయము. మానవుని విజ్ఞానము, భౌతిక నాగరకత విస్ఫారినంతగా అతనిలోని నైతిక బలము, మానసిక స్థాయి, న్యాయ దృష్టి పెరుగక పోవుటయే ఇందుకు ప్రధాన కారణము. మానవునిలోని నైతికశక్తి, త్రికాలా బాధితమైన మానవ విలువల పట్ల అతని కుండవలసిన పట్టుదల క్షీణించిపోవుటకు ఈనాడు మానవజీవితమును, సాంఘిక గమనమును దిద్ది తీర్చుచున్న కొన్ని సిద్ధాంతములే ప్రబల కారణము. మానవునకు కావలసిన స్వేచ్ఛ, సౌఖ్యము, శాంతి మతము వలన గాని, ఆధ్యాత్మిక దృష్టి వలన గాని లేదా జాతీయవాదము, ఫాసిజము, కమ్యూనిజము మొదలయిన తత్త్వముల వలన గాని లభింపవని మానవేంద్రుని అభిప్రాయము. ఈ సిద్ధాంతములన్నియు మానవ స్వేచ్ఛను అరికట్టి మానవత్వమును కుంచింపగలవని ఆయన తీర్మానము.

ఆధ్యాత్మికవాదము భగవంతుని సృష్టించి, సృష్టి కార్యక్రమమును ఆయన చేతుల్లో పెట్టి మానవుని కీలు

బొమ్మను చేసినది. ఆధ్యాత్మిక తత్త్వము నైతిక విలువలను బోధించు మాట నిజమే. అయితే ఈ నైతిక విలువల పుటుకను అది సిద్ధాంతీకరింపలేదు. మానవునకు అతీతముగా ఉండే ఏదో శక్తికి దానిని ముడిపెట్టుతున్నది. అందువలన "మానవుడు నీతిగా ఎందుకు బ్రతుకవలయును ?" అను ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేక పోయినది. కొందరు మానవులు అవినీతిగా బ్రతుకుచు అనేక భౌతిక సుఖములను పొందగల్గుచున్నారు. మరికొందరు నీతిగా ఉండుటకు యత్నించి అనేక కష్టనష్టములకు గురియగుచున్నారు. ఎందుకిలా జరుగుతున్నది? ఈ ప్రశ్నకు పూర్వ జన్మను గాని, కర్మ సిద్ధాంతమును గాని జవాబుగా అడ్డుపెట్టి ఆధ్యాత్మిక తత్త్వము అసలు సమస్యను మరుగుపరచు చున్నది. పాశ్చాత్య దేశములలో క్రైస్తవమతము, మనదేశములో హిందూమతము ఇంకా ఇతర మతములు ఈ దృష్టినే ప్రచారము చేసినవి. కాని ఈ మత దృష్టి మానవుడు నీతిగా ఉండుటకు ప్రధాన కారణము, అతనిలో పరమాత్మాంశయైన "ఆత్మ" యే కారణము అనుట వలన మానవుని ప్రాధాన్యము క్షీణించినది. మానవుడు తనకు తాను నీతిగా బ్రతుకజాలడనియు అతీతమైన శక్తికి లోబడినందు వలననే అతనిలో న్యాయదృష్టి, నైతిక శక్తి ఉండగలవనియు ఈ రకమైన సనాతన మత దృష్టి ప్రచారము చేసినది. ఇందు వలన మానవుడు పరమాత్మ చేతిలోని ఆట వస్తువుగా దిగజారి అతని స్వతంత్రం దెబ్బతిన్నది. పైగా మతము తన ఆదర్శమును తానే రూపు మాపుకొన్నది. ఈ మత దృష్టికి వ్యతిరేకముగా పాశ్చాత్యదేశములలో లిబరల్ తత్త్వవేత్తలు "నీతిగా ఉండుట ప్రయోజనకారి" అను సిద్ధాంతమును ప్రచారము చేసినారు. అయితే "ప్రయోజన మంటే ఏమిటి?" అనే ప్రశ్న వలన ఈ సిద్ధాంతము ముక్కలయినది. ఒక్కొక్కరు ఏదో ఒక ప్రయోజనమును స్థిరపరచుకొనుట, దానిని సాధించి పెట్టునదియే నీతి అనుకొనుట జరిగినది. ఇందువలన నీతికి నిల బడుటకు ఆధారమూ కూడలేకుండ పోయింది.

సామ్రాజ్య వాదమునకు వ్యతిరేకముగా 20—వ శతాబ్దంలో జాతీయ వాదము బయలుదేరినది. ముఖ్యముగా ఆసియా, ఆఫ్రికాఖండములలో సామ్రాజ్యములంతరించుటయే దాని లక్ష్యము. నిజానికి సామ్రాజ్యములంతరించి వలస దేశములు స్వాతంత్ర్యమును పొందుటకు జాతీయ వాదముమెంతగానో తోడ్పడినది. అయితే ఈనాడు జాతీయ వాదమనుసరణీయమైన సిద్ధాంతమా? అది విప్లవాత్మక పరిణామములను తీసుకొని రాగలదా? మానవ స్వేచ్ఛా వికాసమునకు తోడ్పడగలదా? అను ప్రశ్నలు వేసుకొనవలసియున్నది. జాతీయ వాదము దేశమునకు దేశ ఔన్నత్యమునకు ఇచ్చిన ప్రాధాన్యమును వ్యక్తి వికాసమున కివ్వదు. ముదిరిన జాతీయ వాదము ఇతర దేశముల పట్ల ద్వేష మునకు, సామ్రాజ్య కాంక్షకు దారితీయ గలదు. అందువలన జాతీయతత్త్వము ప్రపంచ శాంతికి నిరోధకమే కాగలదు. ఈ కారణములవలన యం.యన్. రాయ్. 20వ శతాబ్దిలో జాతీయ వాదము విప్లవకర పాత్ర నిర్వహింప లేదనియు, దానికి కాలదోషము పట్టినదనియు తేల్చినాడు. జాతీయ వాదమువలె ఫాసిజము కూడా దుష్ట సిద్ధాంతమే. పతనావస్థలో నున్న కాపిటలిజానికి ప్రతిగా ఫాసిజం తలెత్తినది. కాపిటలిస్టు సమాజములోని అసమాన తత్త్వమును సుస్థిరము చేసి, విప్లవములను అరికట్టవలయునని ఫాసిజం వాంఛిస్తున్నది. జాతీయ రాజ్యము యొక్క అధికారమును విస్తృతముచేసి, వ్యక్తి స్వేచ్ఛకు అవకాశ మివ్వకుండ, వ్యక్తిని జాతీయ రాజ్యమునకు కొరముట్టుగా, లోకువగా భావిస్తున్నది. జాతీయ రాజ్యమును ప్రకోపింపచేసే ఈ సిద్ధాంతము అంతర్జాతీయ సహకారమునకు తోడ్పడదు. కాగా ఫాసిజము వలన ప్రపంచశాంతి, మానవ స్వేచ్ఛ మృగ్యమై పోగలవు.

ఒకప్పుడు యం.యన్. రాయ్ ప్రపంచ మార్క్సిస్టులలో అగ్రగణ్యుడుగా భావింపబడినాడు. ఆయన మార్క్సిజమును సునిశితముగ అధ్యయనము చేయుటయేగాక, తద్వ్యాప్తికై కొన్ని సంవత్సరములు అవిరళముగా కృషి సల్పినాడు. కారల్‌మార్క్సు సిద్ధాంతములు లోక కళ్యాణదాయకములని ఆనాడు ఆయన గట్టిగా విశ్వసించినాడు. కాని స్టాలిన్ నాయకత్వమునకు వచ్చిన పిమ్మట సోవియట్ యూనియన్‌లో జరిగిన దారుణ హింసాకాండ ఆయనలో జిజ్ఞాసను రేకెత్తించినది. ముఖ్యముగా రెండవ ప్రపంచ సంగ్రామ ప్రారంభంలో స్టాలిన్ మానవ స్వాతంత్ర్యమునకు ప్రధాన శత్రువని చెప్పదగిన హిట్లరుతో ఒడంబడిక చేసుకొనుట ఆయనకు దిగ్భ్రాంతి కలిగించినది. ఫాసిస్టు నియంతయైన హిట్లరు విజృంభించి ఐరోపాఖండములోని దేశములన్నింటిని కబళించుచుండగా కమ్యూనిస్టు రష్యా తటస్థముగా ఉండవలసిన అగత్యమేమి? సామ్రాజ్యవాదముగా పరిగణింపబడుచున్న బ్రిటన్ ముందుకు వచ్చి ఫాసిస్టు యుద్ధమునకు వ్యతిరేకముగా నడుముకట్టి నిలబడుటయేమి? మానవ విలువలపట్ల—స్వేచ్ఛ పట్ల సోవియట్ రష్యా ఎందుకు తన అభిప్రాయ అభినివేశమును—ప్రేమను చాటుకొనలేదు.? యుద్ధములో పాల్గొన్న తరువాత సోవియట్ యూనియన్ తన ప్రజలలో జాతీయతను ప్రచారము చేసినదే గాని, మానవత్వ విలువలను గాదు. సోవియట్ యూనియన్ ఏవిధముగా ఆశించిన ప్రకారము విప్లవకర పాత్ర నిర్వహింపలేకపోయినదో సోపపత్తికముగా రాయ్ తన "రష్యా విప్లవము" అను గ్రంథములో వివరించి యున్నాడు. రష్యా చరిత్ర, చైనాలో అనుభవాలు అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థతో ఆయనకు గల సన్నిహిత సంబంధాలు

కాలక్రమేణా కమ్యూనిజము పట్ల ఆయన కున్న గౌరవ ప్రవృత్తులను తొలగించినవి. అంతేకాక మార్క్సిజమును తరచి తరచి అందులోని లోపములను వెలువరించుటకు కూడ ఆయనను ప్రోత్సహించినవి. 1940 తర్వాత వ్రాసిన అనేక గ్రంథములలో యం.యన్. రాయ్ మార్క్సిజములోని లోటుపాట్లను చర్చించినాడు. ముఖ్యముగా "బియాండ్ కమ్యూనిజం" అను గ్రంథములో ఈ విషయమున కెక్కువ ప్రాధాన్య మివ్వబడినది. ఈనాడుకూడా మనదేశములో చాలా మంది మార్క్సిజమును కమ్యూనిస్టు విధానములను వేద ప్రమాణములుగా స్వీకరించుచున్నారు. కమ్యూనిస్టు విధానముల వలన భూతలం స్వర్గము ఏర్పడ గలదని భావించుచున్నారు. ఇటువంటి అంధ విశ్వాసములు తొలగుటకు సత్యము నెరుగుటకు రాయ్ రచనలు ఎక్కువగా తోడ్పడగలవు. కాన మార్క్సిజముపై రాయ్ వ్రాసిన విమర్శ నిట స్థూలముగా పరామర్శ చేయుదును.

(1) కారల్ మార్క్సు, ఏంగిల్సు మహాశయులు 19వ శతాబ్ది మధ్యలో మార్క్సిజమును రూపొందించినారు. మార్క్సిజమునకు ప్రాణతుల్యమైన సూత్రములు మూడు:— (1) తాత్త్విక రంగములో గతి తర్కము. (2) సాంఘిక రంగములో వర్గ కలహము. (3) ఆర్థిక రంగములో అదనపు విలువ. ఇంగ్లీషులో డైలెక్టిక్ అన్న పదమునకు గతి తర్కమని చెప్పుకొనుచున్నాము. ఈ పదమును ప్రత్యేక శాస్త్రీయ పదముగా ప్రయోగించి దానికి విశిష్టమైన అర్థమును కల్పించిన వాడు జర్మన్ తత్త్వవేత్త అయిన హెగెల్. ఇతడు వాడిన అర్థములో డైలెక్టిక్ అన్న పదమునకు గతి తర్కమనీ, ఇతని సిద్ధాంతమును త్రికవాదమనీ చెప్పుకోవచ్చును. హెగెల్ మతం ప్రకారం ఈ విశ్వమే బ్రహ్మము (ది ఐడియా). విశ్వములోని వస్తుకోటికి విశ్వమునకు, అంగాంగీ సంబంధమున్నది. అనగా అంగ సమాహారముకంటె అంగి విశిష్టమైనట్లుగా విశ్వములోని వస్తు సమాహారముకంటె విశ్వము విశిష్టమైనది. హెగెల్ సిద్ధాంతములో ద్వంద్వాలకు ఐక్యము చెప్పుకొనుట అత్యంతముఖ్యము. వెలుగు నీడలు, మంచి చెడ్డలు, రాగద్వేషాలు, విషయి విషయాలు మొదలగు ద్వంద్వాలకు అతడు ఐక్యము ప్రతిపాదించును. బ్రహ్మము ద్వంద్వైక్య గర్భితము. అందువలన ఇటువంటి అంతర్గత వైరుధ్యమును పరిహరించు కొనుటకై బ్రహ్మము పరిణమిస్తుంది. ఈ పరిణామము అనుయోగి (Thesis) ప్రతియోగి (Anti Thesis) సంయోగి (Synthesis) అన్న త్రికము ద్వారా జరుగుతున్నది. బ్రహ్మము అంతర్గత వైరుధ్య పరిహరణార్థమై, సాగించు పరిణతివలన ఈ ప్రకృతి, చరాచర ప్రపంచము, చరిత్ర, సాహిత్యము, మతం, తత్త్వశాస్త్రము కలుగుచున్నవి. బ్రహ్మ మొక్కటే నిత్యము,

పూర్ణము, పరమ సత్యము. త్రిక గతిలో బ్రహ్మ పరిణామము అనివార్యము. ఈ పరిణామములో పూర్వ పూర్వ దశలకంటే ఉత్తరోత్తర దశలు విధిగా అభివృద్ధి బలీయములు. త్రికగతిని తెలుసుకొని భజించుట ద్వారా మానవుడు స్వాతంత్ర్యమును పొందుచున్నాడు.

హెగల్ భావ వాది. కారల్ మార్క్సు భౌతిక వాది. అయినప్పటికి హెగెల్ ప్రతిపాదించిన గతి తర్కమును కారల్ మార్క్సు స్వీకరించి భౌతిక వాదమునకు అన్వయించినాడు. అందువలన మార్క్సు ప్రతిపాదించినది గతి తార్కిక భౌతిక వాదమవుతున్నది. గతి తర్కము ప్రకృతిని గురించి, మానవ సమాజము, భావములను గురించి, వాని పరిణామములోని సామాన్య సూత్రములను గురించి తెలిపే శాస్త్రమని మార్క్సిస్టుల తీర్మానము. అనగా మార్క్సీయ గతి తర్కము ఒక పక్షమున తర్క శాస్త్రము, (Pure Logic) వేరొక పక్షమున జ్ఞానస్వరూప శాస్త్రము, (Epistemology) మరొక పక్షమున వస్తుతత్త్వ నిరూపణ శాస్త్రము, (ontology) అవుతున్నది. అయితే తర్క శాస్త్రము, జ్ఞాన స్వరూపనిరూపక శాస్త్రము, వస్తుతత్త్వనిరూపణ శాస్త్రము—ఈ మూడును విభిన్నములయిన శాస్త్రములు ఈమూడు శాస్త్రముల సంపుటియే గతి తర్కము అనుట సమంజసముగాదు. ఈవిధముగా ఆయా శాస్త్రముల మధ్యగల భేదమును గుర్తింపక గతి తర్కము భ్రాంతి కూపములో పడుతున్నది. అంతే కాక తర్క శాస్త్రములో ప్రధానమైన ఒక సూత్రమున్నది. అదేమిటనగా :— పక్షము ప్రతి పక్షము కాదు. ఉదాహరణకు వాదనలో గుఱ్ఱము అంటామనుకోండి. అటువంటి పట అది గుఱ్ఱము కానిది కారాదు. అయితే మార్క్సీయగతి తర్కము ఈ సూత్రమును త్రోసి రాజంటున్నది. లేనిచో గతి తర్కము వలన ద్వంద్వములకు ఐక్యము చెప్పుకొనుటకు వీలుపడదు. ఈ విధముగా గతి తర్కము తర్క శాస్త్ర సూత్రమును ఉల్లంఘించి శాస్త్ర తత్త్వమునకే దూరమవుతున్నది. అన్నింటికంటే ముఖ్యమైన లోప మేమిటనగా యం. యన్. రాయ్ చెప్పినట్లు, భౌతిక గతి తర్కము స్వయం బాధితము. కారల్ మార్క్సు భౌతిక వాది. ఆయన మతము ప్రకారము ఉనికి మీద జ్ఞానము ఆధారపడి ఉన్నది. భౌతిక ద్రవ్యము అచేతనము. కాని గతి తర్కము భావముల గతికి సంబంధించినది. భావములు చైతన్యములోనివి. గతి తర్కము ఒక రకమైన ఆలోచనా విధానము. ప్రకృతిగాని, చరిత్రగాని ఆలోచింపలేవు. ఆలోచింప గలవారు వ్యక్తులే. అచేతన భౌతిక ద్రవ్యమునకు తర్కమనేది ఎలా ఉండగలదు.? గతి తర్కమును భౌతిక వాదమును కలుపుట అసంగతము. గగన సూనము వలె నిది స్వయం బాధిత మవుతున్నది. పైగా ఇంతవరకు అభివృద్ధి చెందిన గణిత శాస్త్రము గాని, భౌతిక శాస్త్రము గాని గతి తర్కమును సమర్థించుట లేదు. అందు వలన గతి తర్కమును ఏ రూపములో ఆమోదించినప్పటికి విచార ప్రపంచములోనికి అవ్యవస్థను ఆహ్వానించుటయే కాగలదు. అనుయోగి, ప్రతి యోగి సంయోగి, అన్వవిత్రికమనియు, ఈ త్రికధార ద్వారా బ్రహ్మము పరిణమించుననియు హెగెల్ నిర్ధరించినాడు. అశాస్త్రీయమైన ఈ త్రిగతిని మార్క్సు, ఏంగిల్సు మహాశయులు స్వీకరించినారు. భౌతిక ద్రవ్యమే గాక, సమాజము కూడ త్రిక గతిలో పరిణమిస్తున్నవని వారి సిద్ధాంతము. త్రికమును ఆమోదించినప్పుడు పరిణామము అనివార్య మవుతున్నది. త్రిక ధారా పూర్వకమైన పరిణామములు కంటే అతి రిక్తమైనది లేదు. కనుక త్రిక గతిని తెలుసుకొని తదనుగుణముగా వర్తించుటయే స్వాతంత్ర్యము. రానున్న దశకు అనుగుణముగా ప్రవర్తించుట యే ధర్మము.

(2) మార్క్సీయ గతి తర్కము చరిత్ర పరిణామమునకు సమగ్రముగా అన్వయిస్తుందని సాధారణముగా భావించుట కద్దు. మార్క్సు మతం ప్రకారం సంఘములో బయలుదేరే భావ పరంపర, నైతిక విలువలు, సంస్కృతి, ధర్మము, చట్టములు మొదలగునవి ఆయా దశలలోని ఆర్థిక పరిస్థితులపై నాధారపడి ఉంటవి. సంఘ గమనమును అర్థము చేసుకొనవలయునన్న రెండు ప్రశ్నలు వేసుకొనవలయును. సమాజములో గల ఉత్పత్తి సాధనము లేవి ? ఆ ఉత్పత్తి సాధనములు ఎవరి అధీనములో ఉన్నాయి ? ఉత్పత్తి సాధనములేవో తెలుసుకొన్నచో ఆ సమాజ మెంతవరకు అభివృద్ధి చెందినదో చెప్పగలము. ఆ ఉత్పత్తి సాధనములు ఎవరి అధీనములో ఉన్నవో దానినిబట్టి అప్పటి వర్గ సంబంధములు తెలియగలవు. ఉత్పత్తి సాధనాలు అధీనమందున్న వర్గ మెప్పుడూ పాలక వర్గ మౌతుంది. ధర్మము, చట్టము, శాస్త్రము, కళలు మొదలయిన వన్నియు పాలక వర్గమున కనుకూలముగా నుండును. మార్క్సు, ఏంగిల్సు మహాశయులు చరిత్రను పరిశోధించి వర్గ కలహమే మానవ చరిత్రయని తీర్మానించారు. జమీందారీ యుగములో జమీందారీ—రైతు వర్గాల మధ్య, పెట్టుబడిదారీ యుగములో పెట్టుబడుదారులు—శ్రామిక వర్గాల మధ్య సంఘర్షణ ఉన్నదనీ, ఈ సంఘర్షణ అనివార్యమనియు, ఈ వర్గ సంఘర్షణ వలననే మానవ చరిత్ర పురోగమించుచున్నదనియు, పెట్టుబడిదారీ యుగము నుండి వర్గరహితమైన కమ్యూనిస్టు యుగములో ప్రవేశింపగలదనియు వారు స్థిరీకరించినారు. వారు ఎక్కువగా భూస్వామ్య విధానము, పెట్టుబడిదారీ విధానము, సోషలిజము—అన్న త్రికగతిలో ఆసక్తి తీసుకొన్నారు. ఈ త్రికగతిలో చరిత్ర

పరిణమించుటకు ఉత్పత్తి సాధనములు ప్రధాన కారణము. అందువలన మార్క్సీయ చరిత్ర పరిణామమును ఆర్థిక నియతివాదముగా పేర్కొనవచ్చును. ఈ పరిణామము వర్గ సంఘర్షణ మూలమున తప్ప సిద్ధింపదు గాన వర్గ పోరాటమే మానవ చరిత్రగా చెప్పుకొనవచ్చును.

ఎం. ఎస్. రాయ్ ఆర్థికదృష్టితో చరిత్రను వ్యాఖ్యానింపడు. చరిత్ర కొన్ని నియమములకు లోబడి నడుస్తూ ఉంటుంది. ఆ నియమములలో ఉత్పత్తి సాధనములు ఒక్క కారణము మాత్రమే. "అంతయు ముందుగానే నిర్ణయింపబడి ఉన్నచో, మానవుడు చరిత్రను ఏవిధముగా సృష్టింపగలడు ? సంఘటనలు ఒకదాని నొకటి అనుసరించుచున్నచో, మానవునకు వానితో ఎట్టి సంబంధము ఉండదు. అప్పుడు అతడు ఆర్థిక దేవత చేతులలో కొరముట్టు మాత్రమే" అంటాడు రాయ్. విప్లవము యొక్క ఆవశ్యకతను ఎప్పుడు అంగీకరించినామో అప్పుడే మానవుని ప్రాముఖ్యమును అంగీకరించినట్లు గదా. చరిత్ర గమనమునకు కేవలము ఉత్పత్తి సాధనములే గాక, మానవ ప్రయత్నము, భావముల ప్రాబల్యము అవసరముగు చున్నవి. మార్క్సు నిర్వచించిన చరిత్రగతిలో మానవుని ప్రాధాన్యము, భావముల శక్తి అడుగంటినవి. ప్రపంచ పరిణామములో భావములకు ఉచిత స్థానము యివ్వక, ఏ సిద్ధాంతమును వెలార్చినా అది అసమగ్ర మవుతుంది. మానవుని ఏదో ఒక శక్తికి బానిసగా తయారు చేస్తుంది. భావముల స్వభావమును, వాటి శక్తిని తెలుసుకొని వాటికి తగిన స్థానము ఇవ్వనందు వల్ల పూర్వ సిద్ధాంతము లన్నియు దుష్ఫలితములకు దారి తీసినవి. ఈనాడు మానవుని పతనమునకు ఇదియే ప్రధాన కారణము. అసలు ఉత్పత్తి సాధనములను సృష్టించిన దెవరు? మానవుడే గదా ? అయినప్పుడు సృష్టికర్తకు సృష్టిమీద అధికార ముంటుందా ? లేక సృష్టికే సృష్టికర్తపై అధికార ముంటుందా ? సమస్త ఉత్పత్తి సాధనములకు జన్మస్థానము మానవుని మెదడు. ఆ మెదడు ఎంతో శక్తి సంపన్నమైన విప్లవయుతమైన భావమును తయారుచేస్తుంది అంటాడు రాయ్. అందువల్లనే ఆయన ఈవిధంగా వ్రాసినాడు :—"భావముల పరిణామశక్తి, ఆర్థికాభివృద్ధియొక్క తార్కిక క్రమము —ఈ రెండు సమానాంతరముగా నడుస్తూ ఉంటవి. ఈ రెండు మానవుని స్వాతంత్ర్యేచ్ఛనుండి ఉద్భవించినవి. ఈ రెండు ఒకదాని నొకటి ప్రోత్సహించుకుంటూ అభివృద్ధికి తోడ్పడుతున్నవి. ఈ రెండు శక్తులను కలుపుకొని రాగలిగిన సిద్ధాంతమును మనము నిర్మింపగలిగినప్పుడే, మానవుని వ్యక్తిత్వమును భంగపరుపకుండ సమగ్ర పురోభివృద్ధికి తోడ్పడగలము."

మార్క్సిస్టులవలె విప్లవ మనివార్యమని గాని, సంఘగమనము త్రికరూపములో జరుగుతుందని గాని రాయ్ అంగీకరింపడు. సాంఘిక పరిణామము ఆర్థిక పరిస్థితులపైననే గాక ప్రజల్లో ఉన్న భావ ప్రచారమును బట్టి ఉంటుంది. కాగా సాంఘిక విప్లవమునకు భావ విప్లవము నాంది యని చెప్పవచ్చును. ఫ్రెంచి మహా విప్లవమునకు ఆనాటి భూస్వామ్య పరిస్థితులే కారణము గాదు. రూసో వాల్టేరుల వంటి మహానుభావుల భావముల ప్రభావము కూడ ప్రబల కారణమే. అంతే గాక ఆర్థిక నియతివాదమును విశ్వసించు మార్క్సిస్టు దృక్పథంలో న్యాయము, ధర్మము, నీతి మొదలయినవి బూర్జువా భావములు. అతని మతము ప్రకారము వర్గమున కున్నంత ప్రాముఖ్యము సంఘమునకు గాని, వ్యక్తులకు గాని లేదు. వర్గ రాజకీయములు, వర్గ సంస్కృతి, వర్గ ధర్మము—ప్రతి విషయము వర్గము పైననే ఆధారపడి ఉన్నది. ఇందువలన చరిత్రను సమగ్రముగా, సమన్వయ దృష్టితో పరిశీలించుటకు వీలులేదు. వర్గపోరాటము సంఘాభివృద్ధికి తోడ్పడుతుందని మార్క్సిజం చెబుతున్నది గదా ? అయితే సోషలిజము స్థాపించిన తర్వాత వర్గ రాహిత్య సమాజ మేర్పడుతుంది. వర్గపోరాట ముండదు. అప్పుడు సంఘాభివృద్ధి ఆగిపోతుందా ? వర్గ సంఘర్షణ సంఘాభివృద్ధికి అవసర మనుకొన్నచో, వర్గములు లేని సంఘము ఎలా అభివృద్ధి చెందుతుంది ? ఎం. ఎస్. రాయ్ ఆర్థిక నియతి వాదమును, వర్గ కలహమే మానవ చరిత్రయను సిద్ధాంతమును అంగీకరింపడు. అయితే సంఘములో వర్గము లున్నవనీ, వర్గములలో వైరుధ్య మున్నదనీ ఆయన అంగీకరించినాడు. కాని వైరుధ్యముతోపాటు సంఘమును ఐక్యముగా ఉంచే సామరస్య భావము కూడ ఉన్నదని ఆయన విశ్వాసము. లేనిచో సంఘము అనేక పర్యాయములు చిన్నాభిన్నమై క్రమానుగతాభివృద్ధికి అవకాశ ముండదు. ఈ విషయమును గురించి వ్రాయుచూ ఆయన "న్యూ హ్యూమనిజ"మను గ్రంథములో వ్రాసిన మాట లివి:

"Society was always divided into classes, and the classes had conflicting interests. But at the same time, there was a cohesive tendency which held society together. Otherwise it would have disintegrated, time and again, and there would be no social evolution."

(3) అదనపు విలువ అనే సిద్ధాంతము మార్క్సిజము లోని మరొక ముఖ్య భాగము. ఒక వస్తువుయొక్క విలువ దానిని తయారుచేయుటకు వినియోగించు శ్రమకు సమ

నము. అందువల్ల ఆ వస్తువువల్ల ఎంత ప్రతిఫలము లభిస్తుందో అదంతా దాని ఉత్పత్తి చేసిన శ్రామికునికే చెందవలె. కాని అతన్ని ఉపయోగించుకొను యజమాని ఆ విలువలో కొంతభాగమును భుక్తము చేసుకొనుచున్నాడు. ఆ కొంత భాగమే మార్క్సిస్టు పరిభాషలో అదనపు విలువ. ఈ అదనపు విలువ వ్యక్తుల చేతుల్లోకి పోవటమే దోపిడీ విధానము. ఈ దోపిడీ విధానము అంతరింపవలయునన్న పెట్టుబడిదారీ విధానము పోయి సోషలిస్టు సమాజము నెలకొనవలయును. సోషలిస్టు సమాజములో శ్రామికుని శ్రమకు తగ్గ విలువ లేక ఫలితం అతనికి యివ్వబడుతుందని మార్క్సిజము చెప్తుంది. కాని అది ఎలా సాధ్యం ? ఎవరు ఎంత శ్రమ చేశారో, ఆ శ్రమ విలువ ఎంతో నిర్ణయించుటకు వీలుందా ? ప్రతివానికి అతని పరిశ్రమ ప్రకారము వేతనములు యివ్వబడును (For each according to his work) అని చెప్పుట తేలిక. ఆచరణలో మాత్రము సాధ్యమైన విషయము గాదు. ప్రతి సమాజమునకు ప్రభుత్వము అవసరము. ప్రభుత్వము నడవటానికి కొంత సొమ్ము కావలయును. ఆ సొమ్మును ప్రభుత్వము ప్రజలనుండి వసూలు చేస్తుంది. అనగా ప్రభుత్వము ప్రజలనుండి కొంత అదనపు విలువను సేకరిస్తున్నదనే చెప్పాలి. పెట్టుబడిదారీ విధానమైనా, సోషలిస్టు రాజ్యమైనా అదనపు విలువ ఉండక తప్పదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో అదనపు విలువ వ్యక్తుల చేతుల్లో కేంద్రీకరింపబడుతుంది. సోషలిస్టు సమాజములో నిజముగా సంఘపర మౌతున్నదా ? కాదు. ప్రభుత్వ పరమౌతుంది. అంతేగాక సమాజము అభివృద్ధి చెందుతూ ముందుకు సాగాలన్న కొంత కూడబెట్టుట యవసరము. మానవుడు తనకు కావలసిన దానికంటె ఎక్కువగా ఉత్పత్తిచేసి, తత్ఫలితముగా లభించిన అదనపు విలువ ద్వారా అభివృద్ధి సాధించుచున్నాడు. అదనపు విలువ ఎక్కువగానున్నందువలననే గదా రష్యా అమెరికా వంటి దేశములు అన్ని రంగములలో ముందడుగు వేస్తున్నాయి ? కనుక నాగరకతా అభివృద్ధికి అదనపు విలువ అవసరమని మానవేంద్రుని నిర్ణయము. అదనపు విలువ యనునది పెట్టుబడిదారీ వ్యవస్థలోని ప్రధాన దోషముగా పరిగణించుట యదార్థము గాదనియు మార్క్సీయ ఆర్థిక సూత్రములలోని ప్రధానదోష మిది యనియు ఆయన "న్యూ హ్యూమనిజ"మను గ్రంథములో వివరించినాడు :—

"The theory that production of surplus value is the specific feature of Capitalism and represents exploitation of the working class is the fundamental fallacy not only of Marxist economics, but of the entire philosophy of revolution."

(4) భౌతికగతి తర్కము ప్రతిపాదించే సామాజిక పరిణామములో మరొక ముఖ్యాంశము వ్యక్తికీ—సమాజానికీ ఉన్న సంబంధం. ఇది కేవలము అంగాంగి భావమే నంటున్నది. ఈ ప్రతిపాదన క్రొత్తది గాదు. హెగెల్ సిద్ధాంతం, ఫాసిస్టు సిద్ధాంతం, జాతీయవాదము మొదలయిన ప్రజాస్వామ్య విరుద్ధ వాదములన్నియు దీనినే సమర్థిస్తున్నవి. భౌతికగతి తర్కము లలితకళల స్వరూప స్వభావ వికాసముల గురించి కూడ స్పష్టమైన నిర్వచనములు, వ్యాఖ్యానములు యివ్వలేక పోతున్నది. పైగా మార్క్సు స్వకీయమైన అదనపు విలువ సిద్ధాంతమును గతి తర్కముతో జోడించి పెట్టుబడిదారులు స్వలాభ పరాయణులై శ్రామిక వర్గమును దోచుకుంటారు. కాని చివరకు విప్లవము ద్వారా శ్రామికవర్గము వారిని పడగొట్టి పాలనాయంత్రమును స్వాధీనము చేసుకొంటుంది అని జోస్యము చెప్పినాడు. కాని, చరిత్రను పరిశీలించినచో మార్క్సు ఊహించినట్లుగా చరిత్రగమనము జరుగలేదని తేలుతుంది. మార్క్సిజము తప్పు అని చెప్పుటకు యింతకంటె ప్రబలమైన సాక్ష్యము మరొకటి లేదు. మార్క్సు కలలో కూడ ఊహించనట్లు పారిశ్రామికముగ వెనుకబడిన రష్యా, చైనా వంటి దేశములలో కమ్యూనిస్టు పార్టీలు అధికారము చేబటినవి. ఆయన ఊహాకందని ఫాసిజము తలెత్తి రెండవ ప్రపంచ సంగ్రామమునకు దారితీసింది. ఆయన వ్రాసినట్లు మధ్య తరగతి నశింపలేదు. కార్మికుల స్థితిగతులు పెట్టుబడిదారీ రాజ్యములలో కొంతవరకైనా మేలుగానే ఉన్నవని చెప్పక తప్పదు. సాయుధ విప్లవములు అణ్వస్త్రయుగములో ఏమాత్రము పనికిరావని తేలుతున్నది. పారిశ్రామిక వికేంద్రీకరణకు అధికార వికేంద్రీకరణకు అవకాశములు కనబడుతున్నవి. ఈ పరిణామా లన్నింటిని మార్క్సు సిద్ధాంతముతో సరిపెట్టుకొనుటకు సాధ్యపడదు. పైగా సోవియెట్ యూనియన్, చైనా మొదలగు దేశముల ఆంతరంగిక పరిస్థితులను పరిశీలించినచో మార్క్సిజము పట్ల వ్యామోహము సన్నగిల్లుతుంది. శ్రామిక నియంతృత్వము పేరుతో ఆ దేశములలో పార్టీ నియంతృత్వము చెల్లుతున్నది. ప్రజాస్వామ్య విలువలు మానవ ప్రాథమిక హక్కులు నీరైపోవుచున్నవి. పాలనాయంత్రపు టధికారము మిక్కుటమై వ్యక్తి స్వేచ్ఛ కుంటుపడుతున్నది. ఈ కారణముల వలన మార్క్సీయ భౌతికగతి తర్కమును ఎం. ఎన్. రాయ్ నిరసించి నూతన మార్గమును అన్వేషించినాడు.

1930 నుండి గాంధి తత్వమును గురించి రాయ్ మహాశయుడు అనేక వ్యాసములు వ్రాసియున్నాడు. ఆయనతో

కలిసి పనిచేసి రాడికలిజం రూపొందుటకు తోడ్పడిన ఫిలిప్ స్ప్రాట్ "గాంధీజం" అను గ్రంథమును వ్రాశాడు. గాంధీజము సమగ్రమైన శాస్త్రీయమైన తత్వము కాదని రాయ్ నిర్ణయము. రాజకీయములలో నైతిక విలువలకు, వ్యక్తి స్వేచ్ఛకు, అధికార వికేంద్రీకరణకు మహాత్మాగాంధి ప్రాముఖ్యము ఇచ్చినప్పటికి, ఆయన ఈనాటి పారిశ్రామిక యుగమునకు వ్యతిరేకి. పైగా రాజకీయములకు కొంత మత దృష్టిని కూడ జోడించినాడు. ఆధునిక శాస్త్ర పరిజ్ఞానమును, యంత్ర యుగమును త్రోసిరాజన్న గాంధి తత్వము ఈనాటి సమస్యలకు సరియైన సమాధాన మివ్వలేదు.

ఈవిధముగా ఈనాటివరకు మానవుని ప్రభావితం చేసిన సిద్ధాంతము లన్నియు లోపభూయిష్టములని తేలుతున్నది. స్వేచ్ఛాన్వేషణకై నిరంతర యాత్రను కొనసాగించిన మానవేంద్రుడు నిరాశ చెందక క్రొత్త వెలుగు కొరకు యత్నించినాడు. మానవత్వమును, వ్యక్తి స్వేచ్ఛను ఒరిపిడి రాయిగా పెట్టుకొని లోక కళ్యాణదాయకమగు తత్వము ప్రజాస్వామ్య మొక్కటే యని గుర్తించినాడు. ఆయన దృష్టిలో ప్రజాస్వామ్య మొక జీవిత విధానము. స్వేచ్ఛ, నీతి, మానవత్వ వికాసము ప్రజాస్వామ్య తత్వమునకు మూల సిద్ధాంతములు. ఆధునికశాస్త్ర విజ్ఞానమును పరిశోధించి చరిత్ర నేర్పిన అనుభవములను పరిశీలించి ప్రజాస్వామ్య విధానమును తాత్విక, రాజకీయ, ఆర్థిక రంగములలో పరిపుష్టము చేయుటకు యత్నించి కృతకృత్యుడైనాడు. ఆయన వెలువరించిన రాడికల్ హ్యూమనిజము లేక మానవత్వ తత్త్వము ఉత్తమ ప్రజాస్వామ్య జీవిత విధానముగా పరిగణింపబడుతున్నది.

## 3

మార్క్సియగతి తర్కము నిరర్థక మన్నంత మాత్రమున మార్క్సిజ మంతయు నిష్ప్రయోజనముగా భావింపరాదని ఎం. ఎన్. రాయ్ తలంపు. హెగిలీయగతి తర్కము నాశ్రయించి మార్క్స్ ఎన్ని పొరపాట్లు పడినప్పటికీ అతని తత్త్వములో కొంత విశిష్టత ఉన్నది. ఈనాటి సమస్యలను సాకల్యముగా అర్థము చేసుకొని పరిష్కరించుకొనుటకు ఆయన వాదమును పరిశీలింపక తప్పదు. సామాజిక పరిణామ ముఖ్య కారణములలో ఆర్థిక విధానమును కాదనుటకు వీలులేదు. తత్వశాస్త్రము కేవలము నిర్లిప్తముగా ఉండదనుట సత్యదూరము కాదు. "సామాజిక అభ్యుదయమునకు వివిధ విజ్ఞాన శాస్త్రగత విషయ సమన్వయముతో గూడిన భౌతికదృష్టి అవసరము. దారిద్ర్యము, అన్యాయము ఉన్నంతవరకు సమాజములో శాంతి ఉండదు. మానవచరిత్రను మానవుడే సృష్టించుకొంటున్నాడు" అన్న మార్క్సియ సత్యమును మానవేంద్రుడు త్రోసివేయలేడు. ఆయన రూపొందించిన మానవతావాద తత్వములో మార్క్సిజములోని ఈ విలువలకు స్థానము కల్పింపబడినది.

రాయ్ ప్రతిపాదించిన సిద్ధాంతమును హ్యూమనిజము లేక మానవతా వాదమని అనుచున్నాము. మానవతా వాదము నిజమున కొక క్రొత్త సిద్ధాంతము గాదు. ప్రాచీన, భారతీయ గ్రీకు తాత్త్వికులలో మానవతావాదులు లేకపోలేదు. 15,16 వ శతాబ్దులలో ఐరోపా ఖండములో హ్యూమనిస్టు ఉద్యమము సాగినది. పెట్రార్కు, ఇరాస్మస్ మొదలయిన విజ్ఞానులు ఈ తత్వమును ప్రచారము చేసినారు. ఆనాడు వారు మానవ ప్రాముఖ్యము నుగ్గడించినప్పటికీ, శాస్త్రవిజ్ఞానము ఎక్కువగా లభింపనందువలన వారొక సమగ్ర మానవతావాద తత్వమును రూపొందింపలేకపోయినారు. లిబరల్ సిద్ధాంత ప్రవక్తలయిన బెంథామ్, మిల్ మొదలయిన తత్వవేత్తలు మానవ విశిష్టతను అంగీకరించినారు. "మానవ చరిత్రకు మానవుడే మూలమని" చెప్పిన కారల్ మార్క్స్, హెగిలీయగతి తర్కమునకు దాసుడై మానవుని ఆర్థిక దేవతకు బలి చేసినాడు. ఈనాడు లభించుచున్న వివిధ శాస్త్ర విషయములను సమన్వయముచేసి, సామాజిక పరిణతిని దైవమునకు వదలక ఎం. ఎన్. రాయ్ మానవతా వాదమును శాస్త్రీయ పునాదులపై పునః ప్రతిష్ఠించినాడు. అందువలన ఆయన వెలార్చిన సిద్ధాంతమును నవ్య మానవతా వాదమని పిలువవచ్చును. దినదినాభివృద్ధి చెందుతున్న శాస్త్రీయ విజ్ఞానమును, చారిత్రకానుభవములను దృష్టిలోనికి తీసుకొని ఎప్పటికప్పుడు ఈ మానవతావాదమును పరిపుష్టము చేసుకొనవలసి యున్నది గాన యిది "నవ్య" మానవతా వాద మవుతున్నది. సామాజిక పరిణామమునకు మానవుడే మూలమని చెప్పుచున్నది గాన ఈ సిద్ధాంతము రాడికల్ మానవతావాద మనియు, (రాడికల్ హ్యూమనిజం) శాస్త్ర విజ్ఞానమును పునాదిగా స్వీకరించుచున్నది గాన శాస్త్రీయ మానవతా తత్వమనియు (సైంటిఫిక్ హ్యూమనిజం) పేర్కొనబడుచున్నది.

సత్యాన్వేషణ పూర్తిగా సైన్సు పరముగా జరుగవలయుననియు, ఈనాడు సైన్సుకు తత్త్వశాస్త్రమునకు గల భేదము స్వల్పమనియు రాయ్ వాదము. నవీనశాస్త్ర సిద్ధాంతములు అమితమైన తాత్విక ప్రాముఖ్యమును కలిగి ఉన్నవి. ఇంతకుముందు సైన్సుకి, తత్వశాస్త్రమునకు ఉన్న కృత్రిమ భేదమును అవి నిర్మూలించుచున్నవి. ఆనుపూర్వికముగా దేనిని మనము తత్వశాస్త్రముయొక్క స్థలము అనుకొంటున్నామో, ఆ స్థలములోనికి నేడు సైన్సు అడుగుపెడుతూ ఉన్నది.

సైన్సు పూర్తిగా ఆలోచనలతో గాని, పూర్తిగా యథార్థ సంఘటనలతో గాని వ్యవహరింపదు. ఐన్‌స్టీన్ చెప్పినట్లు మన అనుభవము లన్నింటిని జతపరచి ఒక తార్కిక విధానము క్రిందకు తీసుకొని వచ్చుట సైన్సు పని. దేశ కాలములు, పదార్థము, కార్య కారణత్వములను గురించి ఈనాడు సైన్సు వివరించుచున్నది. సృష్టిక్రమము, వస్తుతత్వ నిరూపణము, జ్ఞాన స్వరూపములను గురించి సైన్సు నిర్దుష్టముగా విశదీకరించుచున్నది. అంతేగాక మానవ సమాజ గమనముపై సైన్సుయొక్క, సాంకేతిక జ్ఞానము యొక్క ప్రభావము అనల్పముగా నున్నది. ఈ పరిస్థితిలో సైన్సు సహాయముతో— ఒక సమగ్ర తత్వమును—అనగా ప్రకృతి, మానవుడు, సమాజము—ఈ మూడింటినీ చుట్టుకొని రాగల సిద్ధాంతమును నిర్మించుకొనవలసిన ఆవశ్యకత ఉంది. రాయ్ ప్రతిపాదించిన రాడికల్ మానవతావాదము ఈ కొరతను తీర్చుచున్నది. (సైన్సు—తత్వశాస్త్రమునకు గల సంబంధమును గూర్చి ఎక్కువగా తెలియగోరువారు ఆయన వ్రాసిన "సైన్సు అండ్ ఫిలాసఫీ" అను గ్రంథమును చూడవలయును.)

"బయట ప్రపంచము' "లోపల ప్రపంచము" అను భేదమును రాయ్ అంగీకరింపడు. "బయట ప్రపంచము" అను మాట అపార్థమును కల్గించుచున్నది. వాస్తవమునకు మానవులందరు, వారి మనశ్శరీరములు ప్రపంచములోని భాగములే. మానవులు బయటవాళ్ళుగా ఈ ప్రపంచమును చూచుట లేదు. వారి మనస్సులు, తెలివితేటలు, శక్తియుక్తు లన్నియు బయట ప్రపంచముతో అనగా ప్రకృతిలేక విశ్వముతో— అవినాభావ సంబంధమును కలిగి ఉన్నవి. కాగా, మానవుని గూర్చి ఆలోచన చేయునప్పుడు ప్రకృతి స్వభావమును, ప్రకృతి మానవులకు గల సంబంధమును పరిశోధింపవలసి యున్నది. "భగవంతుడు సృష్టికర్త. స్థితి లయములకు కారకుడు. మానవుడు కేవలము నిమిత్తమాత్రుడు. అతని భవిష్యత్తు అతని చేతులలో లేదు"—ఇటువంటి ఆధ్యాత్మిక వాదమునక్క హ్యూమనిజములో స్థానములేదు. "జగము మాయ, బ్రతుకు మాయ, గజము మిథ్య, పలాయనము మిథ్య" అని హ్యూమనిజము చెప్పదు. పంచేంద్రియ గోచరమగు ఈ చరాచర జగత్తు యదార్థము. అనంతకోటి జీవరాసులు, మానవులు దేవుడు ఆత్మానందము . కొరకు సృష్టించుకొన్న బొమ్మలు కారు. జీవ పరిణామ సిద్ధాంతము ప్రకారము ఈ ప్రాణులందరు జడ ప్రకృతినుండి వచ్చినారు. ఈ ప్రకృతినే మనము విశ్వమను చున్నాము. కాగా మానవుని గురించి పరిశోధించునప్పుడు విశ్వ స్వరూపము విచారణీయ మగుచున్నది.

విశాలమైన ఈ విశ్వము లేక ప్రకృతి కొన్ని నియమముల ననుసరించి నడచుచున్నది. ఈ నియమములు విశ్వమునకు బాహ్యముగా నున్నవి గావు. ఈ విశ్వములో ఏది జరిగినప్పటికీ దానికి కారణము విశ్వములో అంతర్భూతముగా నున్నదే గాని మరో చోటునుండి వచ్చినది గాదు. ఎందుకన ఈ విశ్వము స్వయం సంపూర్ణము, స్వయం స్థితం, స్వయంగతికమైనది. కాగా, ఒక్క మాటలో చెప్పవలయునన్న విశ్వము భౌతిక నియమబద్ధమైనది. అనగా విశ్వము నియతిబద్ధము, (The Universe is law - governed). విశ్వ గమనములో క్రమము, కార్యకారణ సంబంధమూ ఉన్నవి. కానిచో విశ్వరహస్యములను మన మెట్లు తెలుసుకొనగలము ? గ్రహగతుల నాధారము చేసుకొని సూర్య చంద్ర గ్రహణము లెప్పుడేర్పడునో చెప్పగలుగుచున్నాము. విశ్వము నియతిబద్ధముగానిచో యిది సాధ్యమా ? విశ్వము నియతిబద్ధమను విషయమును భౌతిక శాస్త్రజ్ఞులు ఈవిధముగా వివరించుచున్నారు. మనకు గోచరమగు ప్రతి విషయము రెండు శక్తులవలన ఏర్పడచున్నది. ఒకటి ఆకర్షణశక్తి (Gravitational Force)ు రెండు విద్యు దయస్కాంత శక్తి (Electro -Magnetic Force). ఈ రెండు విభిన్నములైన శక్తులుకావు. అవి ఒకే నియమమునకు కట్టుబడి ఉన్నవి. ఈ నియమమే విశ్వ రహస్యము. దానిని ఏకక్షేత్ర సిద్ధాంతము (Unified Field Theory) గా చెప్పుదురు. విశ్వములో ప్రతి విషయము—జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునది, ఈ నియమము వలననే సంభవించును. హైజన్‌బర్గ్ అను జర్మన్ శాస్త్రజ్ఞుడు విశ్వములో జరుగు ప్రతిక్రియను అనుశాసించు నియతి ఒక్కటే అంటాడు. కాగా నియమములను కల్గి యుండుట ప్రకృతి స్వభావము. చరాచర జగత్తు అంతయు ప్రకృతిజనితము, ప్రకృతి నియమ సమన్వితము, నియమ చోదితము. మానవుడు ప్రకృతిలో ఒక భాగము. కాగా, ప్రకృతిలోని నియమములు, కారణ కార్య సంబంధము మానవునిలో ద్యోతకము కాకతప్పదు. దానినే హేతుశీలము (Rationality) అని చెప్పవచ్చును. విశ్వములోని నియమబద్ధత మానవుని కవగత మగుటయే అతని హేతుశీల మగుచున్నది. కాగా తేలిన విషయము :—"నియతిబద్ధమైన భౌతిక ప్రకృతి నుండి ఆవిర్భవించిన మానవుడు సహజముగా హేతుశీలి." Rising out of the back - ground of the law governed physical nature, the human being is essentially rational. విశ్వములో సర్వము పదార్థముయొక్క పరిణతికి సంబంధించిన ప్రవర్తనయే. పదార్థము వినా విశ్వము శూన్యము. పదా

ర్థము కానిదానికి ఉనికి లేదు. విశ్వము పదార్థమయమైనందున, పదార్థ పరిణామమును నిర్ణయించు నియమములు పదార్థములోనివే అయినందువలన, మానవుడు విశ్వములో భాగమైనందువలన ఆ నియమములు, సూత్రములు మానవునిలో కూడ పనిచేయుచున్నవి. అందువలన మానవుడు జన్మతః హేతు స్వాభావికుడు. అయితే విశ్వములోని నియమబద్ధత మానవునిలోని హేతుశీలము ఒక్కటేనా ? యను సందేహము కలుగకమానదు. ఈ రెండును ఏకగుణ ప్రధానములేయని చెప్పుటకు వీలులేదు. ఏలనన సృష్టి పరిణామ క్రమములో మానవుడు పరాకాష్ట, మానవుని కంటె ముందు ఎన్నో జీవరాసులుద్భవించినవి. విశ్వములోని నియమబద్ధత ఈ అనంత ప్రాణికోటిలో క్రమముగా వికాసము పొంది మానవునిలో హేతుశీలముగా ప్రస్ఫుటమైనది. కాగా హేతుత్వము మానవుని విశిష్ట లక్షణము, సర్వ కార్యములకు మూలము.

మానవ సంకల్పము (Will) చాలా శక్తిమంతమైనది. సంకల్పమున కున్న బలము, స్వేచ్ఛ దాని ప్రత్యేకమైన ఉనికిని గుర్తించుటకు దోహదము చేసినవి. అయినప్పటికి మానవ సంకల్పము ప్రకృతిలోని నియమశీలమునకు వ్యతిరేకముగాదు. మానవునకు ముందు ఉద్భవించిన జీవకోటిలో సంకల్పపు ఛాయలు కాన్పించుచున్నవి. హేతుత్వమే సంకల్పమునకు మూలము. మానవుని హేతుధర్మమును వివరించుచు రాయ్ మహాశయుడు ఈవిధముగా వ్రాయుచున్నాడు "మానవుడు ఎక్కడ నుండియో ఈ భూతలముపై ఊడి పడలేదు. అతడు, అతని మనస్సు, బుద్ధి, సంకల్పములు భౌతిక ప్రకృతిలోని అంతర్భాగములు. భౌతిక ప్రకృతి క్రమమైనది, నియమబద్ధమైనది. కాగా మానవుని అస్తిత్వము, పరిణామము, అతని ఉద్వేగములు, సంకల్పము, భావములు—ఇవన్నియు నియమబద్ధములు. అందువలన మానవుడు హేతు స్వాభావికుడు. మానవునిలోని హేతుధర్మము ప్రకృతియొక్క సామరస్యమునుండి నిష్పన్నమైనది." (Man did not appear on the earth out of nowhere: with his mind intelligence. will, he is an integral part of the physical Universe The latter is a Cosmos - a law - governed system - Therefore, man's being and becoming, his emotions will, ideas are also determined. Therefore man is essentially rational. The reason in man is an echo of the harmony of the Universe)

ఈ విశాల విశ్వములో భూమిమీద మనము చూస్తూ ఉన్న జీవరాశి వంటిది మరెక్కడా లేదు. సూర్యుడినుంచి, ఏదో ఒక విధముగా విడిపోయిన భూమి క్రమముగా చల్లారి, దానిమీద జీవము ఏర్పడినది. క్రమముగా వివిధ దశలలో పరిణామము చెందగా మానవుడు ఉనికిలోనికి వచ్చినాడు. జీవ పరిణామ సిద్ధాంతమును డార్విన్ మొదలయిన శాస్త్రజ్ఞులు వివరించి యున్నారు. నియమబద్ధమైన భౌతిక ప్రకృతి పరిణతిలో జీవ పరిణామ మొక భాగము. అదీ ఒక హేతు క్రమమే. జీవ మనునది విశ్వాతీతమైనది కాదు. జీవ ద్రవ్యమునకు పరిసరములను గుర్తింపగల స్పృహ ఉంది. దానివలన పరిసరముల ప్రేరణకు ప్రతీకారము ప్రారంభ మయినది. తరువాత జీవికీ, పరిసరములకూ ఉన్న సంబంధమునకు సహకారులుగా నరములు పెరిగినవి. ఆ తర్వాత మెదడు పెరిగినది. ఈ మెదడు మానవునిలో ఉత్కృష్ట స్థానమును పొందినది. అంతేకాక మానవ శరీర నిర్మాణములోనే ఉత్కృష్టత ఉన్నది. వెన్నుపూస భూమికి లంబముగా నుండుట, చేతులకు అనన్యమైన స్వాధీనత ఉండుట, స్వరపేటికలో మాటలు పలికించే ప్రత్యేకత ఉండుట—ఇటువంటి వెన్నో ఉన్నవి. అయినప్పటికి మేధాశక్తి, ఉద్వేగములు మొదలయినవి సర్వ ప్రాణులకు సామాన్య లక్షణములు. స్మృతి, జ్ఞానము, ఉద్వేగము, బుద్ధి మానవునకు క్రింది తరగతుల్లో ఉన్న జీవుల్లో బొత్తిగా లేకపోలేదు. జంతువులు తమ భావోద్వేగములను సంజ్ఞాపూర్వకముగా చూపించుచున్నవి. చింపంజీలలో, పక్షులలో మన మనుకొనే దానికంటే ఎక్కువగా మేధాశక్తి ఉద్వేగము లున్నవని కోలర్, జూలియన్ హక్స్లీల అభిప్రాయము. అయినప్పటికీ జంతువులలోని మనస్సుకు, మానవుని మనస్సుకూ చాలా అంతరము ఉంది. జంతువులు తేలికగా పరిసరములకు వశమై పోతవి. పావ్లోవ్ కుక్కలపై ప్రయోగములు చేసి, వాటి నరముల పోకడలను మార్చి వాటితో కొత్త రకములయిన ప్రతికరణలను సృష్టించినాడు. మానవుని కూడ ఆవిధముగా తయారుచేయవలయునన్న వృథా ప్రయాస మాత్రమే. మానవుడు భౌతిక విశ్వములో నుండి వచ్చినప్పటికి, మిగతా జీవకోటిలో కంటె అతనిలో ప్రత్యేకత ఉంది. మానవుని ఈ ప్రత్యేకతను గమనింపగల్గినప్పుడే హ్యూమనిజము సంభవ మౌతున్నది. మానవుని ప్రత్యేకత, వైశిష్ట్యము మానవ ధర్మములపైననే ఆధారపడి ఉన్నవి. మనము ఆవుని చూతుము. వెంటనే ఆవుయొక్క భావము మనస్సులో స్ఫురించును. ఆ భావమును మాటలలో చెప్పుదుము. భాషను కల్గియుండుట మానవుని ప్రత్యేకత. తనలో కల్గిన భావములను మాటల రూపమున వ్యక్తీకరించుట మానవ ధర్మము. దీనినే భావ విచారము (Conceptual thought) అని చెప్పవచ్చును. ఈ ధర్మము ఇతర జీవ

రాసులలో మృగ్యము. మానవుడు విచారశీలి గనుక సంప్రదాయమును సంచితము చేసుకొను చున్నాడు. అనగా ఒక తరమువారి అనుభవములు, ఆచారములు, విజ్ఞానము మరొక తరమువారు స్వీకరించుచున్నారు. పనిముట్లను నిర్మించుకొనుట, సాధన సంపత్తిని సృష్టించుకొనుట మానవుని ధర్మము. ఈ శక్తి జంతువులలో కానరాదు. పనిముట్లను కనిపెట్టుట, వానిని ఉపయోగించుట మానవ నాగరకతాభివృద్ధికి చిహ్నము. సాధన సామగ్రినిసృష్టించుకోగల శక్తి ఒక్క మానవునికే గలదు. ఈ శక్తికి గూడ మానవుని విచారశీలమే ప్రాతిపదిక. ప్రఖ్యాత శాస్త్రవేత్త జూలియన్ హక్స్లీ మానవుని విశిష్ట ధర్మములను ఈ క్రింది విధముగా వివరించియున్నాడు: (1) అగోచరార్థములను గురించి ఊహించి విచారణ చేయగల శక్తి మానవుని సొత్తు. (Capacity for abstract and general thougt) ఈ శక్తియే గణితశాస్త్రమునకు మూలము. (2) మానసిక వ్యాపారములగు గ్రహణము, భావనము, సంకల్పములను సమన్వయము చేయగల శక్తి. ఈ శక్తిచేత భిన్నత్వములోని యేకత్వమును చూడగల్గుచున్నాడు. (3) పరంపరగా వచ్చుచున్న సంస్కృతీ సంప్రదాయములను పొందియుండుట మరొక ధర్మము. సమాజములోని సంస్థలు ఈ సంప్రదాయమును, సంస్కృతిని ప్రకటించును. మానవ వికాసమునకు పైన చెప్పబడిన శక్తులులేక ధర్మములు మూలము. ఈ శక్తులు భావ విచారమను విశిష్ట ధర్మమునుండి ఉత్పన్న మగును. భావ విచారము హేతుశీలము వలన కల్గుచున్నది. కనుక ఎం. ఎన్. రాయ్ వివరించినట్లుగ మానవ వికాసమునకు హేతుశీలము ప్రధానాలంబనము.

ప్రకృతియందలి జీవరాసులలో బ్రతుకుదెరువుకై పోరాటము కలదని శాస్త్రజ్ఞుల నిర్ణయము. ప్రతి జీవియు తన మనుగడకై రెండు వ్యతిరేక శక్తుల నెదిరింపవలసియున్నది. జీవితావసరముల కొరకు ఇతర ప్రాణులతో పోరాటము మొదటిది. ప్రకృతిలోని వ్యతిరేక పరిస్థితులతో సంఘర్షణ పడుట రెండవది. ఈ పోరాటములో అర్హతమమ్మైన జీవులు చావక నిలచియుండును. జంతువులు మనుగడకై చేసే పోరాటం వాసనా ప్రేరితము. ఆ పోరాటములో అవి తమను పరిసరములకు అనుకూలముగా మార్చుకొనుచున్నవి. మిడుత, కప్ప, మొదలయిన జంతువులు వేర్వేరు ప్రాంతములలో రంగులు మార్చుకొనుట కిదియే కారణము. చలి ప్రాంతములలో నున్న జంతువులు ఉన్నిని పెంచుకొనుచున్నవి. అవసరమ్మైనప్పుడు పరిసరములకు అనుకూలముగా తమ శరీరములను, అవయవములను మార్చుకొనుటను జంతువులలో చూచుచున్నాము. అయితే మానవుడు కూడ జీవన పోరాటమును కొనసాగించుచున్నాడు. మానవునిలో వాసనలు, ప్రేరణలు ఉన్నవి. జంతువుల వలె అతడు కూడ ప్రథమావస్థలో ప్రకృతికి లొంగి, ప్రకృతిని అనుసరించినాడు. కాని ఆదిమ వానర మానవు డెప్పుడో అందని పండును రాయితోనో, కర్రతోనో కొట్టి సంపాదించినాడు. ఇటువంటి సన్నివేశములతో అతని జీవన పోరాటములో ఉన్నతమ్మైన మార్పు వచ్చినది. జీవన పోరాటము వాసనల స్థాయి నుండి బుద్ధి కుశలత స్థాయికి పెరిగినది. అందులకు ముఖ్య కారణము మానవ మేధస్సు. ఎలుక పిల్లిని చూచిన వెంటనే బొరియలోనికి దూరును. మానవుడు శత్రువును చూచిన అట్లు చేయునా? లేదు. కర్రను సాధనముగా గైకొనును. సాధనమును గ్రహించుట మానవుని ప్రత్యేకత. అది ఒక సృజనాత్మకమగు వ్యాపారము. ఆ క్రియకు మూలము మానవుని మేధాశక్తి. బుద్ధిబల సంపన్నుడు గనుకనే మానవుని జీవన పోరాటము కేవలము పశుప్రాయము గాదు. పక్షులు గూళ్ళు కట్టుకొన్ననూ, చీమలు పుట్టలు పెట్టుకొన్ననూ, సత్తలు గుళ్ళలు నిర్మించుకొన్ననూ—అవన్నియు ప్రకృతినుండి తమను రక్షించుకొనుటకు అవలంభించిన వాసనాప్రేరితమ్మైన విధానములే. పరిసరములలో తీవ్రమ్మైన పరిణామములు కల్గినప్పుడు అవి నూతనమ్మైన పద్ధతులను అనుసరింపలేవు. అందుకు కారణము మానవున కున్న హేతుత్వము, భావ విచారము వానికి లోపించుటయే. మానవుడు ప్రకృతికి బానిసగాడు. పరిసరములను తనకు అనుకూలముగా మార్చుకొనగలడు. ప్రకృతిని అర్థము చేసుకొని, ప్రకృతి రహస్యముల్లను భేదించి, వాని బంధనముల నుండి విముక్తుడు కాగలుగుచున్నాడు. అందువలన జంతువుల లోని జీవన పోరాటము మానవ స్థాయిలో స్వేచ్ఛా పోరాటముగా అభివృద్ధి చెందుతున్నదని రాయ్ మహాశయుని తీర్పు. స్వేచ్ఛ అనునది మానవునిలోనే ఉన్నది. జంతువులకంటె భిన్నమ్మైన పరిణతికి మానవునకు తోడ్పడినది స్వేచ్ఛా పిపాసయే. కనుక స్వేచ్ఛా పిపాస అనగా, మానవుడు తన మనుగడకు చేసే పోరాటమును ఉత్తమ స్థాయిలో— అంటే బుద్ధికుశలత ఉద్వేగములతో కూడిన స్థాయిలో కొనసాగించుటయే. వ్యష్టిగా గాని సమష్టిగా గాని మానవుడు చేయు హేతువాద సహితమ్మైన ప్రతి ప్రయత్నము యొక్క ప్రయోజనము అనుక్షణము అభివృద్ధి పొందుతున్న, స్వేచ్ఛను సంపాదించుటకే. వ్యక్తులలోని శక్తులను పరిపూర్ణముగా వికసింపజేసి, వారిపైనున్న సమస్త ప్రతిబంధకములను క్రమానుగతముగా నిర్మూలించుటయే స్వేచ్ఛ.

(The quest for freedom is the continuation on a higher level—of intelligence and emotion—of the biological struggle

for existence. The purpose of all rational human endeavour, individual as well as collective, is attainment of freedom in ever increasing manner. Freedom is progressive disappearance of all restrictions on the unfolding of the potentialities of individuals.)

ఇంతవరకు మానవుని విశిష్ట ధర్మములను గురించియు అతనిలోని హేతుశీలము—స్వేచ్ఛా పిపాసలను గురించియు తెలుసుకొన్నాము. ఇప్పుడు జ్ఞానము, సత్యము, నీతి — ఈ మూడింటిని గురించి మానవేంద్రుని అభిప్రాయము లెట్లున్నవో పరిశీలింతము. స్వాతంత్ర్యేచ్ఛ ప్రేరేపింపగా సహజముగా హేతుశీలుడైన మానవుడు జ్ఞాన సముపార్జన చేయుచున్నాడు. జ్ఞానమంటే ప్రకృతిలో నున్న వస్తువుల ఉనికి గుర్తించుటయే గాక వాని మధ్య ఉన్న సంబంధములను గురించి అర్థము చేసుకొనుట. ఇందులో మానవుడు కూడ ఒక భాగమే. అందువలన మానవుడు తనకు తన పరిసరములకు ఉన్న సంబంధమును తెలుసుకొనుటయు జ్ఞానమే. ప్రకృతి భౌతిక నియమములతో కూడియున్నదని తెలిసికొంటిమి. ప్రకృతి యందలి ఆనియమములను గ్రహించుటయు జ్ఞానమే. జ్ఞాన సేకరణకు మానవునక్కు అతని ఇంద్రియములు, మనస్సు తోడ్పడుతున్నవి. పంచేంద్రియ గోచరమైన యదార్థ విషయములను మనస్సు ప్రోగుచేసి, వింగడించి, మదింపుచేసి, ప్రకృతిని నియమములను తెలుసుకొనుచున్నది. ఈ విధముగా మనస్సుద్వారా సంపాదించిన జ్ఞానమును సత్యము అని చెప్పవచ్చును. సత్యమనగా నొక మిథ్యాభావన గాదు. జ్ఞాన విషయమే సత్యము. (Truth is the content of knowledge). లౌకిక సత్యమని, అలౌకిక సత్యమని రెండు విధములుగా సత్యమును విభాగించుట అసత్యము. సత్యము మానవానుభూతికి చెందిన యాదార్థ్యము. అది దృశ్య సంబంధమైన వాస్తవికతకు (Objective reality) చెందినది. సత్యము జ్ఞాన విషయము అయినందువలనను, జ్ఞానము వాస్తవ ప్రపంచమును తెలిసికొనుటయే యైనందునను, మానవజీవితములో సత్యమునకు — జ్ఞానమునకు విడదీయరాని సంబంధము యేర్పడినది. అంతే గాక మానవుడు స్వేచ్ఛకొరకు చేయు పోరాటము అతడు ప్రకృతిని గురించి అర్జించిన జ్ఞానముపై ఆధారపడి ఉంది. జ్ఞానము స్వేచ్ఛ ఒకదాని కొకటి దోహదము చేసుకొనగలవు. మానవుడు ఎంత మేరకు జ్ఞానమును పొందగలడో అంతమేరకు స్వేచ్ఛను అనుభవింప గలడు. మానవునిలో పరిణామము ద్వారా ఆవిర్భవించిన స్వేచ్ఛా పిపాస అతని జ్ఞాన తృష్ణను పెంచినది. జ్ఞానతృష్ణ సత్యమునకు సోపానమైనది. సత్యము మానవుని స్వేచ్ఛను ఇనుమడింప జేయుచున్నది. ఈ విధముగా మానవ జీవితములో స్వేచ్ఛా పిపాస — సత్యాన్వేషణ ప్రధానములనియు, వాని పైననే మానవాభివృద్ధి ఆధారపడి యున్నదనియు రాయ్ మహాశయుని సిద్ధాంతము. (Quest for freedom and search for truth constitute the basic urge of human progress)

మానవనీతికి అతని హేతువాశీలమే మూలము (Man is moral because he is rational). మానవుడు జన్మతః హేతు స్వాభావికుడు అన్న సూత్రములో మూడు విషయములు అంతర్భూతమై యున్నవి. (1) నియబద్ధమైన భౌతికప్రకృతిలో తానుకూడ ఒక భాగము కనుక మానవ ప్రవర్తనయు నియమబద్ధమే అవుతుంది. మానవుని హేతుశీలము విశ్వమండలి నియమశీలమునుండి నిష్పన్న మవుతున్నది. (11) ప్రకృతి నియమములను, ప్రకృతిలోని కార్య కారణత్వమును తెలుసుకొనగల శక్తి వలన మానవుడు జ్ఞానమును సంపాదించు చున్నాడు. (111) మానవుని జ్ఞానము — అనగా మానవుడు తనను గురించియు, తనకు ప్రకృతికి, తనకు సమాజమునకు గల సంబంధమును గురించియు పెంచుకొన్న జ్ఞానము — అతని శీలమునకు, నైతిక ప్రవర్తనకు ప్రధానమైన పునాది. తన అనుభవమును పట్టి మానవుడు ఏనకేది శ్రేయోదాయకమో, యేది కాదో తెలుసుకొనుచున్నాడు. దానిని బట్టి తనకు శుభప్రదమైనది ఇతరులకుకూడ శుభప్రదమేనని, తనకు దుఃఖకరమైనది ఇతరులకు అట్లే అనియు మానవుడు గ్రహింప గలడు. ఈ గ్రహణశక్తియే నైతిక ప్రవర్తనకు మూలము. మానవ శ్రేయస్సునకు, సంఘ శ్రేయస్సునకు అవసరమైన విలువలే నైతిక సూత్రములు. ఈ నైతిక సూత్రములకు మూలము మానవునిలోని వివేకము. వివేకము హేతుశీలము వలన కలుగుతుంది. మానవుడు సంఘజీవి. సంఘములో గల ఇతర వ్యక్తులతోపాటు ఒరిపిడి లేకుండా అతడు బ్రతుకవలయును. తన శ్రేయస్సుకు ఇచ్చినంత ప్రాముఖ్యము, ఇతరుల శ్రేయస్సుకుగూడా ఇవ్వాలి. అనగా సాంఘిక జీవి అయిన మానవునకు కొన్ని బాధ్యతలున్నవి. ఈ సాంఘిక భాధ్యతలను గుర్తెరిగి ప్రవర్తించుటయే నీతి. మానవుడు వివేకము —హేతుశీలముల ద్వారా సాంఘిక బాధ్యతలను తెలిసికొనగలడు. కనుక హేతుబద్ధముగా జీవించుటయే నీతి. "నీతికి మానవునిలోవున్న హేతుత్వమే పునాది. అప్పుడే అతడు నిర్నిమిత్తముగా, స్వేచ్ఛాపూర్వకముగా నీతి బద్ధుడై ఉండగలడు. నీతిగా నుండుటకు మానవునిలోనున్న హేతుతత్వ స్వభావమే కారణము. ఇందుకు ప్రతివానికి అంతరాత్మయే ప్రమాణము. అంతరాత్మ అనగా మనము తెలుసుకోలేనిది, మనఊహకు అందనిదియు కాదు. చైతన్య స్థాయిలో జరుగు జీవిత చర్యయే

యది. మానవునిలో నిగూఢముగా నున్న హేతు తత్వము సామరస్య పూర్వకమైన సాంఘిక వ్యవస్థకు ఆధారము. అటువంటి సాంఘిక వ్యవస్థలో నీతి మనగలుగుతుంది. ఏలన హేతుతత్వచర్యయే నీతి." అని అంటారు రాయ్. నైతిక విలువలు నిజమైనవి. ఇవి ఎక్కడ నుండియో ఊడిపడినవని భావించి, వానిని క్రీగంట చూడవలసిన అవసరము లేదు. ఈ నైతిక విలువలను ఆచరణలో పెట్టవలసిన వాడు మానవుడే. కొందరు దీనికి భిన్నముగా ఆలోచించి, నైతిక విలువలను ఆచరణలో పెట్టుటకు ముందు ఉత్తమ సంఘము అవసరమనుకొన్నారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు సమష్టి యాజమాన్యము క్రింద ఆర్థిక పునర్నిర్మాణము జరిగినచో నీతికి తగిన వాతావరణ మేర్పడుతుందనుకొన్నారు. కాని రాయ్ నీతిని మానవుని ఉనికిలో కనిపెట్టి మానవుని జీవితములో దానికి స్థిరమైనస్థానము ఏర్పరచాడు.

చరిత్రను గురించి యం. యన్ రాయ్ ప్రతిపాదించిన విషయములు విచారణీయములు. స్పెంగ్లర్, సోరోకిన్, యోగి అరవిందులవలె చరిత్రలో పునరావృత్త సిద్ధాంతమును (cycle theory) ఆయన అంగీకరింపడు. కారల్ మార్క్స్ వలె ఆర్థిక నియతి వాదమును కూడ ఆయన ప్రతిపాదింపడు. చరిత్రలో పూర్వ పూర్వ దశలకంటే ఉత్తరోత్తర దశలు విధిగా అభ్యుదయ దాయకములను విషయమును కూడ రాయ్ అంగీకరించియుండలేదు. రాడికల్ ప్రజాస్వామ్య సూత్రములలో ఒక చోట ఈ విధముగా చెప్పబడినది. "భౌతికవాదమును పొరపాటుగా వ్యాఖ్యానించుకొనుట వల్లనే చరిత్రను ఆర్థిక సూత్రాను గుణముగా వివరించుట జరిగినది. ఈ వివరణలో ద్వైత భావము ఇమిడి వున్నది. భౌతిక వాదము కేవలము ఏకత్వమును ప్రతిపాదించు సిద్ధాంతం. చరిత్ర నియతమైన గమనం గలది. అయితే దానికి కారణములు అనేకము. వానిలో మానవ సంకల్పము ఒకటి." రాయ్ మతం ప్రకారము మానవుడు స్వేచ్ఛ కొరకు జరుపుతున్న పోరాటమే చరిత్ర. మానవ చరిత్రకు మూలము మానవుడే. మానవుడు ఏ వ్యవస్థలను నిర్మించుకొన్నా, యే కార్యకలాపములు కొనసాగించినా — అవి అన్నియు స్వేచ్ఛా సముపార్జనకొరకే. మానవుడు నిర్మించ కొన్న సాంఘికవ్యవస్థలు, అతని సిద్ధాంతాలు, ఆచారాలు స్వేచ్ఛకు అవరోధముగా నున్ననాడు మానవుడు వాటిని మార్చుకొనుటకు యత్నిస్తాడు. అటువంటి మార్పును విప్లవమంటాము. సాంఘిక విప్లవమునకు భావ విప్లవము నాంది, యేలలన సాంఘికపరిణామాలకు కేవలము భౌతిక పరిస్థితులే కారణము గాదు. మానవ సంకల్పం, భావాలు కూడ ఇందుకు ఎక్కువగా తోడ్పడగలవు. భావాల ప్రాబల్యమునకు, మానవ సంకల్పము యొక్క విశిష్టతను మానవేంద్రనాథ్ రాయ్ గుర్తించినారు. "భావోత్పత్తి ఒక దేహ ధర్మము, పరిసరాలను గ్రహించుటవలన అది ఏర్పడుతోంది. భావాలు ఒకసారి ఏర్పడిన పిమ్మట అవి స్వయం నియమ బద్ధములై తమంత తాము మనగలవు. భావ గమనమూ — సామాజిక పరిణామమూ ఒకదానిపై మరొకటి తమ ప్రభావమును ప్రసరింపచేసుకుంటూ, పరస్పరం సమాంతరముగా సాగి పోగలవు."

(రాడికల్ ప్రజాసామ్య సూత్రం— 6.)

మానవతా వాదములోని మరొక ముఖ్యాంశము సమాజమునకు వ్యక్తికీ మధ్య గల సంబంధము. ఆ సంబంధమును అంగాంగీ సంబంధముగా రాయ్ అంగీకరింపడు ఆయన మతం ప్రకారం మానవ సమాజమునకు మూలం మానవుడు. ముందు వ్యక్తి తర్వాత సంఘం. అనేకమంది వ్యక్తుల కలయికయే సమాజం. సహకార భావమే ఆ కలయికకు ముఖ్యకారణం. వ్యక్తిస్వేచ్ఛకొరకే సమాజం యేర్పడింది. సాంఘిక శ్రేయస్సుకు, అభ్యుదయమునకు వ్యక్తిశ్రేయస్సు కొలమానం. వ్యక్తికతీతమైన సమష్టి శ్రేయస్సు కేవలం మిథ్య. అందుకే ప్రతిదానికి మానవుని కొలతబద్ధగా స్వీకరించమన్నాడు ప్రొటాగరస్. సమాజమునకు మానవుడు నమూనా (Arche type) అన్నాడు యం. యన్ రాయ్. "మానవుడు సమాజమునకు నమూనా. సహకార పూర్వక సామాజిక సంబంధములు వ్యక్తిలో అంతర్గతముగా నున్నశక్తులు వికసించుటకు తోడ్పడగలవు. వ్యక్తి అభివృద్ధి సామాజికాభ్యుదయమునకు ప్రమాణం. వ్యక్తులు లేక సమాజములేదు. సుఖ జీవనమనునది నిజంగా ఉన్నచో అది వ్యక్తులు అనుభవించేదిగా ఉంటుంది. జాతిపేరుతో గాని, వర్గంపేరుతో గాని, మరియే ఇతర రూపాలతో గాని మానవ సమాజమునకు సమష్టి భావనను ప్రతిపాదించుట పొరపాటు. ఆవిధముగా ప్రతిపాదించిన ఆచరణ వలన వ్యక్తిని సమష్టికి బలి ఇవ్వటమే కాగలదు."

(రాడికల్ ప్రజాసామ్య సూత్రములు చూచునది.)

రాయ్ మహాశయుడు మానవతా వాదములోని విశిష్ట లక్షణాలను —హేతుత్వము, స్వేచ్ఛ, నీతి, వ్యక్తి ప్రాధాన్యము — జ్ఞానము —పై విధముగా విడమరచి చెప్పి, మానవతా వాదము యొక్క సమగ్రతను ఈ విధముగా ఉద్ఘాటించినాడు :—"రాడికల్ మానవాతా వాదము నవ్య శాస్త్ర ప్రమాణాల మీద మానవుని ప్రాముఖ్యమును విశదపరుస్తుంది. శాస్త్ర విజ్ఞానం మానవుని గురించి ఇంతవరకు పూర్వమున్న అపోహలను నిర్మూలిస్తుంది. హేతుపూర్వక నీతిదాయక మానవ సంఘం—మానవుడు జన్మతః హేతుశీలి, కాగా అతడు నీతిగా ఉంటాడు గనుక — వర్ధిల్లుతుందని మానవతా వాదము చెప్పుతుంది. మానవ నైజములోనే నీతికి పునాది ఉన్నందువలన, దీనికి మానవునిపై ఎటువంటి బలవంతమును ప్రయోగింప నవసరము లేదు. ఈనాటి విషమ పరిస్థితినుండి బయటపడు మార్గమును చూపుతుంది గనుక మానవతా వాదమునొక సాంఘిక తత్వశాస్త్రముగా పరిగణింపవచ్చును. మానవ వాదము విశ్వతత్వము నుండి నిష్పన్నమయింది. అది పదార్థ ప్రపంచమును, మానసిక ప్రపంచమును కలుపుకొని వస్తుంది. దాని తత్వ విచారణ భౌతిక వాస్తవికత మీద ఆధారపడినది. దాని సృష్టి స్వభావము క్రమబద్ధమైనది. భావ విచారము, ఇంద్రియ జ్ఞానము మానవతా

జ్ఞాన తత్వములో సమన్వయము చేయబడినది. మానవతా వాదము మనోతత్వ శాస్త్రమును శారీరక శాస్త్రముతో జత పరుస్తుంది. రసాయనిక శాస్త్రము యొక్క తోడ్పాటుతో శారీరక శాస్త్రమును భౌతిక శాస్త్రముతో జోడిస్తుంది. మానవతావాదము నీతిని హేతుశీలము మీద నిలబెడుతుంది. హేతు శీలమును భౌతిక విశ్వములోని నియమ శీలము నుండి, ప్రకృతి యందలి క్రమత్వమునుండి నిష్పన్నము చేస్తుంది."

Radical Humanism proclaims the sovereignty of man on the authority of modern science; which has dispelled all mystery about the essence of man. It maintains that a rational and moral society is possible; because man, by nature is rational and therefore can be moral nor under any compulsion, but voluntarily; that the sanction of morality is embedded in human nature.

In so far as it shows a way out of the crisis of our time, Radical Humanism is a social philosophy. But as such, it is deduced from a general philosophy of nature, including the world of matter and the world of mind. Its metaphysics is physical-realist; and its cosmology is mechanistic. Conceptual thought and sense perceptions are harmonised in its epistemology. It merges psychology into physiology, and relates the latter to physics through chemistry. It bases ethics on rationalism, and traces the roots of reason in the orderliness of nature and the harmony of the physical universe."

(See 'Radical Humanism' by Roy)

## 4

ఇంతవరకు మానవేంద్రుని జీవిత విశేషాలు, తాత్విక సిద్ధాంతాలు వివరింపబడినవి. ఇక ఆయన రాజకీయ ఆర్థిక భావాలు స్థూలముగా నైన సూచించిన గాని ఈ వ్యాసము సమగ్రమనిపించుకోదు. ఆది మానవులు తమ సంబంధ బాంధవ్యాలను చక్కపెట్టుకొనుటకు సమాజమును సృష్టించు కున్నారు. ప్రారంభంలో ప్రకృతి ఈతి బాధలనుండీ, క్రూర మృగాలనుండీ తమ్ము తాము రక్షించు కొనుటకూ, రాను రాను ఉన్నత పద్ధతులలో మానవాభ్యుదయం వైపు పురోగమించు టకూ సమాజం వారికి ఉపకరించినది. ఆ తర్వాత ఆదివ్న సమాజాలు పెరిగిన కొద్దీ తమ వ్యవహారములను సరిదిద్దే నిమిత్తం భారీయెత్తున వారొక విస్తృతమైన యంత్రాంగ మును నిర్మించుకోవలసివచ్చింది. సమాజంయొక్క ఆ రాజకీయ వ్యవస్థనే ఈనాడు మనము రాజ్యం (స్టేట్) అంటున్నాము. సామాజిక జీవనంలోని కొన్ని రంగాలలో మానవుల మధ్య సంబంధాలను చక్కబెట్టుటకే రాజ్యము అవతరించినది. సమాజముతోపాటు రాజ్యమును సృష్టించు కొన్నది మానవుడు. అందువలన రాజ్యమునకు గాని, సమాజమునకు గాని, మానవునకు మించిన ప్రాధాన్య ముండుటకు వీలు లేదు. రాజ్యము యొక్క అధికారము వ్యక్తి స్వేచ్ఛను నిరోధించుటకు వీలులేదు. కాగా వ్యక్తికీ — రాజ్యమునకూ మధ్య సంబంధాలను ఎలా సరి పెట్టవలయును? వ్యక్తి స్వేచ్ఛను దిగమ్రింగకుండా రాజ్యమును యే విధముగా వ్యవస్థీకరింపవలయును? ఎటువంటి ప్రభుత్వ విధానమును రూపొందించుకొనవలయును? ఇదే ఆధునిక రాజకీయ తత్వ శాస్త్రం ఈనాడెదుర్కొంటున్న ప్రధాన సమస్య.

నిరంకుశ రాచరికము గాని, నియంతృత్వ విధానములు గానీ వ్యక్తికీ — రాజ్యమునకు మధ్య ఉన్న వైరుధ్యమును తొలగించి, వ్యక్తి స్వేచ్ఛకు కిరీటము పెట్టలేవు. ఒక్క ప్రజాస్వామ్యమే ఈ గడ్డు సమస్యను పరిష్కరింప గలదని రాయ్ విశ్వాసం. యేలనన: ఎవరు ఏవిధముగా నిర్వహించిననప్పటికీ ప్రజాస్వామ్యములో వ్యక్తి స్వేచ్ఛ — ప్రధానమైన సూత్రం. ప్రజాస్వామ్యంలో సార్వభౌమత్వం ప్రజలది. ప్రజల చేత ప్రజల కొరకు నిర్వహింపబడునదే ప్రజాస్వామ్య ప్రభుత్వం. వ్యక్తి వికాసమే ప్రజాస్వామ్యమునకు గీటు రాయి. కనుక ప్రజాస్వామ్య దేశాలలో సిద్ధాంత రీత్యా వ్యక్తికున్న విశిష్టత, ప్రాధాన్యం ప్రభుత్వమునకు గాని, యే ఇతర సంస్థకు గాని, ఉండుటకు వీలులేదు. రాజ్యము వ్యక్తి స్వేచ్ఛను దిగ మ్రింగుటకు అవకాశము లేదు. అయినప్పటికీ ఈ నాడు ప్రజాస్వామ్య దేశాలలో కూడ రాజ్యముబ లపడి వ్యక్తి స్వేచ్ఛ అడుగంటుటను మనము చూచుచున్నాము. సిద్ధాంత రంగములో ఉన్నత స్థాయి నందుకొన్న ప్రజాస్వామ్యం ఆచరణలో ఇటువంటి విపరీత ఫలితము నొసంగుటకు కారణము తెలుసుకొనవలసి యున్నది.

డెమోక్రసీ అనుమాట "డెమోస్" మరియు "క్రషియా" అను రెండు గ్రీకు శబ్దములనుండి ఉత్పన్నమయింది. డెమోస్ అనగా ప్రజలనియు, క్రషియా అనగా అధికార మనియు అర్థము. కాగా డెమోక్రసీ అనగా ప్రజాప్రభుత్వమని చెప్ప వచ్చును. ప్రజాస్వామ్యమంటే యేమిటో అనేక మంది పండితులు అనేక రకాలుగా నిర్వచించియున్నారు. ఏ ప్రభుత్వమునందు ప్రతి వ్యక్తి భాగస్వామి అవుతున్నాడో అదే ప్రజాస్వామ్యమంటాడు ప్రొఫెసర్ సీలే. ఏ ప్రభుత్వమునందు పరిపాలనాధికారము ఒక వర్గమునందు గాక సమాజములోని అందరు వ్యక్తుల పరమై ఉంటుందో అదే ప్రజాస్వామ్య మంటాడు లార్డ్ బ్రైస్. ప్రజల చేత ప్రజలకొరకు ప్రజల వల్ల నడుపబడే ప్రభుత్వమే ప్రజా

స్వామ్య మంటాడు లింకన్ మహాశయుడు. యం. యన్. రాయ్ ప్రజాస్వామ్యమును కేవలం ఒక ప్రభుత్వముగానే పరిగణించడు. ప్రజాస్వామ్యమును ఆయన ఒక ఉత్తమమైన జీవిత విధానముగా యెంచుతాడు. ప్రజాస్వామిక సమాజమునకు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ముఖ్యమైన పునాదులనీ, వీనికి మూలము వ్యక్తి అనీ, వ్యక్తి ప్రాధాన్యం ప్రజాస్వామ్యానికి ఒడిపిడి రాయియని ఆయన విశ్వాసం.

పూర్వకాలంలో గ్రీసు దేశంలో ఏథెన్సు మొదలగు పట్టణ రాజ్యాలలో ప్రత్యక్ష ప్రజాస్వామ్యం (Direct Democracy) ఆచరణలో ఉండేది. పట్టణములోని ప్రజలందరూ రాజకీయ వ్యవహారాల్లో పాల్గొనే వారు. ఆ విధంగా ప్రతీ పౌరుడూ తన్ను, తనకున్న సార్వభౌమత్వమును నిత్యమూ ఆచరణలో పెడ్తూ ఉండేవాడు. కాలక్రమేణా పెద్ద పెద్ద జాతీయ రాజ్యాలు యేర్పడినాయి. ఈ పెద్ద జాతీయ రాజ్యాలలో ప్రత్యక్ష ప్రజాస్వామ్యం అమలు పరచుటకు వీలులేనందువలన, ప్రతినిధుల పాలన యేర్పడింది. దీనికే పార్లమెంటరీ ప్రజాస్వామ్యమని అంటున్నారు. ఈ విధానంలో ప్రజలు నాలుగైదు సంవత్సరములకొకతూరి తమ ప్రతినిధులను యెన్నుకొంటున్నారు. వారు తిరిగి యెన్నికలు జరిగేవరకు ప్రభుత్వం చేస్తున్నారు. అసలు ప్రజాస్వామ్యంలో ప్రజలే సంపూర్ణ అధికారులు. ప్రభుత్వాన్ని గద్దె యెక్కించినా, దించినా వారే. ప్రభుత్వమునకు వారే భర్తలూ, కర్తలూ. కాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ సార్వభౌమత్వమును ప్రతినిధులకు బదిలీ చేస్తున్నారు. ఐదుసంవత్సరాలవరకు ఆ ప్రతినిధులు యెలా పరిపాలించినా వారు యేమియు చేయలేరు. కాగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రజలకొరకు ఏర్పడిన ప్రభుత్వమైతే కావచ్చును గాని, నిత్యమూ ప్రజలచేత నడుపబడే ప్రభుత్వం కాదు. ఏనాడో రూసో పండితుడు చెప్పినట్లుగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రజలు ఐదు సంవత్సరాలలో ఒక్క రోజు మాత్రమే స్వాతంత్ర్యాన్ని పొందుతారు! అంతేగాక 19—వ శతాబ్దిలో సంఘటితమైన రాజకీయ పార్టీలు యేర్పడినవి. దాంతో ప్రజాప్రతినిధులు పార్టీ ప్రతినిధులై ప్రజాస్వామ్యం సంపూర్ణంగా నాశనమయింది. ప్రతినిధులు యేదో ఒక రాజకీయ పక్షమునకు సంబంధించిన వారగుటచే వారు ప్రథమంగా తమ పార్టీకి బాధ్యులుగానీ ప్రజాప్రతినిధులు కాజాలరు. అసలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యమే ప్రత్యక్ష ప్రజాస్వామ్యం కాదు. అందులోనూ రాజకీయపార్టీల ప్రాబల్యంయెక్కువ అయినందువల్ల ప్రజా స్వామ్యం ఇంకా, యింకా పరోక్షమై, ప్రతినిధులు ప్రజలకు దూరమై, పార్టీల చేతుల్లో కీలుబొమ్మలై, ప్రజాసామ్యం క్షీణించి, పార్టీ స్వామ్యం యేర్పడుతూఉంది. ఇది ఈనాడు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అమలులో ఉన్న ప్రతి దేశంలోనూ జరుగుతూ ఉన్న విషయమే. బ్రిటన్‌లోని ప్రభుత్వ విధానమును గురించి వ్రాస్తూ 'రామ్‌సేమ్యూర్' ఈ విషయమును ప్రస్తావించి అక్కడ కాబినెట్ నియంతృత్వం అమలులో ఉందంటాడు. యం. యన్ రాయ్ కూడ పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని ప్రధాన లోపాలను కూలంకషంగా వివరించినాడు. ఈ పార్లమెంటరీ విధానంలో అధికారము ఎన్నికైన ప్రతినిధులకు బదిలీ చెయ్యటం జరుగుతున్నందువలన ఆచరణలో ప్రజల స్వామ్యం అడుగంటుతున్నదనియు, ఈ పరిస్థితుల్లో వ్యక్తి సార్వభౌమత్వమునకు అర్థము లేకుండా పోతుందనియు, వ్యక్తి నిర్జీవమైన పార్టీ యంత్రమునకు బానిస అవుతున్నాడనియు ఆయన నిర్ణయం.

"Parlimentarism, based on the theory of delegation of power to elected representatives debased democracy to a mere formality, if not fraud, Under such circumstances, the sovereignty of the individual becomes meaningless; democrasy demands that the sovereign individual must merge himself in a party, be a subservient part of an inpersonal party machine" —See "Radical Humanism"

సుసంఘటితమైన రాజకీయ పక్షాలు యే విధముగా ప్రజాస్వామ్యమును నాశనము చేసి పార్టీనియంతృత్వమును ఏర్పాటు చేయుచున్నవో ఆయన "Politics, Power and Parties" అను తమ గ్రంథములో క్షోదక్షముగా పరిశీలించారు. ప్రతి రాజకీయపక్షమునకు కొన్ని సిద్ధాంతాలుండును. అవసరమైన నిర్మాణ కార్యక్రమంకూడా ఉంటుంది. అయితే ప్రతి రాజకీయ పక్షము అధికారం కొరకు అర్రులు చాచుతుంది. అధికారంహస్తగతమైతే గదా ఏ కార్యక్రమమైనా చెయ్యటానికి వీలయ్యేది? అందువల్ల అధికారం ముఖ్యమవుతుంది. ఇదే పార్టీ విధానంలో ఉన్న ముఖ్యమైన లోపం. అధికారం లేకపోతే యేమి చెయ్యలేము కనుక యేదో విధంగా అధికారం చేజిక్కించుకోవాలి. కాగా పార్టీలకు అధికారం పొందటమే ముఖ్య ఆశయమవుతుంది. ఈ ఆశయ సిద్ధికోసం ఈ మార్గం ఆ మార్గం అనే విచక్షణ లేదు. నయానో, భయానో, న్యాయంగానో, అన్యాయంగానో యేదో విధంగా ఓట్లు సంపాదించడం, సీట్లు గెలవడం, అధికారంలోకి రావటం ముఖ్యమవుతుంది. ఇది అన్ని పార్టీలు చేసే కార్యక్రమమే. రాజకీయ పక్షాలు ప్రజల్లో రాజకీయ పరిజ్ఞానమును అభివృద్ధి చెయ్యాలని, సత్యాన్వేషణ, స్వేచ్ఛా పిపాస రేకెత్తించాలనీ యెవరైనా అంటే అది ఆచరణలో జరిగే విషయం కాదు. మనకు తెలుసు. జరుగుతున్నది అధికారం కోసం వేట. ఎన్నికలు ఒక పెద్ద జాతర. ప్రచారం ఒక పెద్ద తంతు. విధానం ఓటరు అజ్ఞానమును, కుల మత కక్షలను ఉపయోగించుకొనుట.

# ఎం. ఎన్. రాయ్ తాత్త్వక దృష్టి

ఇది ఈనాడు జరుగుతూ వున్న నాటకం. ఇదే రాజకీయాల ఆట. ఈ ఆటలో అబద్ధాలు చెప్పటం, అసత్యాన్ని ప్రచారం చేయటం తప్పుకాదు. ఈ ఆటలో అన్యాయం న్యాయంగా, అధర్మం ధర్మంగా చలామణి అవుతుంది. ఇదంతా ప్రజాస్వామ్యమని ఉద్ఘాటిస్తున్నారు. ఈ ఆటలో దిగినవాడు ఎంత సత్యవంతుడైనా మైలపడి పోవలసిందే. లేకపోతే అతనికి భవిష్యత్తు లేదు. ఇదంతయు ప్రజాస్వామ్య పరి రక్షణార్థమై అవతార పురుషులమనుకొనే పార్టీ నాయకులు చేస్తున్న పని. "ఇది తప్పు. ఈ విధానం వల్ల ప్రజలకు అన్యాయం జరుగుతుంది. ప్రజాస్వామ్యం అడుగంటుతూంది. నైతిక విలువలు భూస్థాపితం అవుతున్నవి. వ్యక్తి పార్టీ యంత్రంలో నలుగుతున్నాడు." అని చాటిన వాడు యం. యన్. రాయ్. ఈనాడు పార్టీ విధానం ఎలా పనిచేస్తోందో యేవిధంగా ప్రజా స్వేచ్ఛను నిర్మూలిస్తోందో వివరిస్తు ఆయన తెల్పిన మూడు ముఖ్య విషయాలను ఇట ఉదహరిస్తాను :

(1) ఈనాడు ప్రతివాడు యేదో ఒక రాజకీయ పక్షములో చేరుతున్నాడు. అలా చేరవలసిన అవసరమున్నదనుకొంటున్నాడు. ఎందువలన? రాజకీయ పరిజ్ఞానమును పొందుటకా ? తన అభిప్రాయములను వ్యక్తీకరించుటకా ? దైనందిన చరిపాలనలో ఇతోధికమైన సన్నిహితత్వం సంపాదింపుటకా? కాదు. కార్మికుడు, కర్షకుడు, విద్యార్థి, ఉపాధ్యాయుడు — ఒక్కరేమిటి—దాదాపు అందరూ పార్టీలో చేరుతున్నారు. ఎందుకు? అందువల్ల తమకు రక్షణ, అండదండలు, భద్రత చేకూర గలవని; యేదో ఒక పార్టీని ఆశ్రయించుకొని ఉన్నచో కొంత లాభం కలుగు తుందని. ఏ పార్టీలో చేరకుండా ఉంటే నిరాశ్రయుడవుతాడు. నిరాశ్రయునికి యే పనులూ కావు. అందువల్ల ఈనాడు దాదాపు అందరూ రాజకీయ పార్టీలలో చేరటమో, అభిమానులుగా ఉండటమో చేస్తున్నారు. ఈ విధంగా "మూక రాజకీయ పక్షాలు" (Mass Political Parties) యేర్పడుతున్నవి. అభిప్రాయాలను ప్రకటించుటకు గాక రక్షణకొరకు ఏర్పడే మూకపార్టీలు నేటి రాజకీయ వ్యవస్థలో కానవచ్చు ఒక పెద్ద మార్పు—లోపం కూడ. (2) పార్టీ నిర్మాణంలోకూడ ఈనాడు యెంతో మార్పు వచ్చింది. పార్టీలు మూకపార్టీలు అయినందువలన, సభ్యత్వం తెగ పెరిగి పోయినందువల్ల, పార్టీలోని ప్రతి సభ్యునీ కలుసుకొని, విషయాలు చర్చించి, అతని అభిప్రాయాలు సేకరించటం అసాధ్యం కాగా చిన్న చిన్న స్థానిక పార్టీ కేంద్రాలు (Party machines) లేదా సంఘాలు కీలక స్థానంగా రూపొంది అన్ని విషయాలను నిర్ణయిస్తున్నాయి. పార్టీ కేంద్రాలు చేసే నిర్ణయాలు ప్రజల నిర్ణయాలు ఎలా అవుతాయి ? (3) పార్టీ విధానం పైని చెప్పిన విధంగా పనిచేస్తూ ఉన్నందువలన పార్లమెంటులో జరిగే నిర్ణయాలు ప్రజానిర్ణయాలు గావు. అవి పార్టీ నిర్ణయాలు. పార్టీలోని ఏ కొద్దిమంది నాయకులో అన్ని విషయాలును చర్చించి తీర్మానాలు చేస్తారు. ఈ తీర్మానాలు పార్టీయొక్క స్థానిక కేంద్రాల ద్వారా ప్రజలపై రుద్దబడుతవి. "రక్షణ కోసం", "ఆశ్రయం" కోసం పార్టీలో చేరిన ప్రజలు ఆ తీర్మానాలను, పథకాలను, నిర్ణయాలను నిర్లిప్తులై శిరసావహిస్తారు. ఈవిధంగా ప్రజాస్వామ్యమనే రంగుతో పార్టీ రాజ్యం అమలు జరుగుతూ ఉంది.

పదవుల కొరకు ప్రాకులాట, పార్టీల తగులాటంలేని నూతన రాజకీయ విధానమును అనుసరించి, ప్రజాస్వామ్యమును పునరుద్ధరించవలసిందిగా రాయ్ మహాశయుడు ఉద్బోధించి నాడు. అందుకొరకు ఆయన ఒక నూతన వ్యవస్థా నిర్మాణమును ప్రతిపాదించి, దానికి "రాడికల్ డెమోక్రసీ" అను పేరు పెట్టినాడు. రాయ్ రూపొందించిన రాడికల్ డెమోక్రసీలోని కొన్ని ముఖ్యాంశాలను వివరించుట అవసరమే గదా ?

(1) అధికారమును (Power) గురించి నూతన దృక్పథం కల్పించుటతో రాడికల్ డెమోక్రాటిక్ వ్యవస్థకు పునాది ఏర్పడుతుంది. ఒక గమ్యమును చేరుటకు అధికారము ఒక సాధనం మాత్రమే. అయితే ఈ సాధనం యొక్క ప్రభావమునకు లోపడి గమ్యాన్ని విస్మరించుట జరుగుతున్నది. ఒకసారి అధికారం చేజిక్కించుకోగానే, దానిని రక్షించుకోవలసిన అవసర మేర్పడుతూ ఉంది. ఏ ప్రజాస్వామ్య కార్యక్రమమును అమలుపరచవలయునన్ననూ అధికారము అవసరమనే ఊహతో ఇదంతయు జరుగుతూ ఉంది. కాని, ఉన్నతమైన స్వేచ్ఛను సాధించాలంటే ప్రజాస్వామ్య సమాజమునకు ఆధారమైన స్వేచ్ఛాతృష్ణను అధిక సంఖ్యాకులైన వ్యక్తులలో రేకెత్తించాలి. సమాజములో ఏ మార్పునైనా దాని నిర్మాతలైన వ్యక్తులు మాత్రమే తీసికొని రాగలరు. ప్రజలను స్వేచ్ఛాపథములో నడిపించుటకు అధికారము ఒక సాధనము మాత్రమే.

(2) అధికార రాజకీయాలు (Power Politics) ప్రజాస్వామ్యమునకు, స్వేచ్ఛకు విరుద్ధములను విషయము ప్రజల్లో బాగా నెలకొనవలయును. అందుకై వారిలో విజ్ఞాన వికాసాలు విరివిగా పెంపొందించాలి. వారి అజ్ఞానమును తొలగించుటకు వారిలో రాజకీయ చైతన్యము నభివృద్ధి చేయుటకు తీవ్రమైన కృషి జరుగవలయును. విచక్షణాజ్ఞానం కల వ్యక్తుల రాకతో రాడికల్ ప్రజాస్వామ్య వ్యవస్థకు గట్టి పునాది ఏర్పడగలదు. ఇటువంటి వ్యక్తులు అధికార రాజకీయాలకు తలఒగ్గరు. వారు సాధనమును లక్ష్యమునుండి వేరు చేయరు. ఉత్తమాశయ సిద్ధికి ఉత్తమ సాధనాలు అవసరమని వారు విశ్వసిస్తారు. స్వేచ్ఛాపిపాస దారిచూపగా వారు సత్యాన్వేషణపరులై ప్రజాస్వామ్య జీవిత విధానమును వరింపగలరు.

(3) దేశంలోని ప్రజ లందరనూ విద్యావంతులను చేయలేమనే నిర్ణయంతో ఇంతవరకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యమే ఆమోదింపబడుతూ ఉంది. అయితే వైశాల్యంలోనూ, జనసంఖ్యలోనూ అతి విస్తారమైన ఏ రాజ్యంలో నైనా ప్రజ లందరకూ దూరంగా ఒకచోట అధికారం కేంద్రీకరింపబడినచో అది ఎన్నటికీ ప్రజాస్వామ్యం కాజాలదు.

అందువలన దేశంలోని సాంఘిక, రాజకీయ జీవితమును వికేంద్రీకరణ చేసి అధికారము ఒక్కచోట కేంద్రీకృతం గాకుండా చూడవలసి ఉంది. అందుకొరకు నూతన ప్రజాస్వామ్య వ్యవస్థలను రూపొందించుకొనవలసి ఉన్నది. స్థానిక ప్రజాసంఘాల ద్వారా (Peoples' Committes) రాజకీయ రంగంలో వికేంద్రీకరణనూ, ప్రత్యక్ష ప్రజాస్వామ్యమును సాధింపవచ్చునని రాయ్ నమ్మకం. అసంఖ్యాకములయిన స్థానిక ప్రజాసంఘాలే దేశంలో ప్రజాస్వామ్య రాజకీయ సోపానమునకు మొదటి మెట్టు. ఈ ప్రజా సంఘాలే జిల్లా సంఘాలకు, రాష్ట్ర శాసన సభలకు, జాతీయ పార్లమెంటుకు మూలములు. ప్రజాసంఘాలే ఎన్నికలు జరిపి వివిధ సంస్థలకు సభ్యులను ఎన్నుకొంటాయి. అసెంబ్లీ, పార్లమెంటు సభ్యులను తిరిగి పిలిచే అధికారం (Recall) యీ ప్రజా సంఘాలకు ఉంటుంది. తమకు అవసరమైన బిల్లులను ప్రతిపాదించే అధికారం కూడ (Initiative) వీటికి ఉంటుంది. పైగా ముఖ్యమైన బిల్లులను శాసనసభా సభ్యులు ఈ ప్రజా సంఘాల అభిప్రాయసేకరణకు పంపవలసి ఉంటుంది. (Referendum).

(4) సమాజ నిర్వహణలో రాజ్యము (State) నిర్వహింపదగిన పాత్రను గురించి కూడ కొత్త దృక్పథం అవసరం. సమాజమును, వివిధ సాంఘిక వ్యవస్థలను స్వేచ్ఛకొరకు మానవుడు ఏర్పాటు చేసుకొన్నాడు. రాజ్యమే గాక కుటుంబము, ట్రేడ్ యూనియన్, స్కూల్ క్లబ్బులు, విశ్వవిద్యాలయాలు మొదలయిన సాంఘిక వ్యవస్థలు మానవ వికాసమునకు అత్యంత అవసరము. రాజ్యమునకు ఎంత ప్రాధాన్య మున్నదో ఇతర సంస్థలకు కూడా అంతే ప్రాధాన్య మున్నది. ఈ విషయమును మైట్‌లాండ్, ఎర్నెస్ట్ బార్కరు, లాస్కీ మొదలయిన బహు వ్యవస్థావాదులు (Pluralists) యింతకు పూర్వమే వివరించి యున్నారు. దేశంలో శాంతిభద్రతలను, వివిధ సంస్థల మధ్య సామరస్యమును ఏర్పాటుచేసి, దేశ రక్షణకు పాటుబడుటయే రాజ్యము నిర్వహింపవలసిన విధులు. అంతేగాని ప్రజాసంక్షేమం పేరుతో వివిధ సాంఘిక సంస్థల అధికారములను తానే గుత్తకు తీసుకొని రాజ్యము బలపడుట ప్రజాస్వామ్యమునకు, స్వేచ్ఛకు గొడ్డలిపెట్టు. శ్రేయోరాజ్యము (Welfare State) పేరుతో ఈనాడు ప్రజాస్వామ్య దేశాలలో రాజ్యాధికారములు విస్తృతమై, ఇతర సాంఘిక సంస్థల స్వతంత్ర ప్రతిపత్తి భగ్నమగుట నియంతృత్వ విధాన లక్షణము.

(5) రాజకీయ రంగముతోపాటు ఆర్థికరంగంలో కూడ వికేంద్రీకరణ సూత్రం అమలుపెట్టబడిన నాడే ప్రజాస్వామ్యం దిగ్విజయము కాగలదు. సర్వ ప్రజలకూ సమానావకాశములు నెలకొల్పవలయునన్న సదుద్దేశముతో ప్రజాస్వామ్యవాదులు కూడ ఈనాడు సోషలిస్టు ఆర్థిక విధానమును సమర్థించుచున్నారు. సోషలిస్టు ఆర్థిక విధానములో ముఖ్యమైన ఉత్పత్తిసాధనము లన్నియు భూమి, పరిశ్రమలు, యంత్రములు, బ్యాంకులు మొదలయినవి—సంఘపరము చేయబడును. అనగా ఆచరణలో అవి అన్నియు రాజ్యముయొక్క యాజమాన్యము క్రిందకు వచ్చును. ఇక ఉత్పత్తి రాజ్యము లేక ప్రభుత్వము నిర్ణయించిన అంచనాల ప్రకారము కొనసాగింప బడుతుంది. అంతేగాక ఉత్పత్తిచేయు పారిశ్రామికులకు ప్రభుత్వమే వేతనాలు యిస్తుంది. సోషలిస్టు ఆర్థిక విధానములో ఆర్థికాధికారము లన్నియు ప్రభుత్వము చేతుల్లో కేంద్రీకృతమై, వ్యక్తి స్వేచ్ఛ కుంటుపడక తప్పదు. ఇటువంటి సోషలిస్టు ఆర్థిక విధానమును అమలుపరచుటకు ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికలనో, సప్తవర్ష ప్రణాళికలనో చేపట్టక తప్పదు. ఇటువంటి ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానము వలన రాజకీయాధికారముతోపాటు ఆర్థికాధికారములన్నియు ప్రభుత్వవశ మవుతున్నవి. ఎల్లవేళలా ప్రభుత్వము సరియైన ఆర్థిక పథకాలనే రూపొందించునను నమ్మకము లేదు. పైగా ప్రభుత్వము తాను నిర్ణయించిన ఆర్థిక పథకాల నిర్వహణకై ప్రజలవద్దనుండి అధికముగా పన్నులను వసూలుచేయక తప్పదు. ప్రణాళికాబద్ధమైన సోషలిస్టు విధానం వ్యక్తి స్వేచ్ఛను నిర్మూలిస్తున్నది గనుక ఇది ప్రజాస్వామ్యమునకు బద్ధ వైరి. అందువలన "ప్రజాస్వామిక — సోషలిజం" అనునది అర్థరహిత సిద్ధాంతమని రాయ్ తీర్పు. ప్రజాస్వామిక—సోషలిస్టు వ్యవస్థలో సోషలిజంమాట ఎట్లున్ననూ, ప్రజాస్వామ్యం మంటగలసిపోక తప్పదు. మానవేంద్రుడు ఒకచోట ఈవిధంగా వ్రాయుచున్నాడు :—

"It is an unfounded assumption that state-planning necessarily leads to economic democracy and social justice The hypothesis has not stood the test of practice. Nor is planning always motivated by social idealism. The economy of Nazi Germany was most rigorously planned by the state It only served the purpose of a dictatorial political regime. Planning may quicken the tempo of production; but it has no where done better than in American free enterprise In Russia it has promoted considerable industrial progress in a relatively short time. But there also, equitable- not to mention equal, distribution remains in the realm of Utopia. And the 'Status quo' does not allow any optimism about the attainment of the ideal. In the meantime, planning has resulted in economic regimentation and eclipse of liberty ... State ownership of the means of production, called nationalisation and state-control of the economic as well as

other aspects of social life means so much concentration of power as rules out the possibility of democratic freedom."

రాయ్ మతం ప్రకారం ఆర్థిక సంబంధాలు, వ్యవస్థలూ మానవస్వేచ్ఛకు, ప్రజాస్వామ్య జీవిత విధానమునకూ తగిన విధముగా రూపొందింపబడవలయును. ఈ దృష్టితో ఆయన "సహకార ఆర్థిక విధానము" (Co-Operative Economy) పేరుతో కొన్ని సూచనలు యిచ్చినాడు. ఈ సహకార ఆర్థిక పద్ధతి యొక్క ఆశయములు :—ఒకటి ప్రజల జీవన ప్రమాణమును పెంచుట, రెండు, వ్యక్తి స్వేచ్ఛకు దోహదముచేయు ఆర్థిక విధానమును నెలకొల్పుట. ఈ సహకార విధానములో ఉత్పత్తిదారుల, వినియోగదారుల సహకార సంస్థలకు ఎక్కువ ప్రాధాన్యము యివ్వబడింది. గ్రామాలు, జిల్లాలు, రాష్ట్రాల స్థాయిలో ప్రణాళికా సంఘాలు ఏర్పాటు చేయబడ గలవు. ఆర్థిక సంబంధాలలోని ఒడుదుడుకులను సర్దుబాటు చేయుటకు ఒక కేంద్ర ఆర్థిక సంస్థ కూడ ఉండ గలదు.

మన దేశములో భగవత్తత్త్వమును గురించి తెలుపు దానిని తత్త్వశాస్త్రముగా పరిగణించుట పరిపాటి అయినది. పరతత్త్వమును గురించి, ఆత్మ—పరమాత్మలను గురించి చెప్పునది మతముగాని, తత్త్వశాస్త్రము కానేరదు. లభ్య మానశాస్త్ర విజ్ఞాన సర్వస్వమును సమన్వయపరచి మానవుని గురించి, మానవునకు—ప్రకృతికీ, మానవునకూ—సమాజమునకూ గల సంబంధమును గురించి హేతుబద్ధముగా సూత్రీకరించునదియే తత్త్వశాస్త్ర మనబడును. 1 ఈనాడు శాస్త్రీయ విజ్ఞానము బహుముఖీనమై శరపరంపరగా అభివృద్ధి చెందుతూ ఉంది. భౌతికశాస్త్రములు, జీవశాస్త్రము, మానసిక శాస్త్రము, మానవ వికాస శాస్త్రము— ఈవిధంగా ఎన్నో శాస్త్రములు నూతన సత్యములను తెలియజేయు చున్నవి. అనంతమైన విజ్ఞానమును మధించి, దేశ కాల పరిస్థితులను గమనించి, మానవస్వేచ్ఛా వికాసమున కనురూపమైన నూతన తత్త్వమును వెలువరించుటకు అనేకమంది జిజ్ఞాసువులు కృషిచేయు చున్నారు. నవభారతము గర్వింపదగిన అటువంటి జిజ్ఞాసువులలో మానవేంద్రనాథ్ రాయ్ మొట్ట మొదటివాడు. ఈ శతాబ్దిలో నభివృద్ధిచెందిన శాస్త్రీయ విజ్ఞానము నంతయు పరిశోధించి, నేషనలిజం, ఫాసీజం, ఇంపీరియలిజం, కమ్యూనిజములను నిశితముగా పరిశీలించి వానివలన మానవస్వేచ్ఛకు—ప్రజాస్వామ్య జీవిత విధానమునకు అంతరాయములు కలుగునని తేల్చుకొని, హేతుత్వము, స్వేచ్ఛ, నీతి ప్రధాన ప్రాతిపదికలుగా గల రాడికల్ మానవతా వాదమును రూపొందించిన దార్శనికోత్తముడు మానవేంద్రనాథ్. ఆయన సిద్ధాంతాలు ఈనాడు మన దేశములోనే గాక, అమెరికా ఐరోపా దేశాలలో గూడా జిజ్ఞాసువుల మన్ననల నందుకొనుచున్నవి.

1. తత్త్వశాస్త్రమునకు మానవుడే పరమార్థము. మానవుని సత్యాన్వేషణ అనంతము—గనుక తత్త్వశాస్త్రమునకు చరమదశ యంటూ ఉండదు.)





# నా లో లో కం

## శ్రీ అద్దేపల్లి రామమోహనరావు

అతిలోకమైన సౌందర్యం విరజిమ్మే
అంగన వంక చూస్తున్నప్పుడు
ఆమె నాకు సంబంధించినదే అని
అనిపిస్తూ ఉంటుంది లోప లెక్కడో!

పరమ మధురమైన సంగీతం విన్నప్పుడూ
అతిరసార్ద్రమైన కవిత్వం చదువుతున్నప్పుడూ
మనోహర చిత్రాన్ని చూస్తున్నప్పుడూ
మైమఱపించే నాట్యంలో లీనమైనప్పుడూ
అవ్వన్నీ నాలోనుంచే వస్తున్నాయని
అనిపిస్తూ ఉంటుంది మనస్సు లోతులలో!

ఆకాశాన్నంటే మహాపర్వతాలన్నీ,
ఆకాశమంత ఎత్తునుంచిపడే జలపాతాలన్నీ
చూస్తూ నుంచున్నప్పుడు,
ఆ కొండలు నా గుండెల్లో నిలబడ్డట్లూ
ఆ ప్రవాహాలు నా నరాల్లో పరిగెత్తుతున్నట్లూ
నిజంగా అనిపిస్తోంది!

ప్రగాఢ ప్రశాంతర క్త సంధ్యాసమయాన
ఊరియొక్క చిట్టచివరి బయలులో—
తమనీడలు కదలని సరస్సులో
తమని చూస్తూ మేనుమఱచిన ఆలోచనలతో
నిశ్చలంగా నిలిచిన, వేదాంతులవంటి
తాటితోపుల వెనకాల—

అణఁగి పోబోతున్న పక్షులగోలలు
అస్తమింపనున్న సూర్యుని మౌనంలో
మాయమౌతున్న నిశ్శబ్దతలతో ప్రతిధ్వనించే
నిరామయమైన పడమటి గుహావంక—
ఱెప్పలార్పకుండా చూస్తున్నప్పుడు—
అదంతా నా హృదయానికి వెనకాల ఖాళీలో
ఆవులిస్తున్నట్లుగానే అనిపిస్తోంది!

# తేజోరేఖలు

## శ్రీ సంజీవదేవ్

శీతకాలంలో ఆకాశం అంతా మేఘాలు క్రమ్మిఉంటే బావుండదు. శీతకాలానికి శోభనిచ్చే స్వచ్ఛ నీలాకాశమూ, నులి వెచ్చగా ప్రకాశించే వెండి ఎండా, ఈ రెండూ మేఘాలచాటున మరుగుపడితే ఇంకా శీతకాలపు ఆనంద మేమి ఉంటుంది? కారుమేఘాల ఆనందమల్లా వర్షఋతువులోనే.

మన మానసికావస్థమీద వాతావరణంలోని మార్పుల ప్రభావం ఎంతగానో పడుతుంది. అది మన మానసాన్ని కృంగ దీస్తుంది., పైకెత్తుతుంది, బాధ పెడుతుంది, ఆనంద పరుస్తుంది. కాని, ఈ ప్రాకృతిక ప్రభావాలను అధిగమించ కలిగినప్పుడు మనం ధన్యుల మవుతాం. శీతకాలపు మేఘాలు ఆనందం ప్రసాదించజాలవు కాని, శీతకాలపు వర్షం మాత్రం ఒక విధమైన ఆనందాన్నిస్తుంది. శీతకాలంలోని వర్ష దృశ్యం రంగులోనూ, రూపంలోనూ కూడ ఏదో మనోహరంగా గోచ రిస్తుంది. అకాలపు విశేషాలు ఒక విలక్షణమైన ఆకర్షణ కలిగి ఉంటవి. శీతకాలపు వర్ష దృశ్యం జపాన్ ప్రకృతి శిల్పి హిరోషిగే చిత్రించే ఆనందంతో కూడిన విషాద చిత్రాల్ని జ్ఞప్తికి తెస్తూంటవి.

కళ ప్రకృతిని అనుకరిస్తుందా లేక ప్రకృతే కళను అనుకరిస్తుందా అనేది అంత ప్రాముఖ్యం కాదు. కావలసిం దల్లా కళలోనూ, ప్రకృతిలోనూ గోచరించే రంగులకూ, రూపాలకూ, రచనా చమత్కారానికీ మనం ఎంతవరకు రస వంతంగా చలిస్తామా అనేది! ప్రకృతి కళను అనుకరిస్తుంది. ఎందుకంటే కళ ప్రకృతిని అనుకరిస్తుంది కనుక!

* * * *

కళ మానవ నిర్మితం అనీ, మానవుడు సమాజ నిర్మితం అనీ, కనుక కళ సమాజ నిర్మితం అనీ అంటారు. ఈ క్రమాన్ని మనం తలక్రిందులు ఎందుకు చేయకూడదు? సమాజం మానవ నిర్మితం, మానవుడు కళా నిర్మితం—కనుక సమాజం కళానిర్మితం అని ఎందుకు కాకూడదా అని! ఈ తలక్రిందుల క్రమం మొదటిదాని కంటే ఎక్కువ సహజమైన దేమో అనిపిస్తుంది.

* * * *

పుస్తకా లన్నిటికంటే ఆత్మకథలూ, స్వీయ సంస్మృతులూ, ప్రత్యేకించి సంస్కృతిరంగానికి చెందిన వ్యక్తులు—సాహితీజీవులూ, చిత్రకారులూ, సంగీత శిల్పులూ, తత్వ వేత్తలూ, మర్మ సాధకులూ, అన్వేషకులూ, సమీక్షకులూ, రసజ్ఞులూ, వైజ్ఞానికులూ మొదలైనవారు—రచించినవి ఎక్కువ అభిరుచికరంగా ఉంటవి. ఇటువంటి రచనలు వ్యక్తి జీవితానికి సంబంధించినవి కనుక అవి వ్యక్తిగత మాధుర్యాన్ని కలిగిఉంటవి. రచయితల ఇతర రచనలు కూడ రుచివంతంగానే ఉంటవి. కాని వారి జీవితాల వ్యక్తిగత వివరాలు అన్నిటికంటే ఎక్కువ మనోహరంగా ఉంటవి.

* * * *

దూరప్రాచ్యపు జన్ ఆచార్యులు అంటారు, "సాగిపోతూన్న ప్రతి క్షణం యొక్క హృదయంలోనూ జీవనజ్వాల ప్రజ్వలిస్తూంటుంది" అని. ఆ జ్వాలను అందుకోటంలోనే మానవుని లక్ష్యసిద్ధి ఇమిడుంది. దాన్ని అందుకోటంలో వైఫల్యం సంభవించినా ఆ వైఫల్యమే ఒక గొప్ప కార్యసిద్ధి!

* * * *

కోరికల్ని పెంచుకోటం మధురంగానే ఉంటుంది, సందేహము లేదు. కాని, అదే సమయాన, కోరికలు ఫలించక పోయినా కూడ మధురతరంగా ఉండటం నేర్చుకోవాలి. లేనిచో బాధ తప్పదు.

* * * *

మృత్యువు ఒక అద్భుత సంఘటన జీవితంలో. మానవుడు తన స్వంత మరణాన్ని గురించి అది జరగకముందే బాధపడతాడు. అదేవిధంగా ఇతరుల మరణాన్ని గురించి అది జరిగిన తర్వాత బాధపడతాడు.

* * *

మృత్యు రహస్యాన్ని ఇంతవరకూ ఏ వైజ్ఞానికుడు కాని, తత్వవేత్త కాని సక్రమంగా ఉన్మీలన చేయలేదు. మరణం ఒక మహా రహస్యమైతే జీవనం ఒక మహత్తర రహస్యం!

* * *

జీవితం గద్యాత్మకమైన ముడి పదార్థం; దాన్ని మనం ఆనందపు లయతోను, శాంతియొక్క ప్రాసతోను ప్రతిధ్వనించే కవితాఖండంలోకి రూపాంతర పరచాలి. అప్పుడు కాని జీవితం ఒక కాంతి గీతగా మారదు, దాని ముందు దుఃఖాల నీడలు నిలవలేవు. జీవితం కాంతి అయినపుడు మరణం శాంతి అవుతుంది.

* * *

మార్పులేని ఏకరీతి జీవితంలో ఒక వ్యతిరేక శక్తి. అది జీవితంలోని ఆనందాన్ని నిస్తేజ పరుస్తుంది. జీవించటంలో ఉండే అభిరుచినంతా చప్ప పరుస్తుంది, ఆలోచనలోనూ, అనుభూతిలోనూ సాగే ప్రగతినంతా స్థగితం చేస్తుంది.

ఏకరీతి (monotony) అనేది రెండు విధాలు—వ్యక్తిగతం, వస్తుగతం. వ్యక్తిగత ఏకరీతి అనేది ఒక మానసిక లోపం. ఇది నూతన పరిసరాలలో కూడ నూతనత్వాన్ని చూడలేదు. కారణం, జీవితంలోని అనేక తెలిసీ తెలియని కారణాలవల్ల వ్యక్తిలోని సంవేదనాత్మక గ్రహణశీలత స్తబ్ధం అయిపోతుంది. కాని, వస్తుగత ఏకరీతి వ్యక్తికి ఇటువంటి మానసికలోపాలనేమీ ఆరోపించక ఆ లోపా లన్నిటినీ తనకే ఆరోపించుకుంటుంది. తనను ఆనందపరిచే నూతన పరివర్తన ఆ పరిసరంలో ఏమీ కనుపించని కారణంచేత మనిషి ఈ వస్తుగత ఏకరీతివల్ల బాధ పడతాడు. కాని, తనకు ఆనందప్రదంకాని పరిసరాల నుంచి కూడ మానవుడు ఆనందం పొందటం నేర్చుకొంటే బాధలేదు.

* * *

అంతర్ముఖులు కావటం, కొండలూ, కోనలూ, అడవులూ, సెలయేళ్లూ గల ఏకాంతంలో నివసించటం, దేహానికి చెందని ఆనందాన్ని అన్వేషించటం, ఇవన్నీ వాస్తవ జీవితం నుంచి తప్పుకొనే పలాయనవాదం కావు. ఇవే పలాయనవాదం అయితే సంగీతమూ, కవిత్వమూ, నృత్యమూ, నాట్యమూ, చిత్రరచనా, శిల్పమూ మొదలైనవన్నీ కూడ పలాయనవాదంలోనే లెక్క. వీ టన్నిటికంటే మించిన పలాయనవాదం మరణం. ఇవన్నీ లేకుండా మానవు డెప్పుడూ జీవించలేడు. పైగా ఇవన్నీ లేకుండా జీవించాలని ప్రయత్నించటమే అన్నిటి కంటే గొప్ప పలాయనవాదం!

* * * *

కొందరు తాము నేర్చుకొన్న దాన్ని మరచిపోతారు, మరి కొందరు జ్ఞాపకం ఉంచుకొంటారు. కొందరు తాము నేర్చుకొన్న దానికంటే ఎక్కువ మరచిపోయే వా రున్నారు. ఇదేవిధంగా కొందరు తాము నేర్చుకొన్న దానికంటే ఎక్కువ జ్ఞాపకం ఉంచుకొనేవా రున్నారు. ఈ నాలుగు విధాలలోకీ తాను నేర్చుకొన్న దానికంటే ఎక్కువ జ్ఞాపకం ఉంచుకోవటం అన్నిటికంటే గొప్ప మానసిక శక్తి. జీవితంలోని అన్ని రంగాలలోనూ ఇది మహత్తర వరదానం. సృజనాత్మక మౌలికతకూ, త్వరిత కల్పనకూ, వక్తృత్వ శక్తి మొదలైన వాటికీ ఇది బలమైన మూలం. నేర్చుకున్న దానికంటే మించి జ్ఞాపకం ఉంచుకోవటం మానస కాంతిలోని ఒక తేజో కిరణం.

* * * *

లోకోత్తరమైందనీ, లౌకికమైందనీ, ఆత్మికమైందనీ, భౌతికమైందనీ, ఐహికమైందనీ, ఆముష్మికమైందనీ అనబడే వాటి మధ్య ఒక సరిహద్దు గీత గీయాలని చూస్తారు చాలా మంది. ఇటువంటి సరిహద్దు గీత ఎల్లప్పుడూ అంత క్షేమమైంది కాదు. ఆనందమయ, ధ్యానమయ, జ్ఞానమయ జీవితాన్ని గడపటానికి భౌతిక ఆత్మిక సమన్వయ సత్తాను గ్రహించే ఒక సమగ్ర దృష్టి, ఒక అపరోక్షానుభూతి, ఒక ప్రాణమయ సాధన అవసరం.

వెలుగు నీడల, జీవన్మరణాల యీ జగత్తులో ఏదీ ప్రాపంచికం కాదు, ప్రతీదీ పావనమే, ప్రతీదీ ఆత్మికమే, ఏ కార్యమూ అపవిత్రం కాదు; ఏ విషయమూ మాయ కాదు. ప్రతి కార్యమూ ఆత్మార్పణమే, ప్రతి విషయమూ వాస్తవమే.

ఆధ్యాత్మిక జీవితాన్ని విశ్లేషణాత్మక దృక్పథంతో సమీపిస్తే చిక్కు; సంశ్లేషణనే అలవరచుకోవాలి. ఈ విధానంలో దుఃఖాన్ని దుఃఖంగా అనుభవించక ఆనందంగా అనుభవించటం, బాధను బాధగా కాక సౌఖ్యంగా, మరణాన్ని మరణం వలె కాక జీవనం వలె అనుభూతి చెందటం ప్రధానం.



# ధరలు వాటి పరిణామం

శ్రీ పి. వి. రామమూర్తి

మన దేశం ప్రణాళికల ద్వారా పెక్కురంగాలలో ప్రగతిని సాధిస్తున్నప్పటికీ, ప్రజల జీవనస్థాయిలో తగినంతగా, ఆశించినంతగా, మార్పు రాలేదు. దీనికి ఆర్థిక వేత్తలు రాజకీయ వేత్తలు అనేకమైన కారణాలను చూపిస్తున్నారు. కాని వాటిలో ప్రజలందరికి స్పష్టంగా గోచరమయ్యేది ఒక్కటే ! అది ప్రస్తుతం దేశంలో అతి శీఘ్ర గతిని మార్పులు చెందుచున్న ధరలు; వివిధ పదార్థాల, ముఖ్యంగా ఆహార పదార్థాల, వివిధ రీతుల పరిణామాలు చెందుతూ, శిఖరాగ్రముల నందుకొన యత్నించుచున్న ధరలు ప్రజలలో ఆర్థిక పురోగమనమును కుంటుపరచుచున్నవి. ఇలా ఏయే శక్తులు దేశంలోని ధరల మార్పులకు తమ ప్రభావాన్ని చూపిస్తున్నవో చర్చించి, ప్రణాళికా ప్రగతికి అనువుగా నుండునట్లు నిర్దుష్టమైన ఒక ధరల ప్రణాళికను సూచించుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము.

ఈ క్రింద చూపిన మన దేశంలోని సమస్త పదార్థ సామాన్య సూచీ పట్టిక నుండి (General Index of Prices for all Commodities) ధరల మార్పులను తెలిసికొన వచ్చును. (మూల సం. ము 1939=100)

| సంవత్సరం | సామాన్య సూచి. |
|---|---|
| 1947—48 | 308 |
| 1948—49 | 376 |
| 1949—50 | 385 |
| 1951—52 | 432 |
| 1953—54 | 397 |

ఈ పై సూచిక నుండి దేశంలోని ధరలు 1947—48 కంటే 1948—49 లో అతి విపరీతంగా పెరిగి పోవుట గమనింప వచ్చును. దేశవిభజనానంతరం మన దేశం యెదుర్కొనిన సంఘటనలు, అతివృష్టి, వరదలు మూలమున ఆహార పదార్థముల కొరత ఏర్పడటం ముఖ్యంగా ధరలలో మార్పులకు కారణాలు. 1952—53 ను మూలసంవత్సరముగా తీసికొనినచో ధరలసామాన్యసూచి యీ క్రింది విధముగా ఉంది:—

| | |
|---|---|
| 1955—56 | 92.5 |
| 1956—57 | 105.3 |
| 1957—58 | 108.4 |
| 1958—59 | 112.9 |
| 1959—60 | 117.1 |
| 1960—61 | 124.8 |
| జూలై 1960 | 121.4 |
| ఏప్రిల్ 1962 | 122.9 |
| ఏప్రిల్ 1963 | 130.2 |
| జూన్ 1963 | 134.7 |

1960—జూన్‌నెల తర్వాత ధరలలో విపరీతమైన మార్పులు మళ్ళీ కలిగాయి. కొరియా, అమెరికా దేశాలు యుద్ధ సంసిద్ధమయ్యే సందర్భంలో మన ఎగుమతులు కూడా పెరిగినవి. ఈ ఎగుమతుల ప్రభావం కూడా ధరలలో పరిణామాలను తెచ్చిపెట్టింది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో ధరల హెచ్చు తగ్గులను పరిశీలించినచో, మొదటి సం. ము (1951—52)లో ధరల సూచి 435న్ను, అటు తర్వాత 1955 వరకు ధరలలో తగ్గుదల స్పష్టంగా కనబడుతుంది. తిరిగి 1956వ సంవత్సరం ధరలు ఊర్ధ్వగాములయినవి. ఈ ప్రణాళికా కాలంలో ఇంచుమించుగా ధరల పరిస్థితి

తీవ్రమైన ఒడిదుడుకులకు లోనుగాక, స్థిరంగా నున్నదనియే చెప్పవచ్చును. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలోని ధరల స్థితికి ప్రథమ పంచవర్ష ప్రణాళిక యందలి ధరలకి హస్తిమశకాంతర భేదమున్నది. దీనికి ముఖ్యంగా ప్రథమ ప్రణాళికా కాలంలో అనుకూల బుతు పవనములు, వ్యావసాయిక ప్రకృతి వాతావరణా హేతువులనడానికి సందేహం లేదు.

ఇక మన ప్రణాళికా యుగంలో రెండవ భాగం ఆది నుండి అంతంవరకు (అనగా 1956—57 లగాయతు 1960—61 వరకు) వస్తువుల ధరలు కేవలం ఉన్నత స్థానాల నభిలషిస్తూ పయనించాయి. 1957వ సం. మధ్యమంలో ధరలు విపరీతంగా విజృంభించినవి. ఈ పరిస్థితుల ప్రాబల్యం వలన దేశ ఆర్థిక స్థితిగతులకు వడిదుడుకు లేర్పడే సూచనలు కన్పడినవి. అందుచేతనే భారత ప్రభుత్వం 1957వ జూన్ నెలలో "అశోక మెహతా కమిటీ"ని నియమించినది. ధరల విపరీత పరిణామాలకు కారణాల్ని అన్వేషించవలసినదని ఈ కమిటీని ఆదేశించినది. ఈ సందర్భంలో ధరల సామాన్య సూచిలోని పెరుగుదలకు ముఖ్యమైన వివిధ కారణాలను విశదీకరించడం అవసరం కాగలదు.

ఆర్థిక శాస్త్ర మూల సూత్రముల ననుసరించి చూచినచో దేశమందలి సరకుల ఉత్పత్తి కంటె గిరాకీ (Demand) పెరిగినచో, ధరలు తీవ్రమైన మార్పులకు గురి అవుతాయి. ఈ ప్రధాన సూత్రం మూలాధార మయినప్పటికి, తదితరమైన కారణా లనేకం కూడ తమ ప్రభావాన్ని ధరల మీాద కేంద్రీకరిస్తాయి. అవి ఏవంటే:

(1) దేశ జనాభా సంవత్సరానికి 2% ను మించి 1960వ సం. ము నుండి పెరుగుతున్నందువలన, ఆహార పదార్థముల గిరాకీ హెచ్చింది. ప్రజల అవసరాలు ప్రతి సం. ము పెరిగిపోతున్నవి. 1951వ సంవత్సరంలో జనాభా లెక్కల (Population census) ప్రకారం దేశ జనాభా 36 కోట్ల 10 లక్షలు. కాని 1960వ సంవత్సరంలో జనాభా సంఖ్య 42 కోట్లు. ఈ విధంగా ప్రతి సంవత్సరము 70 లక్షల మంది ప్రస్తుత జనాభాకు చేర్చ బడుతున్నారు.

(2) ప్రజల వద్ద ఉన్న ద్రవ్యం వృద్ధిచెందుట వలన కూడా సరకులకు గిరాకీ హెచ్చుతుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో 3,360 కోట్ల రూపాయలు, ద్వితీయ ప్రణాళికలో 6,750 కోట్ల రూ.లు ఖర్చు పెట్టబడినవి. తృతీయ ప్రణాళికలో సుమారు 10,400 కోట్ల రూ.లు ఖర్చు పెట్టబడతాయని అంచనా వేశారు. ప్రథమ ప్రణాళికలోని పెట్టుబడి (Investment) మొత్తంలో 6%, ద్వితీయ ప్రణాళికలో 19% విదేశీ సహాయం (Forign aid) క్రింద గైకొన బడింది. ఇదే విధంగా మూడవ ప్రణాళిక పెట్టుబడిలో సుమారు 26% విదేశీ సహాయంగా తీసికొన బడుతుందని భావిస్తున్నారు. ఇందు మూలమున దేశమందలి ప్రజల వద్దనున్న కరెన్సీ హెచ్చి, ధరల పెరుగుదలకు దోహదమైంది.

రిజర్వు బ్యాంక్ (Reserve Bank of India) ప్రచురించే సంవత్సరాంతపు (శుక్రవారం నాటి) కరెన్సీ నోట్ల సంఖ్యలు ఈ క్రింది పట్టీలో పొందు పరచ బడినవి :

| సంవత్సరము. | మొత్తం కరెన్సీ(కోట్లరూ.లలో) |
|---|---|
| 1951—52 | 1,803.79 |
| 1952—53 | 1,764.71 |
| 1955—56 | 2,184.32 |
| 1957—58 | 2,388.83 |
| 1958—59 | 2,497.87 |
| 1963 ఏప్రిల్ | 3,406.00 |

ప్రతి సంవత్సరాంతమున దేశంలోని కరెన్సీ, చెలామణి (Circulation) (పై పట్టీలోని) సంఖ్యలను నిశితంగా పరిశీలించినచో, దేశంలో చెలామణీలో నున్న కరెన్సీ ఏటేటా అధికమవడం తెలుస్తుంది. 1951వ సం.ముతో పోల్చిచూచినచో 1963వ సం. మున దేశంలోని కరెన్సీ 88.8 పెరిగింది. కరెన్సీ ఈ విధంగా పెరుగుట వలన ధరలు హెచ్చినవి. ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త "కీన్స్" (Keynes) వాదం ప్రకారం వాస్తవంగా కేవలం కరెన్సీ పెరుగుదల చేతనే ధరలు విపరీతంగా పెరిగిపోవు. కాని భారత దేశం వంటి ఆర్థికంగా వెనుకబడిన దేశాలకు పురాతన ద్రవ్యపరిమాణ వాదం(Quantity Theory of money) నిస్సంశయంగా వర్తిస్తుంది. ఇటువంటిదేశాలలో సరకుల ఉత్పత్తి ఇంచుమించుగా స్థిరంగా ఉండి వృద్ధి పొందదు. ఆ కారణం చేతనే దేశంలోని ద్రవ్యం పెరుగుదలకు, సరకుల ఉత్పత్తికి సామరస్యం కుదరక హెచ్చుధరలు స్వేచ్ఛా విహారం సల్పుతాయి.

(3) లోటుబడ్జెట్టుల పద్ధతి(Deficit Financing) ప్రజల వద్ద నుండి స్వీకరించు మొత్తమునకు మించి ప్రభుత్వము చేయు వ్యయమును "లోటు ద్రవ్య పద్ధతి" లేదా లోటు బడ్జెట్టుల విధానం అని అంటారు. ఇంకా విపులంగా చెప్పాలంటే, ప్రభుత్వము ప్రజలవద్దనుండి పన్నుల రూపంలోగాని, ఋణరూపంలోగాని, ప్రభుత్వసంస్థల(State Enterprises) ఆదాయ రూపంలోగాని, చిన్న మొత్తాల పొదుపు పథకముల వలన గాని, లేక తదితర రూపములలో గాని వచ్చిన ఆదాయమును మించి ఖర్చు చేసే మొత్తమును "లోటు ద్రవ్య పద్ధతి" వలన భర్తీ చేయ బడుతుంది.

# ధరలు-వాటి పరిణామం

ప్రభుత్వంచే సృష్టించబడిన ద్రవ్యమునకు ఫలితముగా ప్రజలలోని కొన్నివర్గములకు కొనుగోలు శక్తి అధిక మవుతుంది. మన ప్రభుత్వ మవలంబించిన ఈ లోటు ద్రవ్య పద్ధతి వలన ప్రథమ పంచవర్ష ప్రణాళికలో 339 కోట్ల రూ. లు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 948 కోట్ల రూ. లు వ్యయ పరచడ మైనది. తృతీయ ప్రణాళికలో సుమారు 555 కోట్ల రూ.లు లోటు ద్రవ్య పద్ధతి ద్వారా సమకూర్చవలసి యుంటుందని అంచనా వేయబడినది. పైన చెప్పిన అంకెలను చూస్తే, 1956 వ సం. మొదలు మనం ముఖ్యంగా లోటు ద్రవ్యం మీదనే ఎక్కువ ఆధారపడినట్లు స్పష్టమగుచున్నది. కాని ఈ లోటు ద్రవ్య పద్ధతి మన దేశం వంటి ఆర్థికంగా చితికి పోయిన దేశాలలో ద్రవ్యోల్బణ పరిస్థితుల (Inflationary Tendenceis) విజృంభణకు దారితీస్తుంది.

ప్రజల కొనుగోలు శక్తి (Purchasing power) పెరిగితే ఆహారధాన్యాల వాడకం కూడా పెరుగుతుంది. తత్కారణంగా మార్కెట్‌లోకి విడుదలగు "మిగులు" సరకుల మొత్తం తగ్గుముఖం పడుతుంది. ఫలితంగా గిరాకీ పెరిగి, ధరలు ఆకాశ మంటుతవి. ఇట్టి పరిస్థితులలో ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరిగినప్పటికీ, వ్యవసాయ దారుల జీవన స్థాయి కూడ పెరిగి, ఆహారపదార్థముల వాడకం (Consumption) వారిలో కూడ అధిక మగుటచే, ధరలలో తగ్గుదల కన్పట్టదు.

అయితే కేవలం లోటు ద్రవ్య పద్ధతి వలన మాత్రమే ఇట్టి పరిస్థితు లేర్పడతాయనుకోవడం తగదు. ఇంకా దీనికి అనేక ఇతర కారణాలు కూడ సహకరిస్తాయి. (ఎ) లోటు ద్రవ్య పద్ధతి ద్వారా సృష్టింపబడిన ద్రవ్యం అధికమయితే ధరలలో పెరుగుదల ఎక్కువగా ఉంటుంది. అదే ద్రవ్యం తక్కువయితే ధరలలో విశేషమైన మార్పులుండవు. (బి) లోటు ద్రవ్యము ఏ కార్యాచరణకై వినియోగింప నుద్దేశించబడినదో, దానిపై కూడ ధరల పరిణామాలు ఆధారపడి ఉంటాయి. యుద్ధకాలంలో లోటు ద్రవ్యమును యుద్ధావసరములకు వినియోగించినచో, ధరలు తీవ్రంగా దెబ్బతింటాయి. కాని అదే ద్రవ్యమును ఆర్థిక పునరుద్ధరణ కార్యములకు వినియోగించినచో ధర వరులలో విపరీతమైన మార్పులు గోచరింపవు. (సి) ఈ ద్రవ్యమును భారీ పరిశ్రమలలో పెట్టుబడి (Investment) పెట్టినను లేదా తదితర దీర్ఘకాల ప్రాజెకులలో (Long term projects) పెట్టుబడి పెట్టినను వర్తమానంలో దాని ఫలితము లెక్కువగా కనబడుతవి. కాని ఆ ద్రవ్యోల్బణ పరిస్థితులు క్రమంగా దీర్ఘకాల గమనంలో తగ్గు ముఖం పడుతాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమలకు ఎక్కువ ప్రాముఖ్య మొసగుటచే, వర్తమాన కాలంలో ఈ విధమైన ధరల పెరుగుదల సందర్భోచితముగనే నున్నది. (డి) లోటు ద్రవ్య పద్ధతి నవలంబించిన కాలంలో ప్రభుత్వ ఆర్థికశాఖచే (Exchequer) సంగ్రహింప బడు రాబడిని బట్టి కూడ ధరలు నిర్ణయ మవుతవి. ప్రభుత్వం ఎక్కువ ధనం వసూలు చేసినచో లోటు ద్రవ్యము వలని ఫలితములు తక్కువగానే ఉంటాయి. ప్రభుత్వ కోశానికి రాగల అధిక మొత్తం ఈ క్రింది ఆర్థిక పథకములపై ముఖ్యంగా ఆధారపడి ఉంటుంది.

(1) పన్నులను విధించే విధానం : ఆదాయపు పన్నుల వంటి (Income - Tax) ప్రత్యక్ష సుంకములకు బదులు సరకులమీద పన్నులవంటి (Commodity Taxation) పరోక్ష సుంకములను విధించుపద్ధతి నవలంబించుట 2. ప్రజా బహుళ్యమునుండి ఋణములను గ్రహించుట. 3. భీమా, బహుమతిపత్రములు (Prize Bonds) జాతీయ పొదుపుపత్రములు (National savings Certificates) మొదలగువాని ద్వారా ప్రజలలో పొదుపు పద్ధతులను ప్రోత్సహించుట. (4) బ్యాంకులు సృష్టించు ద్రవ్యము (Credit creation by Commercial Banks) ధరలు పెచ్చుపెరిగిపోవడానికి ఇప్పటివరకు మనం తెలుసుకున్న ముఖ్యమైన కారణాలు ఇవి. (1) ప్రభుత్వం కాలానుగుణంగా చెలామణిలోనికి తెచ్చే ద్రవ్య పరిమాణం, (2) ప్రణాళికల మూలముగా ప్రభుత్వ మనుసరిస్తున్న లోటు ద్రవ్య పద్ధతి. కాని పై రెండు కారణాల వలననేగాక దేశములోని బ్యాంకులు నూతనముగా సృష్టించే పరపతి ద్రవ్యం (Credit creation) వలన కూడ ధరలలో మార్పులు వస్తాయి.

(5) గడచిన రెండు సంవత్సరాలలో దేశం అత్యవసర పరిస్థితులకు గురికావడం వలన, మన దేశం రక్షణ కార్యక్రమములకు ఎక్కువ ధనమును వ్యయపరచవలసి వచ్చింది. దాని ఫలితంగా ధరలు పెరిగినవి. మనము ఇతర దేశముల నుండి ఋణ రూపంలో పొందే మొత్తంతో బాటు, ప్రతి ఏటా రక్షణ కార్యక్రమాలకు సుమారు 400 కోట్ల రూ.లు ఖర్చు కాగలదని అంచనా వేయబడినది.

## ధరల పెరుగుదల అరికట్టు మార్గములు

ప్రజలలో దినదినానికి ప్రబలమయే అవసరాలకు తగిన ఆహారోత్పత్తి ద్వారాను, వాడకపు వస్తువుల సరఫరా (Supply) నధిక మొనరించుట వలనను ద్రవ్యోల్బణ పరిస్థితుల నదుపులో పెట్టవచ్చును. ముఖ్యంగా మన దేశంలో ప్రజల రాబడిలో మూడు వంతులు జీవితము ముఖ్యావసరము-

లకు (Necessities), అనగా అన్న వస్త్రములకు ఖర్చవుతున్నది. ప్రణాళికాభివృద్ధి కార్యక్రమముల వలనను, దేశం పారిశ్రామికముగా పురోగమించుట వలనను ప్రజలలో పెరిగే పట్టణోన్ముఖత వలన (Urbanisation), ఏటేటా అధికమయ్యే బస్తీ జనాభా వలనను, వ్యావసాయిక వస్తువుల (Agricultural goods) గిరాకీ విపరీతంగా పెరుగుతున్నది. అయితే ఆహారధాన్యముల ఉత్పత్తి పెరిగినా మార్కెట్టుకు వచ్చే సరకుల మొత్తంమీద మాత్రమే ధరవరులు నిర్ణయ మవుతాయి. కాని మార్కెట్టుకు వచ్చే ధాన్యముల సరఫరా ఈ క్రింది అంశములపై ఆధారపడి ఉంటుంది :—

(1) సాలీనా పండింపబడు మొత్తం వ్యావసాయికపు టుత్పత్తి :—ఆహారపు టుత్పత్తి అధికమయిన కొలదీ, మార్కెట్టుకు వచ్చే మొత్తం సరకులు కూడ అధిక మవుతాయి. (2) వ్యవసాయదారుల రాబడి పెరిగినకొద్దీ, వారు తాము ఉత్పత్తిచేసిన ధాన్యములో నెక్కువ భాగము మార్కెట్టులో విడుదల చేయవలసిన అవసర ముండదు. ముస్ముందు ధరలు పెరగవచ్చునేమో యని కొంత భాగము నిల్వ చేస్తారు. అందువలన మార్కెట్టునకు వచ్చే భాగం తగ్గుముఖం పడుతుంది. (3) ప్రభుత్వము పన్నులు వసూలుచేయు మార్గము మార్కెట్టునకు వచ్చే ధాన్య పరిమాణమును పెంచుటకై నేటి కాలములో రైతులవద్ద నుండి పన్నులను ధన రూపముగా గాక, ధాన్య రూపములోనే వసూలుచేయు పద్ధతులను ప్రభుత్వ మవలంభించుచున్నది. (4) వ్యవసాయ కమతముల విస్తీర్ణము—అధిక విస్తీర్ణము గల పొలముల నుండి మార్కెట్టునకు వచ్చే ధాన్యము, చిన్న తరహా కమతలముల నుండి వచ్చు భాగము కంటె హెచ్చుగా నుండుట సహజమే గదా! పైగా చిన్న కమతములలో పండింపబడే ధాన్యపు టుత్పత్తి పూర్తిగా కూడ మార్కెట్టునకు రాకపోవచ్చును. ఆ కమతం యజమానికి ఆ ధాన్యము చాలకపోవుటయే దీనికి ముఖ్య కారణము. (5) వ్యవసాయ సంస్థలు : సహకారవ్యవసాయము వలన ఆహారపు టుత్పత్తి అధిక మగుటయేగాక మార్కెట్టునకు వచ్చు ధాన్య భాగము కూడ ఎక్కువవుతుంది. "కమ్యూన్సు" (Communes), "సహకార సంస్థలు" (Co - Operatives)—వీటి ద్వారా చైనాపై సమస్యలను సాధించుటయే గాక ప్రజలలో పొదుపుచేయు అలవాట్లను పెంపొందించినది. ఇదేవిధముగా జపాన్, రష్యాలలో కూడ విజయము సాధింపబడినది. కాని, మన దేశంలో సహకార వ్యవసాయమునెడ విభిన్నాభిప్రాయము లున్నవి. అయితే కాలక్రమేణా సహకార సంస్థల ప్రాధాన్యత హెచ్చుటకు అనేక అవకాశము లున్నవి.

పై నుదహరించిన మార్గముల ద్వారా వ్యావసాయిక పదార్థములను మార్కెట్టునకు మరలింప సాధ్య మగునే గాని ఆహారోత్పత్తిని ఇతోధిక మొనరించుటకు యేమాత్రము సానుకూలముగా ం కదా! దేశీయార్థిక దృష్ట్యాను, దినదిన ప్రవర్ధమానమగు జనాభా దృష్ట్యాను, ఆహారోత్పత్తి నధికము చేయుటకీ క్రింది మార్గముల ననుసరింపవలెను.

(1) చిన్న తరహా నీటి పారుదల ప్రాజెక్టుల ద్వారా వ్యవసాయ భూములకు చవుకగా నీటిని సరఫరా చేయుట, (2) ఉత్తమమైన జాతి విత్తనములను మాత్రమే వ్యవసాయదారు లుపయోగింప ప్రోత్సహించుట, (3) కృత్రిమపు ఎరువులను, స్వాభావికపు ఎరువులనే గాక రసాయనికపు ఎరువులను (Scientific manures) పొలములలో నుపయోగింప జేయుట, (4) వ్యవసాయోత్పత్తిని పదిలపరచుటకు శ్రేష్ఠమైన గిడ్డంగులను (Warehouses) యేర్పరచుట, (5) పురాతన వ్యవసాయ పరికరములను త్యజించి, సమర్థనీయములైన వైజ్ఞానిక వ్యవసాయ పరికరముల నుపయోగించుట. ఇవిగాక భూములను సమతలము లొనర్చియు (Land levelling), ట్యూబ్ నూతులను (Tube wells) త్రవ్వించియు, నేలను ఫలోన్ముఖ మొనర్చి ఉత్పత్తి నధికము చేయవచ్చును. కాని, రైతునకు భూమియందు స్వత్వభావ మున్నపుడే (Interest in Ownership) పై మార్గములు విశేష ఫలితము నివ్వగలవు. కావున కమతలములను నిర్ణయించుట, భూస్వాములకు చెల్లించవలసిన మొత్తములను (శిస్తు) నిర్ణయించుటకు, సేద్య మొనరించుటకు కనీస సంవత్సరములను (కౌవులు) నిర్ణయించుట (Security), స్వంత హక్కులనిచ్చి భూములను స్వాధీనపరచుట మొదలగు భూసంస్కరణల ద్వారా రైతులలో నూతనోత్తేజమును కలిగించవచ్చును. దీని కనుగుణముగా ప్రభుత్వము ముందంజవేసి వ్యవసాయదారులకు అల్పకాలిక, దీర్ఘకాలిక ఋణముల (Short term and long term loans) నొసగుట, సాంఘిక కార్యక్రమములద్వారా (Community development programmes) వైజ్ఞానిక విషయములను తెలియపరచుట, రోడ్లనిర్మాణము ద్వారా దూరపు మార్కెట్టులకు మార్గములు నేర్పరచుట, ఆర్థిక పథకములచే న్యాయమైన ధరలను నిర్ణయించుట—మొదలగు వాని ద్వారా సహాయ సహకారముల నందజేయవలెను.

విదేశములనుండి ఆహార ధాన్యములను దిగుమతి చేసుకొనుట ద్వారా కూడా ద్రవ్యోల్బణ పరిస్థితుల అణచవచ్చును. కాని యీ పద్ధతికనే కాటంకములున్నవి. మనకు గల విదేశ మారకము (Forign exchange) పై దిగుమతులాధారపడియుండ ను. 1960-వ సం॥ములో మనదేశము అమెరికాతో పబ్లిక్ లా 480 (పి. ఎల్. 480) క్రింద ఆహార దినుసులను దిగుమతి చేసుకొనుట కంగీకరించినది. అయినప్పటికి యీ పద్ధతి వలన దేశీయాహారోత్పత్తి కుంటుపడుటకు కూడ విశేషావకాశము లుండుటచే నిది యంత సమర్థనీయము గాదు.

సరకులపై విధించు సుంకములద్వారా (Commodity-Taxation) కూడ ద్రవ్యోల్బణము నదుపులో పెట్టవచ్చును. ఈ పద్ధతివలన ప్రభుత్వ రాబడి (State Revenue) అధికమగుట, కొనుగోలుశక్తి తగ్గుట, సరకుల అంతర్గతమగుటచే పరోక్షమైన ఈ సుంకముల ప్రభావము ప్రజలకు అధికముగా వెగటు కల్గింపక పోవుట, తదితర పన్నుల వలెగాక ఈ పన్నులు వృత్తి భేదములను విసర్జించుట మొదలగు ప్రయోజనములను సాధించును. కాని సరకులపై విధించు సుంకము లిప్పటికే మనదేశములో పరిమితి నతిక్రమించుచున్నవి. ఈ పన్నుల ప్రభావము ఎక్కువగా బీదల కనర్థ కారణ మగుటచే వీటిని విసర్జించుటయే ఉత్తమము.

రేషనింగు, కంట్రోలు ద్వారా కూడ మ లక్ష్యములను సాధింపవచ్చును. కాని, యీ పద్ధతులు ముఖ్యముగా యుద్ధములచే ఆర్థిక పతనము నొందిన దేశములలో సహకరించునే గాని, క్రమ క్రమముగా దేశాభ్యుదయము నొందు దేశములలో ఆశించిన ఫలితముల నీయజాలవు. పైగా వీటిని అమలుపరచుటలో గల కాలహరణము (Delay), వ్యవసాయోత్పత్తులను కొనుటలో గల ఆర్థిక సమస్యలు, బ్లాక్ మార్కెటింగ్ (Blace marketing), వ్యవసాయోత్పత్తిని పదిలపరచుటకు గిడ్డంగులను సృష్టించుటయందలి పెక్కు సమస్యలు మొదలగు అనేక అనర్థము లున్నవి. అయినప్పటికి అవసర సమయములలో రేషనింగు, కంట్రోలును కొంతవరకు అమలు పరచుట అభిలషణీయమే! రాష్ట్ర వ్యాపార సంస్థలను (State trading Corporations) స్థాపించుటవలన ఈ పద్ధతుల నవలంభించుచున్నారు.

ఇప్పటివరకు చర్చించిన విషయముల ద్వారా ప్రస్తుతం మన దేశంలోని వివిధ వస్తువుల ధరలలో వచ్చే మార్పులకు కారణాలను, వాటి నివారణోపాయములను తెలిసికొంటిమి. కాని, యేయే పరిస్థితులవలన ధరలలోని పెరుగుదలను నివారించుట అత్యంత అవసరమైనదో కూడ తెలిసికొనవలయును గదా? వాని నీ క్రింది వివరించెదను.

(1) 1956 వ సంవత్సరములోని ధరల స్థాయి (Price level) తో పోల్చి చూచినచో 1960 వ సం. నాటి ధరలు సుమారు 20% పెరిగినవి. ఈ పరిస్థితులే భావి కాలములో అనుభవైకవేద్య మైనచో మరల ప్రణాళికా లక్ష్యములు తలక్రిందు లగుట తప్పదు.

(2) చెలామణిలో నున్న కరెన్సీ పెరిగినచో ఫ్యాక్టరీ కార్మికులు (Workers) తమ దినభృతిని (Wages) పెంచమని ఒత్తిడి చేసెదరు. తత్కారణమున వివాదములు, కార్మికులలో అలజడి చెలరేగి ఉత్పత్తికే భంగము వాటిల్లును. ఆ పరిస్థితులు ప్రస్తుత ధరలను మరింత క్లిష్ట మొనర్ప యత్నించును.

(3) ప్రణాళికా లక్ష్య సాధనకు కావలసిన ఆర్థికావసరములను సమకూర్చుటకు ప్రజలలో పొదుపుచేయు నలవాట్లను వృద్ధిచేయవలెను. పొదుపు చేయడమంటే ప్రస్తుతపు వాడకమును తగ్గించి, మున్ముందు వినియోగించుటకు వాయిదా వేయుటయే! కాని, దినదినము ధరలు పెరుగుచున్న సమయములో డబ్బుకు కొనుగోలు శక్తి పడిపోతుంది. అందుచే ప్రజలలో పొదుపుచేసే ప్రయత్నాలు తగ్గి, ప్రస్తుత వాడకమునకే వారు ఉన్ముఖు లయ్యెదరు.

(4) ధరల పెరుగుదల వలని ఫలితాలు ప్రజ లందరి మీద ఒకే విధంగాను, సమానంగాను ఉండవు. స్థిరాదాయం గల (Fixed income groupes) ప్రజలు చాలా వత్తిడికి లోనయ్యెదరు. ధనవంతులైన వ్యాపారస్థులు మరింత ధనమును కూడబెట్టెదరు. ఇట్టి విభిన్న పరిస్థితులను రూపుమాపుటకై ధరల నదుపులో పెట్టుట యవసరమైనది.

(5) ధరలలోని విపరీతమైన మార్పులవలన ప్రజలలోని ప్రస్తుతపు ధనవంతులు, బీదలు మొదలగు ఆర్థిక తారతమ్యములు మరింత తీవ్రరూపం ధరిస్తాయి. అవిధముగా జరుగుట కేవలం మన అభ్యుదయ ప్రణాళికా మూల లక్ష్యమునకే గొడ్డలిపెట్టు.

(6) మన దేశంలో నిరుద్యోగ సమస్య ప్రబలుచునే యున్నది. అట్టి సమయములో ద్రవ్యోల్బణ పరిస్థితులు విజృంభించినచో నిరుద్యోగ సమస్య మరింత జటిలమయే సూచనలు కానవచ్చుచున్నవి. పైగా మన దేశపు తలసరి ఆదాయం నెల 1 కి 23 రు. లు మాత్రమే (1958—59 ప్రమాణముగా తీసుకొనినచో). కాని, తలసరి ఆదాయం నెల 1 కి జపాన్‌లో 100 రు. లు, ఇటలీలో 160 రు. లు, అమెరికాలో రు. 830 లు. అంటే ప్రపంచ మొత్తంలో మన దేశమే బాగుగా వెనుకబడినట్లు స్పష్టమవుతున్నది. అందుచే దేశంలోని ధరలు స్థిరంగా లేనిచో, సామాన్య ప్రజలకు తిండి కూడ కరువవుతుంది. అప్పుడు దేశం ఆర్థికంగాను, రాజకీయంగాను అశాంతికి, అలజడికి లోనవుతుంది.

పై సమస్యల దృష్ట్యా పరిశీలించినచో ధరల నదుపులో పెట్టుట సర్వజన శ్రేయోదాయకము. తృతీయ పంచవర్ష ప్రణాళిక విజయము కూడా ధరల స్థాయి మీదనే ఆధారపడి యుంటుం దనుటకు సందేహములేదు. జాతీయాదాయములో (National income) 1965—66 సం. నాటికి సుమారు 14% వరకు పెట్టుబడి పెట్టవలెనని మన ప్రణాళికలు ఉద్దేశించినవి. అవిధముగా జరుగవలెనినచో దేశంలో ఆహారపు ఉత్పత్తులు పెంచి, ప్రజల జీవన స్థాయిని వృద్ధిపొందించి సమాజంలో ఆర్థిక వ్యత్యాసములను తగ్గించుట ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. లేనిచో ఆర్థికరంగంలో విషమ పరిస్థితు లేర్పడి ద్రవ్యోల్బణపుటొత్తిడి (Inflationary Pressure) పెరిగి, అభ్యుదయ ప్రణాళికలు తీవ్ర అఘాతమునకు గురికాగలవు.

# పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా

శ్రీ వాణీ కుమార

భారత సాహిత్య అకాడమీవారు ఈ పర్యాయం తెలుగు గ్రంథాలలో ఒక నవలకు—అందులోనూ సాంఘిక నవలకు బహుమతి ఇచ్చారు. వచన రచయితలకు—ముఖ్యంగా కథా రచయితలకు ఈ నిర్ణయం కొంత సంతోషాన్ని, ఉత్సాహాన్నీ కలిగిస్తుంది అనడంలో సందేహంలేదు. అయితే అకాడమీ బహుమతికి పాత్రమైన గ్రంథమే అన్ని సందర్భాలలోనూ ఉత్తమమైనదని చెప్పలేము. మరి ఈ నిర్ణయం ఎటువంటిది ? ఈ నవలలోని గొప్పతన మేమిటి ? దీనిలోని లోపా లేమిటి ? ఈ అంశాలు సాహిత్యకులకు ముఖ్యమైనవి. వాటిని చర్చించడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

తెలుగు సాహిత్య ఆధునిక యుగంలో కొత్త తరం రచయితలలో గోపీచంద్ విశిష్ట వ్యక్తిత్వం గలవాడు. అనేక రచనలు చేసినవాడు. అనేక సిద్ధాంతాలనూ, భావాలనూ తరచి చూచి వేదనా జీవియై, జిజ్ఞాసువై, భావాల సంఘర్షణకు లోనై మేధావులనూ, యువకులనూ ఆలోచింపజేసి చివరకు ఒక తత్త్వానికి వచ్చి అదే తరుణోపాయంగా కన్పిస్తోందని చెప్పిన రచయిత. ఆయన తన భావాలను వ్యాసాలలో వెలిబుచ్చడం అటుండనిచ్చి ప్రధానంగా కథల రూపంలో, నవలల రూపంలో అభివ్యక్తీకరించాడు. చివరకు ఆయన భావాలలో వచ్చిన పరిణామాన్ని "పోస్టు చేయని ఉత్తరాలు" గా వెలువరించాడు. ఆ ఉత్తరాలకు కళాత్మక రూపమే అకాడమీ బహుమతి పొందిన "పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా" నవల.

నవలా రచన విషయంలో గోపీచంద్‌కు ఇదమిద్ధమైన అభిప్రాయా లున్నాయి. ఆయన వాటిని పలు సందర్భాలలో—ఉపన్యాసాలలో, ఒక వ్యాసంలో, ఇతరత్రా కొన్ని పీఠికలలో వ్యక్తం చేశాడు. ఆ అభిప్రాయాలు ఇవి : ఒకటి—నవలకు మానవుని హృదయంలో మరుగుపడిఉన్న దివ్య శక్తులను బహిర్గతం చేసే శక్తి ఉన్నది. రెండవది—ఇతర లలితకళలు సూచించే వాస్తవిక దృష్టి కంటె భిన్నమైన దానిని ఈ సాహిత్య ప్రక్రియ సూచించగలదు. మూడు—నవల బుద్ధి పెద్దది కావడంవల్ల విరుద్ధంగా కనబడే అనేక సంఘటనలను పొదిగి సమన్వయపరచి ఒక సమగ్ర జీవితంగా చిత్రించగలదు. నాలుగు—సామాజిక పరిణామానికి అధికంగా దోహదం చేయగలదు. ఐదు—నవలా రచయిత కొన్ని సంఘటనలను క్రోడీకరించేవాడు మాత్రమే కాదు, ఆ సంఘటనల వ్యాఖ్యాత కూడా. ఈ అభిప్రాయాలను మనం గమనించి, ప్రత్యేకంగా ఈ నవల సందర్భంలో రచయిత వ్యక్తిత్వాన్ని కూడా సూక్ష్మ పరిశీలన చేయాలి. ఎందుచేతనంటే నవలా ప్రక్రియ రచయితను ఆపాదమస్తకం స్పష్టంగా చూపెడుతుంది. "వార్ అండ్ పీస్", "అన్నా కెరినినా" అనే నవలల్లో టాల్‌స్టాయిని చాలా బాగా చూడవచ్చు. "డాక్టర్ ఫాస్టస్" లో గేథే కనపడతాడు. హెమింగ్వే స్వభావం అతను సృష్టించిన కథానాయకులలో ప్రతిబింబిస్తుంది. అలాగే మన తెలుగు నవలా రచయితలలో ఉన్నవ, విశ్వనాథ, చలం, బాపిరాజు మొదలైనవారు తమ నవలల్లో మన ఎదుట నిలబడి మాట్లాడుతున్నట్లు కన్పిస్తారు. గోపీచంద్ వ్యక్తిత్వంలో వచ్చిన చివరి పరిణామం (ఆయన స్వర్గీయు డయ్యేంతవరకు) "పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా" లో దృగ్గోచర మవుతుంది. ఆయన ఆ విషయం దాచలేదు. తాను ఈ నవలను ఏ ఆదర్శాలతో వ్రాసిందీ స్పష్టంగా చెప్పుకున్నాడు. వాటివల్ల ఆయన వైఖరి విస్పష్టమైంది. ప్రజాస్వామిక విధానాన్ని గోపీచంద్ పరిగణించాడు. విశ్వమానవ సౌభ్రాత్రానికి ప్రజాస్వామ్యం పునాది అన్నాడు. అయితే అందులో ప్రతి వ్యక్తికీ న్యాయం జరగాలి. ఇతరుల వాదం సానుభూతితో వినాలి. ఎవరికి వారు కొంత జరగాలి. 'నేను చచ్చినా మారను' అంటే కుదరదు. జీవితాన్ని సూత్రీకరించకూడదు. కారణ మేమంటే జీవితం మారే స్వభావం గలది. ముఠా ఐకమత్యాలు పెరిగితే సంఘర్షణ వస్తుంది. వాటిని

# పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా

భావాలతో కరిగించాలి. సమ్యగ్దృష్టి కలుగజేయాలి. గోపీచంద్ ఇవన్నీ ఎందుకు ఆలోచించాడు, ఈ పంథా ఎందుకు చెప్పాడు దేశీయులకు ? అన్న ప్రశ్న వేసుకొంటే నాకు ఇలా అనిపించింది. ఆయన హేతువాద యుగంలో పుట్టాడు. 'ఎందుకు' అన్న ప్రశ్న ఇంట్లో నేర్చుకున్నాడు. హేతువాది అయ్యాడు. మార్క్సిజం చూచాడు. నాస్తికు డనిపించు కున్నాడు. భౌతికవాది అయ్యాడు. నవ్య మానవతావాదం ప్రచారం చేశాడు. ఇంకా అనేక సిద్ధాంతాలు, తత్వాలు చదివాడు. అన్నింటిలోనూ ఏదో మంచి ఉన్నట్లనిపించింది. ఇదే చిత్రం ! మళ్లీ వాటిమధ్య వైరుధ్య ఉన్నాయి. ఇవి సంఘ జీవితానికి అరిష్టం కలిగిస్తాయని ఆందోళన పడ్డాడు. ఒక్కొక్కరి కొక్కొక్క సిద్ధాంతమైతే సాంఘిక సామరస్యం లుప్తమవుతుంది. బలవంతుడిదే రాజ్యం అంటే నియంతృత్వ ధోరణి ! ఆ పరిస్థితిని నివారించాలంటే సమ్యగ్దృష్టి, సమన్వయం కావాలి. మానసిక జీవితం ప్రగాఢ మవ్వాలి. అతీత మానసికశక్తి యొక్క ఆవిర్భావం జరగాలి. అప్పుడు మానవుని వ్యక్తిత్వం ఏ పరిస్థితుల్లో నైనా, ఏ ప్రభావాలలో నైనా సురక్షితంగా ఉంటుంది. అప్పుడే దివ్య జీవనాన్ని సృష్టించుకో గలం. ఇది అంతా అరవింద మహర్షి చెప్పిన తత్త్వం. ఈ రత్నాన్ని ఉద్బోధించడానికై సృజనాత్మకరూప మివ్వా లనుకున్నాడు. ఈ నవల రచించాడు.

నవలలో కేశవమూర్తి, పరమేశ్వరశాస్త్రి, సుజాత ముఖ్య పాత్రలు. కేశవమూర్తి గోపీచంద్ అభిలషించిన సమ్యగ్దృష్టి, సమన్వయం కల వ్యక్తి. అతను రచయిత. అనేక సిద్ధాంతా లతో సతమతమై చివరకు ఆధ్యాత్మిక సంస్కృతివేపు మరలి నాడు. సుజాత ఆయన భార్య. మంచి స్వభావం గలది. భర్తకు అనుసరపక్షంగా ఉండి అతన్ని అర్థం చేసుకొన్న యువతి. ఆమె పండిత పరమేశ్వరశాస్త్రిగారి కూతురు. కూతురంటే— శాస్త్రిగారికి భార్య ఎన్నడో పోయింది. వంటలక్కగా సుందరమ్మ ఉంది. శాస్త్రిగారు మేఘ సందేశం కావ్యంలో యక్షుని విరహ ఘట్టం చదువుతుండగా సుందరమ్మ గదిలోకి వచ్చింది. ఆయన కాలు జారారు. తత్ఫలితంగా సుజాత పుట్టింది. కాని సుజాత తన కూతురే అని శాస్త్రిగారికి తెలియదు. కారణం సుందరమ్మ పిల్లను కని వదిలిపెట్టిపోతే స్కూలు ప్యూన్ నరసయ్య పెంచాడు. శాస్త్రిగారు ఆ పిల్లను చూచి వాత్సల్య భావంతో పెంచారు. కాని ఆమె తండ్రి ఇష్టంలేకుండా కేశవ మూర్తిని పెళ్ళాడింది. అంతటితో శాస్త్రిగారు ఆమెను ఇంట్లో నుంచి వెళ్లగొట్టారు. శాస్త్రిగారు చాలా పాతకాలపు మనిషి. కొత్త ఎటువంటిదైనా రోతే. ఇంట్లో కూడా వ్యాకరణ యుక్తమైన గ్రాంథిక భాష మాత్రమే మాట్లాడుతారు. కాని అంత రంగంలో అపారమైన కరుణగలవారు. ధీర గంభీరులు. కేశవ మూర్తికి వచ్చిన పేరుప్రఖ్యాతులకు అసూయపడే సీమంతం, పురూరవుడు, శారద్వతుడు, రాధారమణ మొదలైన వారంతా శాస్త్రిగారికి అతనిపై ఎక్కవేసి అగ్నికి ఆజ్యం పోశారు. మూర్తి వాళ్ల అసూయా ద్వేషాలు, దుర్మార్గాలు భరించలేక మద్రాసులో ఫిలిం రచయితగా జీవితం గడుపుతాడు. అక్కడ కొన్ని అనుభవాలు అతనిని ఆ వృత్తికి విముఖుణ్ణి చేస్తాయి. భార్యా భర్తల దాంపత్యంలో అనుమానం రేపుతాయి. దీనికి సీమంతం మొదలగు దుష్టచతుష్టయం దోహదం చేస్తారు. సుజాత తన పొరపాటు తెలుసుకొంటుంది. ఇద్దరూ మళ్లీ కలుసుకుంటారు. మూర్తి అరవిందుని గూర్చి విన్నాడు. 'అరవిందుని దివ్య జీవనం' అనే గ్రంథం అతన్ని ఆకర్షించింది. పుదుచ్చేరిలోని అరవిందాశ్రమం వెడతాడు. భార్యతో మిత్రు రాళ్ళతో—ఆస్తికులు శ్రీ వెంకటేశ్వరస్వామిని దర్శిస్తే తమ కేదో వింత అనుభవం కలిగిందని ఎలా చెబుతారో అలాగే మూర్తి అరవింద దర్శనం కాబొయ్యే సమయంలో శరీరం జలదరిస్తుంది. ఆ తర్వాత మూర్తి అరవిందుని శిష్యుడై, ఆ తత్వ సాధనలో ఉంటూ వరంగలు చేరి అక్కడ ఉపాధ్యాయుడుగా జీవిస్తూ జిజ్ఞాసా సమితి పెట్టుకొని మిత్రులతో అధ్యాత్మిక కాలక్షేపం చేస్తూ ఉంటాడు. పరమేశ్వర శాస్త్రిగారి అవసాన సమయానికి భార్యాభర్తలు అక్కడికి చేరుకుంటారు. శాస్త్రిగారు పరమపదిస్తారు. ఆయన వ్రాయించిన వీలునామా సీలు కవరు విప్పి అందరి ముందు చదువుతాడు ప్లీడరు. ఆయన తన యావదాస్తినీ సుజాత భర్త అయిన కేశవమూర్తి పేర వ్రాశాడు. సుజాత జన్మ వృత్తాంతం బైటపెట్టాడు. తన ఆస్తిని మూర్తే సద్వినియోగం చేయగలడన్న విశ్వాసం వెలి బుచ్చాడు. శాస్త్రగారిలో వచ్చిన మార్పుకు అంతా తెల్లబొయ్యారు. స్వార్థ పరులు జారుకున్నారు.

నవలలో ఒకటి రెండు చిన్న అంశాలు విమర్శకు పాత్రమయ్యేవి ఉన్నాయి. ఒకటి— శాస్త్రిగారు చిన్న పిల్లకి ప్రాథమిక పాఠశాలలో వ్యాకరణాన్ని గూర్చి ఉపన్యాసమివ్వడం! రెండవది— నవల ముగిసేటప్పుడు సినిమాలలో లాగా అంత్యు తెలియకుండా పోయిన సుందరమ్మ హఠాత్తుగా ఊడిపడడం, అందరికీ ఆశ్చర్యం కలిగించటం. ఆమె మళ్లీ ప్రత్యక్ష్యం కావలసిన అవసరం కథకు లేదు.

ఈ నవల రచనా విధానంలో గోపీచంద్ కొత్త దారి తొక్కాడు. మొదట రచయిత కథ ఉపక్రమిస్తాడు. మధ్య మధ్య కొన్ని సంఘటనలను పాత్రలు చెబుతాయి. సుజాత

చెప్పిన కథ— మూర్తి చెప్పిన కథ— సుభాషిణి చెప్పిన కథ, ఇలా కొన్నిచోట్ల కథా నాయకుడు వ్రాసుకున్న డైరీలలో కొన్ని తేదీల వృత్తాంతాలను ఉదహరించడం జరిగింది. అనేక దృక్కోణాలనుంచి చెప్ప వలసిన కథ కావడం చేతనే రచయిత ఈ పద్ధతి అనుసరించారు. ఇది కొత్త పద్ధతేమీ కాదు. రవీంద్రుని "హోమ్ అండ్ ది వరల్డ్" (ఘరే బైరే) అనే నవల ఇలాగే నడిచింది. రవీంద్రునికి పూర్వం కొందరు ఆంగ్ల రచయితలు ఇలాంటి పద్ధతి అనుసరించారు. అయితే గోపీచంద్ పద్ధతి మరీ మిశ్రమంగా కలగూర గంపగా ఉండి ఒక వంక ఉత్కంఠ కల్గిస్తుంది. వేరొకవంక సడలినట్లుగా కూడా అనిపిస్తుంది. ఈ అతుకులను పాఠకుడు జాగ్రత్తగా గుర్తుపెట్టుకోవాలి.

ఆంధ్రదేశంలోని సమకాలిక సాంఘిక జీవితమంతా దిఙ్మాత్రంగా స్పృశించిన నవల ఇది. వ్యక్తుల బుద్ధులు, సంఘాల పోకడలు, మొత్తం సమాజం స్థితి చిత్రణ ఇందులో ఉంది. నేటి రాజకీయాలు, రచయితల ముఠాలు, విమర్శకుల ధోరణులు, శిష్యులు, వారే మారి శత్రువులుగా తయారవడం, మానవుడు ఒంటరి వాడా, సాంఘిక జీవా? ఆస్తిత్వ వాదానికి చెందిన పాశ్చాత్యులేమంటారు? మన వేదాంతులేమని చెబుతారు? భగవద్గీత ఏమంటుంది? దేశంపై ఆంగ్ల ప్రభుత్వ ప్రభావం, మన స్వయంకృతాపరాధం, మూఢ నమ్మకాలు, ఊడవచ్చా, సైన్సుని తిరస్కరించాలా, వేదాంతాన్ని అనుసరించాలా, పునర్జన్మ, విశ్వం, 'రిత', ఊర్ధ్వ లోకాలు— ఇవన్నీ ఇందులో ప్రస్తావింపబడ్డాయి. మరికొన్ని చోట్ల సంభాషణలు సామాన్య పాఠకులకు నచ్చంచనివి.

"ఇక మనం చేసే పనేమిటి?"

"భావాలను వెదజల్లడం?"

"వాటి ఆచరణ?"

" — — — — — — — —"

"మరి భావాలను వెదజల్లే మనబోటి వారి భాధ్యత ఎంతవరకు?"

"భావాలను ఉత్పత్తిచేసి వెదజల్లడం వరకే."

ఇలా రూపురేఖలు లేని వాగ్వాదాలు (Obstract arguments) కొన్నిచోట్ల ఉన్నాయి. అరవిందుడు చెప్పిన అతీత మానసికావస్థను చేరుకోవడానికి నాలుగు మజిలీలు, వాటి వివరణా ఒక మాదిరిగా చదువుకున్నవారికే అర్థం కావు. అరవింద తత్త్వాన్ని గూర్చి మొత్తం 25 పేజీల చర్చ! కనుకనే ఇది సామాన్య పాఠకుల నవల కాదు. జిజ్ఞాసువుల నవల. తాత్వికుల నవల. భావాల సంఘర్షణతో నిండిన నవల. అరవింద దర్శనం కథ. గోపీచందు ఆత్మ కథ వంటి నవల. దీనినే Autobiographical novel అంటున్నారు. తక్కిన పాత్రల సంగతి ఏమోకాని కేశవమూర్తిలో గోపీచందు కన్పిస్తాడు. గోపీచందులో వచ్చిన పరిణామమే కేశవమూర్తిలోవచ్చి అరవింద తత్వం తరణోపాయ మనుకున్నాడు.

గోపీచందు ఈ నవలను "ఈ బ్రతుకు ఆనందంలోనుంచి వచ్చినదే. ఆనందంవల్ల నిలబడుతున్నదే. ఆనందం వల్ల అభివృద్ధి చెందుతున్నదే. ఆనందంలో కలిసిపోయేదే" అన్న ఉపనిషద్వాక్యంతో ముగించాడు. ప్రతి మానవుడు స్వీయానుభవంతో చివరకు గ్రహించేది ఈ పరమార్థమే కదా. చదువరుల బుద్ధిని విశాలపరచగల ఇట్టి రచనకు బహుమతి ఇవ్వడంలో సాహిత్య అకాడమీ వారు పొరపడలేదని నిస్సందేహంగా చెప్పవచ్చు.



# వైదేశిక విధానంలో కోల్పోయిన కొన్ని అవకాశాలు

శ్రీ ఎ. జి. నూరని

దురదృష్టకరమైన గతం, వర్తమానాన్ని బంధించక, కేవలం దాని జ్ఞాపకాలను మాత్రమే మిగిలివుంచినప్పుడు, జరిగిందేదో జరిగిపోయిందనే దృక్పథం చాలవరకు సమంజసమే అవుతుంది. కాని గత చరిత్రే ఇంకా వర్తమానాన్ని బంధిస్తున్నప్పుడు, దానిసంగతి సమగ్రంగా పునఃపరిశీలన చేస్తేతప్ప, దానివల్ల వచ్చిన చిక్కులనుంచి తప్పించుకొనడానికి వీలుపడదు.

భారత వైదేశికనీతి శోచనీయమైన స్థితికి వచ్చింది. దాని గుమ్మంలోవున్న దేశాలతో దాని సంబంధాలు – తమకేమీ పట్టనట్టుగా వ్యవహరించే (బర్మా, లంక) వైఖరినుంచి, పూర్తివిరోధం వ్యక్తంచేసే (పాకిస్తాన్, చైనా) ధోరణివరకు విభిన్నంగా ఉన్నాయి. 1960 అక్టోబరు దురాక్రమణలో కోల్పోయిన ప్రాంతాన్ని తిరిగి స్వాధీనం చేసుకొనలేక పోవడమేకాక, కోల్పోయిన ప్రతిష్టనుకూడా పునః ప్రతిష్ఠించుకొనలేక పోయాము. విబంధదేశాలు మనను ముంచివేశాయి. ఆగ్నేయ–ఆసియాలో మనకు ఆసరాగా ఎవ్వరూలేరు. పశ్చిమరాజ్యాలు సహాయకారిగా ఉన్నాయి. కాని మనను పూర్తిగా విశ్వసించరాదు. సోవియట్ యూనియన్‌కూడా, చైనాతో వచ్చిన కుటుంబకలహం అవసరాలరీత్యా మనకు ఆసరా ఇవ్వడమో, ఇవ్వకపోవడమో చేస్తున్నది.

ఒక్కొక్క దేశానికి అదృష్టవశాత్తుగా లభించగలడు. తరచుగా అందరిచేత కీర్తించబడిన ఒక ప్రాజ్ఞుడైన విదేశాంగ మంత్రి, గత 16 సంవత్సరాలుగా నడిపించిన వైదేశికనీతి చివరిఫలితం ఇది. ఎవ్వరి సలహాలకు ఇచ్చగించక, ఆయన ఏకధాటీగా తన విధానాలను కొనసాగించారు. దాని ఫలితంగానే ఈనాడు మనం ఉన్న శోచనీయ పరిస్థితులకు గురిఅయినాము. ఆయన అనుసరించిన విధానాలకు ప్రాతిపదికగా ప్రపంచ వ్యవహారాలపట్ల ఒక రకమైన వైఖరి, నిర్ణీతమైన దృక్పథం గర్భితంగావుంది. ఆ దృక్పథాన్ని పరిశోధించి తెలుసుకొని, ఉత్తమ

రాజనీతి సూత్రాలతో దానిని పోల్చి చూడడం "పబ్లిసిస్టు" అనిపించుకొనగోరే వారి ప్రథమధర్మం కాగలదు: ఈ వ్యాసం అంతకంటె తక్కువ లక్ష్యాన్ని ఉద్దేశిస్తున్నది. ఏ ఫలితాలు మనను ఇంకా బాధిస్తున్నవో, ఆ ఫలితాలకు కారణమైవున్న కొన్ని దురదృష్టకర నిర్ణయాలను గురించి పర్యాలోచన చేయదలుస్తున్నది. వానిలో కొన్నింటిని మార్పు చేయవచ్చు. అందుకు తగిన ప్రయత్నం చేయవలసివున్నమాట నిజం. కాని, కొన్నింటిని మార్పుచేయ దురదృష్ట వశాత్తు వీలుపడదు. వానినే ఉదాహరిస్తాను.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన కొద్దికాలానికే ఒక ఎ. ఐ. సి. సి. తీర్మానం "భారతదేశం, ఆగ్నేయ ఆసియా దేశాలు కలిసి మెలిసివుండాలి. సమైక్యతతో కృషి చేయాలి" అని ప్రకటించింది. ఇండోనేసియాలో డచ్ వారి సైనికచర్యలకు నిరసన తెలియజేయడానికిగాను 1949 జనవరిన న్యూఢిల్లీలో ఆసియా మహాసభ జరిగింది. దీని తీర్మానాలు సరళంగా ఉన్నాయి. హెచ్చు ప్రభావం చూపాయి. కాని ఈ సభలోనే ఈనాడు ఎవ్వరూ గుర్తుకు తెచ్చుకొనడానికి శ్రద్ధ చూపని మరొక తీర్మానంకూడా జరిగింది. ఈ సభలో పాల్గొన్నవారిని "ఐక్యరాజ్యసమితి పరిధిలో పనిచేస్తూ, పరస్పరం సలహాలు సహకారం పెంపొందజేసుకొనడానికిగాను, ఆ యా ప్రాంతాలనుబట్టి, అనువైన ఒక వ్యవస్థను (Suitable machinery) నెలకొల్పుకొనడాన్ని గురించి పరస్పరం సమాలోచనలు కొనసాగించాలి" అని ఈ తీర్మానం కోరింది. [ఐక్యరాజ్యసమితి సూత్రావళిలో ప్రాంతీయమైన ఏర్పాట్లను అంగీకరిస్తున్న అధ్యాయం (8 వది) ఒకటి ప్రత్యేకంగా వుంది.] ఈ తీర్మానం హెచ్చు ఆశలను పెంచింది. ఈ సభలో పాల్గొన్న ఒక దేశం "ఆగ్నేయ-ఆసియాకు శాశ్వతమైన ఆర్గనైజేషన్ ఏర్పడవచ్చు" అని భావించింది. అలాంటిది ఏర్పడడానికి ఆ నాటి పరిస్థితులు కూడా అనుకూలంగా ఉన్నాయి. పాకిస్తాన్ కూడా, దూరంగా ఉన్నా, (ప్రధాని ప్రీతికరంగా చెప్పే మాటలప్రకారం) "స్థూలంగా" ఇలాంటి వైదేశికనీతినే అనుసరిస్తున్నది. లంక స్నేహంగాఉంది. బర్మా ఎంతో అప్యాయంగా ఉంది. ఇండోనేసియా నాయకులు, ఫిలిప్పీన్స్‌కూడా చాలా సహకరిస్తున్నవి. అందరూ భారతదేశం చొరవ తీసుకొని వ్యవహరించడంకోసం ఎదురుచూశారు. సోవియట్ యూనియన్ మాత్రమే వ్యతిరేకించింది. "ఇండోనేసియా సమస్యనుగురించి చర్చించడానికి" అనే నెపంతో ఈ పని ఏర్పాటుచేసినా నిజానికి దానిలక్ష్యం "ఉత్తర అట్లాంటిక్ కూటానికి అనుబంధ ఆయుధాన్ని తయారుచేయడం" అని ఈ సభను ఖండించింది.

1949 మార్చి 31 న వచ్చిన ఈ రష్యా మెమొరాండంవల్ల కానివ్వండి, లేక, ఆ సంవత్సరమే అక్టోబరులో చైనాలో కమ్యూనిస్టుప్రభుత్వం నెలకొనడంవల్ల కానివ్వండి, భారత్ లో పునరాలోచన ప్రారంభమైంది. 1960 మే లో బాగ్యియోలో ఫిలిప్పీన్స్, పాకిస్తాన్, భారత్, లంక, తాయ్‌లాండ్, ఆస్ట్రేలియాల సమావేశం జరిగేనాటికి శ్రీ నెహ్రూ అభిప్రాయాలు పూర్తిగా మారిపోయాయి.

# వైదేశిక విధానంలో కోల్పోయిన కొన్ని అవకాశాలు

భారత్ పట్టుబట్టిన ఫలితంగా ఈ సభ చర్చనీయాంశాలలో రాజకీయసమస్యల మినహాయింపు జరిగింది. చివరకు ఈ సభ ఎంత ఆశాపూరితంగా ఏర్పాటు అయిందో, అంత నిష్ప్రయోజనంగా ముగిసింది. ఆ తర్వాత నుంచి భారతదేశం, పొరుగునవున్న సహజ మిత్రులను నిర్లక్ష్యం చేసింది. కమ్యూనిస్టు చైనాభాయీలతో సన్నిహిత అనుబంధాలు నెలకొల్పుకొనడానికి ప్రత్యేకమైన ప్రయత్నాలు చేసింది.

ఈ పెద్ద భాయీనుంచి మనం ఏమీ కోరలేదు; అన్నీ మనమే ఇచ్చాము. 1950లో టిబెట్‌ను ధారాదత్తం చేశాము. 1954 లో పంచశీల ఒడంబడిక ద్వారా దాని భవిష్యత్తుకు భరతవాక్యం చెప్పాము. అయినప్పటికికూడా భారత్ ప్రయోజనాలను కాపాడడానికి కొంత అవకాశం ఉంది. శ్రీ బి. శివరావుగారు ఆ సంగతి వెల్లడించారు. ఆ నాటి విదేశాంగశాఖ సెక్రటరీ-జనరల్ శ్రీ గిరిజశంకర్ బాజ్‌పాయ్ "ఈ ఒడంబడికకు అంగీకరించమనేది రెండు షరతులకు లోబడి జరగా"లని భారతప్రభుత్వానికి సలహా చెప్పాడు. అవి ఏవంటే (1) సింకియాంగ్‌లోని కాష్‌ఘర్‌లో భారతప్రతినిధి కార్యాలయం ఏర్పాటు (2) మెక్‌మోహన్ రేఖను గుర్తించడం. ఈ సలహా తిరస్కరించబడింది. మెక్‌మోహన్ రేఖ గుర్తింపు అనేది జరిగివుంటే, ఈ మధ్య వచ్చిన చిక్కు సంభవించేదికాదు. కాష్‌ఘర్‌లో భారత ప్రతినిధి కార్యాలయం ఉంటే, సకాలంలో మనకు హెచ్చరికలు వచ్చేవి. ఆక్సాయ్ చిన్‌లో చైనావారు రోడ్డు వేయడాన్ని నివారించడానికి వీలుపడేది. కనుక ఈ పంచశీల ఒడంబడిక అనేది పెద్ద తప్పిదం- Worse than a crime.

1954 సయోధ్యల సంవత్సరం. సూయజ్ ఒడంబడిక; పశ్చిమ ఐరోపా యూనియన్ ఏర్పాటు; బురామి వివాద పరిష్కారం; ట్రియస్టీ ఒప్పందం; ఇండో-చైనాలో యుద్ధవిరమణ ఈ సంవత్సరంలో జరిగాయి. కాని భారత్ దేశం మాత్రం దీనిని విషాదకరమైన తప్పిదాల సంవత్సరంగా చేసుకున్నది.

"సైనికసహాయాన్ని కోరుతూ మనమొక విజ్ఞప్తిని పంపుకుంటే, దానిని సానుభూతితో పరిశీలించగలనని అమెరికా అధ్యక్షులు సౌజన్యంతో సూచించాడు." అని 1954 మార్చి 1 వ తేదీన శ్రీ నెహ్రూ లోక్‌సభకు చెప్పారు. అధ్యక్షుడు ఐసెన్‌హోవరు చేసిన ఈ సూచనలోని అంతరార్థాలను పరిశీలించడం సముచితం కాగలదు. ఆయుధాలు పొందడానికి పాకిస్తాన్ అమెరికాతో జయప్రదమైన సమాలోచనలు సాగించింది. దానిలక్ష్యం కమ్యూనిజంతో పోరాటంకాదు. సైనికంగా భారత్‌తో సమాన ఉజ్జీగా ఉండడం. సైనికంగా పాకిస్తాన్ బలహీనస్థితిని గురించి శ్రీ జిన్నా ఎంతో విచారించాడని ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకొనడం మంచిది. దేశవిభజన జరగకపూర్వమే ఆయన "పాకిస్తాన్ తగినంత బలంగా ఉండాలి. హిందూస్తాన్‌కు సమ ఉజ్జీగా ఉండాలి" అని చెప్పాడు. కాని ఆ తర్వాత సంఘటనలు ఆయన ఆశను నిరాశ

చేశాయి. పాకిస్తాన్‌కుగల ఈ లోపం భర్తీ కాకుండా చూడటమనేది మన శ్రేయస్సుకు కూడా అవసరం. కాని మన సోవియట్ అనుకూలవైఖరిద్వారా, ఒకవేళ పాకిస్తాన్‌కు సహాయం చేయనప్పటికీ, భారతదేశం సోవియట్ వైపునే వుండగలదన్న గట్టి నమ్మకం అమెరికాకు కలిగించాము: అమెరికా-పాకిస్తాన్ సైనికఒడంబడిక జరగడం అనేది దౌత్యరంగంలో మనకు పెద్ద ఓటమి అని చెప్పినా అతిశయోక్తి కాబోదు. ఈ ఓటమిని మనం తప్పించుకొనివుంటే బాగుండేది. అందువల్లనే పాకిస్తాన్ విజయాన్ని నిరుపయోగం చేయగల సదవకాశం అధ్యక్షుడు ఐసెన్‌హోవరు సూచనద్వారా లభించిందని అనడం. అంతేకాదు. మన రక్షణబలాలను పెంచుకొనడానికి అది ఎంతగానో సహాయపడేది. తటస్థవిధానాన్ని అనుసరించే యుగోస్లావియాకూడా అమెరికా సహాయాన్ని తీసుకొనగలిగింది. కాని అహంభావపూరితమైన నిర్లక్ష్యంతో భారతదేశం ఈ సహాయాన్ని అస్పృశ్యంగా భావించింది. "ఈ సూచన చేయడంలో అమెరికా అధ్యక్షులు మనకూ, ఆయనకూ న్యాయం చేసినవారు కాలేకపోయారు. ఒకవైపున పాకిస్తాన్‌కు సైనికసహాయం చేయడానికి అభ్యంతరం చెబుతూ, మరొకవైపున మనమూ దానిని స్వీకరించడానికి సిద్ధపడితే, అచ్చి అవకాశవాదులమూ, మోసగాళ్లమూ ననిపించుకోగలము." అని శ్రీ నెహ్రూ సమాధాన ప్రకటనవచ్చింది. చివరకు మనం సహాయాన్ని కోల్పోయాము. మనలో మంచితనం అనేది ఏదైనావుంటే దానినీ పోగొట్టుకున్నాము.

1959 లో చైనా భారతదేశంమీద లోంగ్జూలోను, చాంగ్-చిన్మో లోయలోను దండెత్తింది; దీనివల్ల ఆసియా మొత్తంమీద భయాందోళన వ్యక్తమైంది. అప్పుడు ఇండోనీసియాకూడా, తన దేశంలో నివశిస్తున్న చైనీయుల జాతీయ పౌరసత్వ సమస్యపై కమ్యూనిస్టుచైనాతో వివాదంలో వుంది. చైనా వ్యతిరేక కొట్లాటలుకూడా ఇండోనీసియాలో జరిగాయి. ముస్తాంగ్ సంఘటనవల్ల హాన్‌సామ్రాజ్య వాదాన్ని నేపాల్ రుచి చూచింది. బర్మాకూడా ఇదే స్థితిలో వుంది. అప్పుడీ పరిణామాలన్నింటికి సరైన దృక్పథమిచ్చి, ఆగ్నేయ ఆసియా మొత్తానికి ఉమ్మడిగా సంభవించనున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరికచేసే సదవకాశం భారతదేశానికి లభించింది. కాని శ్రీ నెహ్రూ మరొకరకంగా తలంచారు. పెద్ద ఎత్తున భారతదేశ సరిహద్దుల్లో దురాక్రమణ జరిగేవరకు శ్రీ నెహ్రూ వైఖరిలో మార్పు రాలేదు. "ఆదేశాల (ఆగ్నేయ ఆసియాలోని) జాబితాను నేను చూడదలుస్తున్నాను. దేనినైనా నిరోధించడానికి, చివరకు తమకు తాముగా నిలబడడానికి వీనికి గల బలమెంతో తెలుసుకొనదలుస్తున్నాను." అన్నారు. ఆనాడు వానిపట్ల మనకుగల హేయభావానికి ఈనాడు మనపట్ల వానికిగల హేయభావానికి సరిపోయింది.

పాకిస్తాన్‌తో మన సంబంధాలను వాస్తవికదృష్టితో పరిశీలించవలసి వుంది. "ఎవ్వరినుంచి రక్షణకు"? అనే ప్రశ్న, గర్వపూరితులైన రాజకీయవేత్తలు వేసే మూర్ఖమైన ప్రశ్నల సంపుటిలోని "యుద్ధోన్ముఖం"

## వైదేశిక విధానంలో కోల్పోయిన కొన్ని అవకాశాలు

(Brinkmanship) అనేపదంతో సమాన మౌతుంది. కాశ్మీర్ వివాద పరిష్కారానికి గాను "అవతలివారికి, మనం సూచించేది కాక మరొకటి ఏదైనావుంటే, దానినే బయట పెట్టమనండి. కనీసం దానిని గురించి అయినా మనం సంభాషణలు ప్రారంభించ వచ్చు." అని 1960 మార్చిలో పాకిస్థాన్ విదేశాంగమంత్రి ప్రకటించాడు. దీనిలోని సూచననుకూడా విస్మరించడం జరిగింది. ఆ మరుసంవత్సరంలోనే చైనా - పాకిస్థాన్ ల మధ్య స్నేహసంబంధాలు ఆరంభమైనాయి.

ఇలా లభించిన ఈ అవకాశాలను పోగొట్టుకొనకుండా వుంటే, ఇప్పుడు మన స్థితి ఎంత విభిన్నంగా వుండేదని ప్రశ్నించుకొనడం సహజమే అయినప్పటికి, నిరుపయోగం. అయితే మన పరిస్థితులలో వున్నటువంటి దేశానికి వైదేశికనీతిని రూపొందించడంలో, పైన వివరించినట్టు కోల్పోయిన అవకాశాలకు సంబంధించిన గుణపాఠాలనైనా నేర్చుకొనడం శ్రేయస్కరం కాగలదు: మనకు భద్రతఅనేది ఆగ్నేయ ఆసియా దేశాలతో ఉమ్మడి సంబంధాలను పెంపొంద జేసుకొనడంమీద ఆధారపడివుంది కాని, వానిని నిర్లక్ష్యం చేయడంలో లేదు. ప్రజాస్వామ్యదేశాలు ఇస్తున్న సహాయాన్నికూడా ఉపేక్షా భావంతో చూడరాదు.

["ఒపీనియన్" పత్రిక సౌజన్యంతో



# అనామకుడు

శ్రీ చంద్రమౌళి

అయ్యో—అయ్యో— అయ్యో' అని, అటు మిన్ను విరిగి మీద పడ్డట్టూ, ఇటు పాదాలకింద నేల కుంగిపోయినట్లూ, హాహాకారాలు గాలిలో తేలినై. ఆడవాళ్ల గొంతులూ మొగవాళ్ల గొంతులూ అటు ఆకాశాన్ని చేరకముందే—ఇటు నేలను తాకకముందే—చుక్క రాలిపడ్డట్టు నేల రాలినకాంక్రీటు బొచ్చెతోబాటు నేల రాలాడు అతడు. ఇంకా హాహాకారాలు నింగికీ, నేలకూ మధ్యవర్తులులా చుడుతూనే ఉన్నై. ఆడవాళ్ల గొంతులూ, మొగవాళ్ల గొంతులూ—గమ్యం లేనట్లు గాలిలో తేలుతూనే ఉన్నై.

అయినా ఒక్కసారి సృష్టి స్థంభించిపోయింది. గరగరలాడుతూ తిరుగుతున్న కాంక్రీటు మిక్సర్' ఆగిపోయింది. ప్రతిసృష్టి చేయటానికి, ప్రకృతికన్న వేగంగా పరుగెత్తి బారులు తీరుస్తున్న కాంక్రీటు బొచ్చెల గొలుసు తెగిపోయింది. ఎక్కడి బొచ్చె లక్కడే ఆగిపోయినై. ఎక్కడి కదలిక అక్కడే—అర్థక్షణం తొందరపడితే—ఎన్ని బొచ్చెలు నేల కూలేవో—? ఎంతటి వికృతి జరిగేదో—?

ప్రక్కనే నింగిని కలుసుకోవటానికి సంబరపడుతున్న విశ్వామిత్ర సృష్టి అప్పటిదాకా జీవంతో కలకల్లాడుతూ సగం పూర్తయిన మూడంతస్థుల మేడ ఎక్కడో జరిగిన తప్పుకు చలనం పోగొట్టుకున్నట్టయింది. జీవానికి ప్రతినిధులు ఎన్నో కళ్లు—అంతమటుకు నింగినే చూస్తున్నవి నేలకు దిగినై. ఎక్కడో జరిగింది తప్పు. ముక్కూ చెవులూ తెగి అందవిహీనురాలైన శూర్పణఖలా రిక్కవడి చూస్తున్నది. విశ్వామిత్ర సృష్టి. ఎక్కడో జరిగిన తప్పుకు ఎవరో కారణభూతులు—? ఎవరైతేనేం, అతను మటుకు నేల కూలాడు. రిక్క నేల కూలింది. సముద్రంలో పెనుతుఫాను రేగింది.

కింద కాంక్రీటును నుగ్గు నుగ్గు చేయ చూస్తున్న మిక్సరులోని చక్రం ఆగిపోయింది. నేలమీద ఇనుపరేకు మీద చెల్లా చెదురుగా ఉన్న కాంక్రీటును—రోడ్డుమీద వెదజల్లిన రూపాయిలను గుప్పిటలో చిక్కించుకోవాలని సర్వ ప్రయత్నాలు చేసే చేయిలా—చే జిక్కించుకుంటున్న పార ఆగిపోయింది. దానిలో జీవం కలుగజేసిన చేతుల్లో ఇప్పుడు నెత్తురు పారటంలేదు. నోరు తెరుచుకుని చూస్తున్న ఇనుపబొచ్చె నోరు తెరుచుకునే ఉన్నది. అందుకోవటానికి జాచిన కూలీ చేతిలో జీవం ఒక్కసారి స్థంభించినట్లయింది. అంచ లంచలుగా ఆకాశాన్ని అందుకోవటానికి సాయం చేస్తున్న కూలీలలో సైతం నెత్తురుగడ్డకట్టుకు పోయినట్లయింది. చేతుల్లో బరువుతో నిండిన బొచ్చెలు—ఎక్కడి వక్కడే ఉన్నై. ఆ చేతులు అంతసేపు ఆ బరువు ఎలా మోస్తున్నాయో వాళ్లకే ఆశ్చర్యం కలిగించింది.

యాత్రకు పోతున్న ప్రయాణికుల్లా ఒకరి వెనుక ఒకరు తిరణాలలో జయింటు వీలులో ఒకరిపైన ఒకరుగా—కూలీలు వెదురు బొంగులతో కట్టిన పరమపద సోపానాలమీద నిల్చున్నట్లు నిల్చున్నారు. కళ్లు తేలవేసి చేతులు బిగిసిపోయి—ఆలోచనలు స్థంభించిపోయి—నిల్చున్నారు. పైన మూడో అంతస్థుమీద శ్లాబు వేయిస్తున్న మేస్త్రీ ఒక్కసారి తెల్లబోయాడు. ఏమిటీ ప్రతిష్టంభన అని—క్రిందకు ఒక్కసారి చూచాడో లేదో—

అందరి మనస్సుల్లోనూ ఒక్కసారి భయం. కారు చీకటిలాటి భయం. ఏదో తెలీని భయం. ఏదో తెలిసీ తెలీని భయం. ఎక్కడా సంచలనం లేదు—" అయ్యో—అమ్మో—" తప్పించి—ప్రాణంలేని మరలు సైతం ఆగిపోయినై. కాని, అందరి హృదయాల్లోను ఒక్కసారి వెయ్యి హార్సు పవర్ల బలంతో, నడుస్తున్న మరలు చేస్తున్నయ్ చప్పుడు.

పైనుంచి మేస్త్రీ ఒక్క పొలికేక పెట్టాడు. తుపాకి గుండుకు రాలిన పక్షుల్లా అంతకు ముందరి తమ అస్తిత్వాన్ని మరచి—అంతకు ముందరి బ్రతుకుమీది తీపి వదిలి—అంతకు ముందరి—చీకటిలాటి భయం పోయి—అంతకుముందు—మనస్సుల్లో—చీకటి కొట్లలో దాచుకుని—తేపతేపకూ ఉందో లేదో అని తడివి చూసుకుంటూ, వచ్చిన స్వార్థాన్ని ఒక్క

క్షణం మరచిపోయి—కూలీ అందరూ ఒక్కరొక్కరుగా క్రిందికి దిగిపోయారు. అంతమటుకూ షష్ఠిపూర్తి చేసుకున్న మహాకవిలాగా—ఒక లక్ష పోతే పోయే—ఎలక్షన్లలో గెలిచానని తెలిసిన ఎం. ఎల్. ఏ. లాగా వెలుగుతున్న సగం పూర్తయిన మూడంతస్థుల మేడా వెలవెల పోయింది.

అప్పటికే అతని చుట్టూ జనం చేరారు. వాళ్ల హృదయాలు ఎప్పుడూ అనుభూతి పొందని సానుభూతిని అనుభవిస్తున్నై.

చిరుగులతో అతని వళ్లు కప్పుతున్న బనీనూ—మోకాళ్లు దిగని పంచా—వయసు మిసిమిని మరీ కొట్టవచ్చినట్లు చూపిస్తున్నై. తలవారికలై—నెత్తురు సెలయేరులా కారసాగింది. ఎవరో గుడ్డ తెచ్చి నెత్తురు తుడుస్తున్నారు. హడావుడిగా వచ్చిన పోలీసులు శవం సంగతి మరచిపోయి జనం సంగతి చూస్తున్నారు.

మేస్త్రీని వాళ్లూ వీళ్లూ సవాలక్ష ప్రశ్నలు వేస్తున్నారు. అతని చూపు కానీ—అతని మనస్సు కానీ అక్కడ లేవు. ''బలి కోరింది బాబోయ్ యీ బిల్డింగు'' అంటున్నా డొక కూలీ. సగం లేచిన బిల్డింగు పైనున్న కూలీ కూడా కిందకు దిగి వచ్చాడు. ఆ బిల్డింగు పక్కనే రెక్కలు విప్పుకునున్న చెట్టు మీది గూళ్లకు పక్షులు జేరుతున్నై. పడమటిదిశ ఎర్ర బారింది. గాలి—ఎక్కడి దక్కడ ఆగిపోయి సానుభూతి చూపిస్తున్నది. సున్నం గానుగ చుట్టూ, మనిషి లేకపోయినా దున్న గానుగాడుతున్నది. చుట్టూ సిమెంటు వాసన—ఎండిన దుమ్ములో నీళ్లు పడ్డప్పటి వాసన—కాంక్రీటు వాసన—మనషుల చెమట వాసన—పోలీసు దగ్గర లంచం వాసన. ''ఏయ్ మేస్త్రీ ఇట్లా రా''—అంటున్నాడు పోలీసు. లోకానికి విడాకులిచ్చిన ఎవరో ఆసామీ ఇక్కడ ఇంతమంది ఎందుకు గుమిగూడారా అన్న ధ్యాసే లేకుండా—హారను మోగిస్తూ కారులో దూసుకుపోయాడు. ఆయన మనసులో ఉక్కిరిబిక్కి రౌతున్న భావాల వత్తిడికి కారు టైర్లు మేఘాల్ని సృష్టించినై. ఎందుకీ పనికిరాని ఆ దుమ్ముక్కూడా ఆకాశాన్నంటే ఆశ.

పోలీసు మేస్త్రీని పక్కకు లాక్కెళ్లుతున్నాడు. ''ఎవరు—ఎవరు ?'' అంటున్నాడు అప్పుడే గుంపులో జేరి, తన్ను వాళ్ల కన్న గొప్పవాడిననే 'యిగో' ను క్షణంపాటు జేబులో వేసుకున్న పెద్దింటి పెద్దమనిషి. ''కూలీ''— అని సమాధానం— ''ఏమైంది ? ఏమైంది ?'' అంటున్నా రింకొకరు. ''పైనించి పడ్డాడు—'' అని సమాధానం. ''పాపం—ఇంకా అలా చూస్తా రేమయ్యా ఆస్పత్రికి తీసుకెళ్లక—'' అంటున్నాడు ఉడుకు రక్తం ఉరకలేస్తున్న కుర్రాడు. ''ఆస్పత్రి—ఆస్పత్రి'' అందరి గొంతుల్లోనూ అదే ధ్వని—ఆ ధ్వనికి ప్రతిధ్వని—కావలసిన పోలీసు ఎడంచెయ్యి—నిక్కరు జేబులోంచి అప్పుడే బయట పడింది.

ఒకళ్లు టాక్సీ కోసం పరుగెత్తారు. ఒకళ్లు—రిక్షాని పిలిచారు. దారిలో పోతున్న ఎవరిదో కారును ఆపుతున్నారు ఇంకొకరు. టాక్సీ వచ్చింది, రిక్షా వచ్చింది. దారిన పోతున్న కారూ ఆగింది. ''టాక్సీలో పడుకోబెట్టండి'' అంటున్నాడు—టాక్సీ తెచ్చినాయన. ''రిక్షాలో పడుకోబెట్టండి'' అంటున్నాడు రిక్షా తెచ్చినతను—కారు ఆసామి కారు దిగి—''అరె—పాపం—ఇంకా ఆలస్యం చేస్తారే—కారులో వెనకసీట్లో పడుకోబెట్టండి'' అంటున్నాడు. తోటి కూలీలు నలుగురూ—చేతులేసి 'అతన్ని' లేవదీశారు. గాలికి నెత్తురు గడ్డకట్టిపోయింది. కారినంత లెక్క నల్లని జుత్తు ఎర్రబడింది. పళ్లు—ఒకటో రెండో విరిగి నెత్తురు బుగ్గలయింది. బుగ్గ వాచిపోయింది. తనమీద ఇంతమందికి—ఒక్కసారి—బోలెడు సానుభూతి కలిగిందని గ్రహించటాని కతనికి స్పృహలేదు.—'డబ్బుఖర్చు కాదని' కారులోనే పడుకోబెట్టా రతన్ని. పోలీసులు కొలతలు కొలవడం అప్పటికి పూర్తయింది. ఇద్దరు పోలీసులూ— 'అతని'తోబాటు కారులోఎక్కారు. ఒకరిద్దరు కూలీలు ఎక్కారు. మేస్త్రీ వెనక దిగడ్డాడు. అప్పుడే వచ్చిన సబ్ ఇన్‌స్పెక్టర్ దొరికావులే కొండిగా అన్నట్లు మేస్త్రీ వంక చూచి—ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు.

''నీపే రేమిటి ?'' ''నీ ఊరేమిటి'' లాటివి. ఆఖరుకు అసలు విషయానికి వచ్చాడు. మేస్త్రీ మనసులో అతనే మయ్యాడోననే ఆదుర్దా. ''ఇన్ని ప్రశ్నలేసే బదులు ఆ కావల్సిం దేదో చెప్పరాదూ ?'' అంటున్నాడు, డబ్బు సంపాదించటంలోనే కాక ఖర్చు పెట్టటంలో కూడా 'సుళువులు నేర్చుకున్న మేస్త్రీ. ఇన్‌స్పెక్టరు నవ్వాడు. ఆ నవ్వు విలువ పాతిక అని వ్యాఖ్యానించాడు మిగిలిపోయిన పోలీసు. తీరా తీర్థానికి తీర్థం—ప్రసాదానికి ప్రసాదం అన్న సామెత గబుక్కున జ్ఞాపకానికొచ్చి—ముడుపు చెల్లించుకున్నవాడు—వందనాలు పొందవలసింది పోయి—పెట్టి తప్పుకున్నాడు. తప్పుకుని ఏకబిగి ఆస్పత్రికి బయలుదేరాడు. డబ్బు పోతే పోయె శని విరగడైందని.

రిక్షాలో కూర్చున్న తరువాత ఆత్మజ్ఞానం కలిగింది. తన ఎరికలో ఇలాటి వ్యవహారంలో చిక్కుకోవటం ఇదే మొదటిసారి. తన మూలంగా ఎన్నో ప్రాణులు సుఖాన పడ్డాయ్ కాని— కష్టంలో ఇరుక్కుంది ఇదే మొదటిసారి. అతన్ని తలుచుకుని జాలివేసింది. రిక్షా నాలుగడుగులు వేసిందో లేదో

వెనక నుంచి పోలీసు సైకిలు మీద తరుముకొచ్చాడు— "ఆడి పేరేటి ?" అన్నాడు— "ఎవడి పేరు ?" అన్నాడు మేస్త్రీ బొమలు ముడివేస్తూ— "ఆడే—పైనించి పడ్డాడే ఆడిపేరు ఇనస్పెట్టర్‌గారు రాసుకోలేదంట" అన్నాడు. "కనుక్కొని చెబుతాలే" అన్నాడు మేస్త్రీ వెటకారంగా రిక్షా జారిపోయింది.

మేస్త్రీ ఆస్పత్రికి జేరి రిక్షా దిగేటప్పటికి చిన్న మేస్త్రీ ఎదురొచ్చి "ఆడి పేరేమిటి ?" అన్నాడు. మేస్త్రీకి చిరాకేసుకొచ్చింది— "ఎవడిపేరు ?" అన్నాడు. "వాడే— ఆ పోయినాడి పేరు—" "పోయినాడా— అంటే— ఆ కూలీ నాయాల చచ్చిపోయాడా ఏమిటి ?" అన్నాడు. మాట తొస్సు మని వచ్చినా మేస్త్రీ గుండెల్లో దడ— "మరేంటి— ఎవరి నడిగినా ఆడిపేరు తెలీదన్నారు— నీకు తెలుసేమోనని డాక్టరుగారు కనుక్కోమన్నారు— నీకూ తెలీదూ ?"

"పనిలోకి తీసుకుంది నువ్వేగా— నీకే తెలియాలి నాకేం తెలుసు" అన్నాడు మేస్త్రీ. చిన్నమేస్త్రీ తెల్లబోయి నీళ్ళు నమిలాడు. "ఆడి పేరేంటి— ఆడి పేరేంటి" అని కనబడ్డ కూలీనల్లా అడిగాడు.

అందరూ బిక్క మొగమేశారు. "మేస్త్రీని డాక్టరు గారు పిలుస్తున్నా"రన్నా రెవరో. మేస్త్రీ లోనికెళ్ళాడు. "పొద్దున్నే శవాన్ని అయినవాళ్ళ కిస్తారుట." అన్నాడు తాపీ పని చేసే రామిరెడ్డి." ఆడి పేరే తెలీంది— అయిన వాళ్ళెవ రని ?" అన్నాడు కాంక్రీటు మిక్చరు నడిపే ఎసోబు. "అయినా వాళ్ళెవరూ లేకపోతే ఆళ్ళే తగలేస్తారు". ఆడు హిందు వైతేగా" అన్నాడు పీరు సాయిబు— "కాకేమిటి— ఆడ్ని చూస్తే తెలీటల్లా" అన్నాడు రామిరెడ్డి—" ఏమో ? అన్నాడు ఎసోబు—" నలుగురు కూలీలూ పోగైనారు. ఎవరికి తోచిన అభిప్రాయం వాళ్ళు చెబుతున్నారు. ఒకళ్ళు హిందు వంటే ఒకళ్ళు— సాయిబంటున్నారు. ఎసోబు నవ్వి— 'కాదు'— అన్నట్టు చూస్తున్నాడు. అందరూ ఒక్కసారి ఆస్పత్రిలోకి వెళ్ళారు. బెడ్‌మీద— అనామకుడైన వ్యక్తి శవం పడున్నది. డాక్టరు కూలీలందరినీ వెళ్ళి పొమ్మని గదమాయించాడు. అందరూ బయటి కొచ్చారు.

తెల్లవారింది. జీవం కోల్పోయిన మూడంతస్థుల మేడ మళ్ళీ జీవం పోసుకుంటున్నది. సృష్టికి ప్రతిసృష్టి జరుగుతున్నది. కాని అందరి మనసుల్లోనూ నిన్నటి రోజున జరిగిన సంఘటనే మెదులుతున్నది. ఇవాళ పనిలోకి అంత మంది కూలీలు రాలేదు. ఈ మేడ బలికోరిందని— జడిశారో ఏమో— సూర్యుడు నడినెత్తికొచ్చాడు. అప్పటికి చిన్నమేస్త్రీ తిరిగి వచ్చాడు.

కూలీలు బువ్వకు దిగారు. అందరి మనసుల్లోనూ ఒకే ఆలోచన— ఆడిశవాన్ని కాల్చారా— పాతి పెట్టారా— అని. చిన్న మేస్త్రీ— వచ్చి సవాలక్ష ప్రశ్న లేస్తున్నాడు. తాపీ పని రామిరెడ్డి — ధైర్యం చేసి ముందడుగేసి అడగనే అడి గాడు— చిన్న మేస్త్రీ ఇసుక్కొని— "పొదరా చచ్చినాడికి **మతమేంటి**—" అన్నాడు—



# హరవిలాసము కిరాతార్జునీయము

శ్రీ టి. వి. యం. అయ్యవారు

కవిసార్వభౌముని కాశీఖండ నైషధములం బండిత లోక మెంత ప్రస్తుతించినను, నిజముగా నాయన స్వతంత్ర హర విలాసమున ప్రస్ఫుటముగ గోచరించును. తీయని తెనుఁగు నుడుల పొంకమునకును, ఝటితి రసస్ఫురణకును హరవిలాస మాకరమైనట్లుగా నాయన మిగిలిన కృతులు కావనుట సహృదయ విదితమైన సత్యము. శివోత్కర్ష ప్రతిపాదకములైన భిన్న భిన్న కథలను వివిధ గ్రంథముల నుండి స్వీకరించి, వానికి తెనుఁగుతనపు ముద్ర వైచి, రస నిర్వహణము కావించుటయే శ్రీనాథుఁడు హరవిలాసమును జేసిన ఘనకార్యము. అందుచేతనే ధిషణా ధౌరంధర్యము కంటె హృదయస్పందనమే విశిష్ట ధర్మములుగా గల రమణీయ సన్నివేశము లెన్నో యీ భవ్య కావ్యమున నవకాశము గల్పించుకొన్నవి. అట్టి వానిలోఁ బ్రత్యేకించి పేర్కొనఁ దగినది కిరాతార్జునీయము.

కిరాతార్జునీయము భారతములో నరణ్య పర్వమున వచ్చును. పాండవ మధ్యముఁడగు నర్జునుని యసమాన పరాక్రమ విశేషమున కా ఘట్టమాద్య నిదర్శనము. దానినే భారవి మహాకవి యష్టాదశ సర్గ సంభృతమైన మహాకావ్యముగా సంతరించి యజరామరమైన యశస్సు సంపాదించుకొనినాఁడు. శ్రీనాథ కవి భారవి కావ్యమును బాగుగా చదివి జీర్ణించుకొనినాఁడు. ఇఁక వ్యాస భారతము సంగతి చెప్ప నక్కరలేదు. తాను "వ్యాస వాల్మీకి సంయమి వాక్ సుధాంబోధి లోలోర్మి పంక్తుల" లెస్సగా నోలలాడితి నని యొకచోఁ జెప్పుకొనినాఁడు. ఈ యపూర్వ సంస్కార బలముతోనే యాతఁడు రసికజన సర్వస్వము లగు నీ దృఙ్మహాకావ్యముల నిర్మింప గలిగినాఁడు. కిరాతార్జునీయ ఘట్టమున వ్యాసభారవులనే మించినాఁడు. దాని రామణీయకతను వివరించుటయే ప్రస్తుత వ్యాస లక్ష్యము.

కిరాతార్జునీయ ఘట్టము పార్థుని తపస్సుతోఁ బ్రారంభమగును. వ్యాసభారవు లాతని తపశ్చర్య నభివర్ణించిన తీరు వేరు. శ్రీనాథుఁడు వర్ణించిన తీరు వేరు. వ్యాసుని మార్గము పురాణ పద్ధతి ననుసరించి కొంత శుష్కముగా సాగినది. ఆ వర్ణన మొక యర్జునునకే కాదు. తప మొనరించు నెవ్వరికైన నన్వయించును. చూడుఁడు :

దర్భం చీరం నివస్యాథ
దండాజిన విభూషితః
శీర్ణంచ పతితం భూమౌ
పర్ణం సముప యుక్తవాన్
పూర్ణే పూర్ణే త్రిరాత్రేతు
మాస మేకం ఫలాశనః
ద్విగుణేన హి కాలేన
ద్వితీయం మాస మత్యయాత్.
తృతీయ మపి మాసం స
పక్షే ణాహార మాచరత్
చతుర్థే త్వథ సంప్రాప్తే
మాసే భరత సత్తమః
వాయు భక్షో మహాబాహు
రభవత్ పాండు నందనః
ఊర్ధ్వబాహు ర్నిరాలంబః
పాదాంగుష్ఠ ప్రతిష్ఠితః
సదోప స్పర్శనాచ్చాస్య
బభ్రూపుర మితౌజసః
విద్యుదంభోరుహ నిభాః
జటాస్తస్య మహాత్మనః. —వనపర్వము.

వ్యాసుని యీ వర్ణనమున నర్జునుని శైవాచార పరాయణత్వ మేమియునుఁ జెప్పఁబడలేదు. స్థిరచిత్తమున నాతఁడు తప మొనరించినట్లు మాత్రమే చెప్పబడినది. భారవి కూడ నిదే ధోరణిలో నర్జునుని తపశ్చర్య వర్ణించెను. శీతోష్ణాది ప్రకృతి పరిణావ

ములకును, నచ్చురల హావ భావ విలాసములకును నాతఁ డెట్టి వికారమునుఁ బొరయలేదనుట కంటె నందు విశేష మేమియును మనకు కన్పింపదు. కాని, యిప్పట్టున శ్రీనాథుని వర్ణన మాత్రము విశిష్టముగ సాగినది. ఏయే శైవాచారముల నవలంబించి, యర్జునుఁడు శివునిఁ బ్రసన్నునిఁజేసికొనెనో యాతఁ డీ ఘట్టమున విపులముగఁ జెప్పియున్నాఁడు. దీనివలన ప్రధాన కథ కాతఁడు మెఱుఁగు పెట్టినట్లయినది. ఇంతేకాదు. కొన్ని మంత్రశాస్త్ర రహస్యములను, నాగమ సంప్రదాయముల నాతఁ డీ ఘట్టమున నిక్షేపించినాఁడు. వానిని దిక్ప్రదర్శనముగఁ దెలిపి యీ కథా సందర్భమున నాతఁడు సాధించిన రమ్యతను వివరింతును. అర్జునుఁడు తప మిట్లొనరించెనఁట !

ప్రథమ సంధ్యారాగ పరిపాటి మిన్నేటి
కనక పంకజ కోరకములు దెలుపఁ
గందువాఱిన మించుఁ గంచు టద్దము పోలె
విధుమండలము కాంతి వీడుకొనఁగ
దరమైనవేఁ బోక తఱిపి వెన్నెలఁ గ్రోలి
దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూట మధ్య భాగమ్మునఁ
గృత్తికా నక్షత్ర మత్తమిల్ల
మృదుల భస్మ రజశ్శయ్య మేలుకాంచి
యమల రుద్రాక్ష ధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున
హరున కొనరించు నరుణోదయార్చనంబు.

కపి కేతుఁ డింద్ర కీల
ప్రపాత పతయాళు నిర్ఝర స్నాతుండై
యుపచార విధుల నన్నిటఁ
దపనోదయ వేళ వ్యాళధరుఁ బూజించున్.

అవధానమ్మునఁ బాకశాసను సుతుం డర్ధేందు కోటీరు సం
గవకాలమ్మునఁ బూజసేయు హిమవాః కర్పూర కస్తూరికా
ద్రవ కాలాగురు గంధసార సురభి ద్రవ్యంబులం బూవులన్
లవలీ సర్జరసా గురు ప్రముఖ నానా ధూప ధూమంబులన్.

పంచబ్రహ్మ షడంగబీజ సహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరా పరమ నిష్ఠా తత్పరత్వంబునన్
మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకున్ మధ్యాహ్న
కాలంబు సే
వించున్ నిర్ఝర రాజసూనుఁడు మనోవీథీ సదా ధ్యాసితన్‌
వైయాఘ్రాజిన ఖండ మధ్యమున శేవం బద్ధ పద్మాసనం
డా యింద్రాత్మజుఁ డింద్రకీల శిఖరీంద్రా రూఢ
బిల్వద్రుమ
చ్ఛాయా నిర్మల చంద్రకాంతమణి పాషాణ ప్రదేశంబునన్
సాయంకాలము పూజసేయు నభవున్ సంధ్యానటున్
ధూర్జటిన్.

అంచిత భక్తితో శివుని నర్ధనిశా సమయంబునందు సే
వించు గురూపదేశ పదవీ పరిశుద్ధ సమర్చనా విధిన్
గాంచన కోరకమ్ముల శుక ప్రసవంబులఁ గొండ గోగులన్
గాంచన కందరా గృహ ముఖమ్ములఁ బార్థుఁడు సంస్కృ
తార్థుఁడై.

ఈ పద్యములను బట్టి యర్జునుడు షట్కాల శివపూజా దురంధుధరుఁ డయ్యెనని తెలియుచున్నది. అంతేకాదు. ఆతుడు పాశుపతవ్రత దీక్షితుడును నయ్యెనని వీని తరువాత నొక వచనమున శ్రీనాథుఁడు చెప్పినాడు. ఈ పాశుపత దీక్షను రావణ సంహార్థియైన రాముడు కూడ స్వీకరించినట్లు పద్మపురాణమున నిగదితమైనది. దీనినే విరజాదీక్షయని కూడ నందురు. దీని విధానము సమస్తమును భగవంతుఁడైన యగస్త్యుడు శ్రీరామచంద్రునకు "శివగీత" లో నుపదేశించినాడు. బహు పురాణవిధుఁడైన మన కవి సార్వభౌముడు దానిని దృష్టిలో నుంచుకొనియే యర్జును నీ దీక్షను గ్రహింపఁజేసెను. వైరిజయాభిలాష మా యిరువురియందును (రామార్జునులు) సమానము కదా ! ఇంతేకాదు. అర్జునుఁడు "పంచ బ్రహ్మ షడంగ బీజ సహిత ప్రాసాద పంచాక్షరీ చంచన్మంత్ర పరంపరా పరమ నిష్ఠా తత్పరత్వమునఁ బరమశివుని నర్చించెనని యన్నాఁడు. సద్యోజాత వామదేవా ఘోరేశాన తత్పురుషులనుఁ బంచ బ్రహ్మలను నామమున శైవాగమములు వ్యవహరించును. ప్రతి మహా మంత్రమునకును ఋషి చ్ఛందో, దేవతా, బీజ, శక్తి, కీలకములను నాఱంగములుండును. "ప్రాసాద పంచాక్షరి" యన "హ్రీం నమశ్శివాయ" మంత్రము. అర్జునుఁడు ఈ మంత్రమునే యేల జపించవలయునను సందేహము సాధారణముగా మనకు బొడమును. అందఱును శివార్చను జేయునప్పుడు జపించునది, "ఓం నమశ్శివాయ" యను మంత్రము. మంత్ర శాస్త్ర పరిచయము కలవారికి నర్జునుఁ డీ ప్రసాద పంచాక్షరిని జపించుట లోని యౌచిత్యము గమ్యమగును. ప్రసాద పంచాక్షరిలోని "హ్రీం" యను బీజమున హ కార,, రకారములను రెండు వర్ణములు కలవు. ఇందు హ కారము శివాత్మకము. రేఫ మగ్ని దేవతాత్మకము. శత్రు సంహారాభిలాషి కావున, నగ్ని దేవతాత్మకమైన యీ వర్ణముతోడి బీజమునను సంధించి యర్జునుఁడు పంచాక్షరిని జపించినాఁడు. ఆగమవేత్తయై మంత్ర మహోదధిని, జాలుకించిన మనీషి శేఖరుఁడు కావుననే శ్రీనాథుఁ డిచ్చట నిట్లు వ్రాసినాఁడు. ఇట్టి విశేషము లాయన మిగిలిన కావ్యములు

ముఖ్యముగాఁ గాశీఖండమునఁ జాల చోటులఁ గన్పించును. ఆయా శాస్త్రముల నధికారము గల పండితులు వానిని వివరించిన మంచిది.

తత్తత్ సన్నివేశములు కన్నులకుఁ గట్టునట్లు రసవత్తరముగఁ జిత్రించుటయందును శ్రీనాథుఁ డీ కథలో విశేష ప్రజ్ఞనుఁ బ్రదర్శించినాఁడు. దీని కింద్రార్జునుల సంవాదమును కిరాతార్జునుల వివాదమును దృష్టాంతములు. అందును తొలి సన్నివేశము కవిసార్వభౌముని స్వతంత్రతను, పరిహాస కుశలతనుఁ బట్టి యిచ్చుచున్నది. కన్నడ భారతకర్త యగు కుమార వ్యాసుడును, కిరాతార్జునీయ ప్రణేత యగు భారవి మహాకవియును నీ కథాభాగము నింత హృద్యముముగ రచింప వలఁతులు కాఁజాలక పోయిరి. కుమార వ్యాసుని రచనమునుఁ జూడుఁడు :

"అరస కేళ్ళై విప్రవేషవ
ధరిసి ధరె గిళిదను సురేశ్వర
తర హరిన దీమాత నెందను నిజకుమారంగె
మరిచ మౌక్తిక లోహ హేమా
భరణ చర్మదుకూల మిళిహా
దరియ హూవిన దండెగేక నివాస వేకెంద
ఆవనేరికె జపకె చాప శ
రావళిగె శమె దమెగె ఖడ్గకి
దావ సమ్మేళన విభూతిగె కవచ సీస కకె
ఆవు దిదరభిధాన తప వో
డా వరిగ విద్యా సమాధియో
నీ విదెంతహ బుషి గళెంబుద నరియ నా నెంద.
—మహాభారత.

ఇచ్చట మహాకవి యని కన్నడ నాడున వాసికెక్కిన కుమార వ్యాసుని రచనమున విశేషమేమియును లేదు. అట్లే సంస్కృతమున భారవి రచనయును నిస్పట్టున నిర్విశేషము, అతని కావ్యమున నింద్రుఁడు:

"జీయంతాం దుర్జయా దేహే
రిపవశ్చక్షురాదయః
జితేషునను లోకోయం
తేషు కృత్స్నస్త్వయాజితః."

అని యింద్రియ జయమును గుఱించియును, శమదవఁములను గుఱించియును, మోక్షసాధనమును గుఱించియును నొక సుదీర్ఘోపన్యాసమును నిచ్చును. అచ్చట నింద్రుఁడు వట్టి శుద్ధ శ్రోత్రియుఁడు. పరిహాస ప్రౌఢిమ యాతని వాక్కులలోఁ గనుపింపనే కనుపింపదు. కాని, శ్రీనాథుని యింద్రుఁడో చాల గడుసరి. మంచి మాటకారి. ఎదిరి హృదయమును నొక యూపు నూపి చూచువాఁడు. అతని వేషమును, నతని మాట తీరును నొక పట్టున మనము మఱచిపోలేము. చూడుఁడు.

తెల్లని గడ్డంబు తెల్లని మీసముల్
నరసిన రోమపాండురశిరంబు
మేధావి బొట్టును మెఱుఁగు జన్నిదములు
భూతి లలాట త్రిపుండ్రకంబుఁ
గావిదోవతియును గంధోత్తరీయంబు
నిష్టికోలయుఁ జంక నిత్తితోలుఁ
బంచాంగ ముష్టియుఁ బాణి పవిత్రంబు
నొక్క వ్రేలికి వెండి యుంగరంబు
జాఱు బొజ్జయుఁ గుశదర్భ సంబెళయును
నెడమ చేతను నిడుగోల గొడుగుదాల్చి
తనకు సజ్ఞాతిగా నొక్క తపసి వృద్ధ
బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యయ్యఁ బార్థు కడకు.

భూతిత్రిపుండ్రకము, పంచాంగ ముష్టి ఇవి యన్నియును మనము నిత్యమును చూచు శ్రోత్రియ బ్రాహ్మణ పురోహితుల రూపమును సాక్షాత్కరింపఁ జేయుచున్నవి. భారవి వృద్ధ బ్రాహ్మణ వర్ణనము కృత్రిమమైన యలంకార భారమునఁ గ్రుంగిపోయి సహజత్వమునకు దూరమైనది. కుమార వ్యాసుఁ డన్ననో—యాతఁడు సముచితమైన రూపకల్పననే చేయలేకపోయెను. శ్రీనాథుఁడు వర్ణించిన యా వృద్ధ బ్రాహ్మణుని వేషమును చూచితిమి. ఇంక నాతనివచో వైదగ్ధ్యమును గమనింపవలయును. తన్ను గుఱించియే తప మొనరించుచున్న నర్జునుని నాతఁ డెట్లు నిరుత్సాహ పఱచెనో చూడుఁడు. వ్యాస భారవుల నీ ఘట్టమున శ్రీనాథుఁడు క్రిందు పఱచినాఁడు.

"ఈశ్వరునిఁ గూర్చి చేసెదవేని లెస్స
మాధవుని గూర్చి చేసిన మాకు హితవు
బ్రహ్మ గూర్చి చేసిన నది ప్రార్థ్యతరము
తగునె ? యిల వజ్రధరు గూర్చి తపముసేయ?

ఎవ్వఁ డుపదేశమిచ్చె నీ కింద్రు గూర్చి
తపము సేయుము నీ వంచు దయతలిర్ప
నాతఁ డెఱుఁగఁడొ కాక యా యద్రిభేది
గౌతముని యింటఁ జేసిన కామ గోష్ఠి.

ఆ సహస్రాక్షుని యాత్మ సంశుద్ధికిఁ
బరమ సంయమి యింటి పంచసాక్షి
ఆ నిర్జితేంద్రు బాహా విక్రమమునకు
భుజగాంతకుని యాకపోక సాక్షి

ఆ సునాసీరు నహంకార గరిమకు
నిషధాచలము మీది నెలవు సాక్షి
ఆ శచీవల్లభు నౌచిత్య కంసకుఁ
దాపను చేతి పూదండ సాక్షి
యిట్టి దేవేంద్రు గూర్చి నీ వింత తపము
చేసి పడసెదవేమి వాంఛిత ఫలంబు
వాఁడు నీకంటె నేమిట వాసి గల్వఁడు
తగదు చాలింపు మీ విరుద్ధపుఁ దపంబు.

ఇంద్రుఁ డిట్లు తన్ను విమర్శించి నిందించికొనుట నాథుఁడు చేసిన సరసమైన మార్పు. ఇందు మొదటి పద్య లో మాధవుఁడను శబ్దమునకు విష్ణువను సాధారణార్థము “మా” ధవుఁడు (మా ఏలిక) యని యర్థము వచ్చును. యేలికను గురించి తపము చేయుట మాకును హితమని ర్థాంతము. రెండవ పద్యమున శ్రీనాథుని సుకుమార పరిహాస చతురత వ్యక్తమగుచున్నది. ఆ కావు “గోష్ఠి” యను ప్రయోగము కూడ శ్రీనాథుఁడు స్వతంత్రముగా సృష్టించినదే. ఈ దృక్ప్రయోగము లెన్నో యాతని కావ్య ప్రపంచమున మనకు దర్శన మిచ్చును. వానిని వివరించుట కిది సమయము కాదు. ఏవంవిధ సుకుమార పరిహాస వచో వైచిత్రి తెలుఁగు సాహిత్యమునఁ బలువుర కబ్బలేదనుట మాత్రము నిశ్చయము. ఇక్కఁ డుది పద్యములోని “వాడు నీకంటె నేమిట వాసి గలుఁడు” అనఁ నెత్తిపొడుపులో శ్రీనాథకవి సార్వభౌముని నిండైన తెలుఁగు తనము తొణికిస లాడుచున్నది. ఇట్లే యుదాహరించుకొనుచు పోయిన నీ కిరాతార్జునీయములోనే యెన్నో పద్యములను నుదాహరింపవలసి వచ్చును. శ్రీనాథుని తెలుఁగుకారి కవితా జనుటకీ ఘట్ట మొకటి చాలును. కిరాతార్జునీయము “హర విలాస” మహాకావ్యమున కనర్ఘమైన మణిమకుటము.



# ప్రజలు: ప్రభుత్వం

శ్రీ జాన్ స్ట్రాచీ*



నేడు ప్రపంచంలో కమ్యూనిస్టు రాజ్యాల వ్యవస్థను బలపరచే వారికి, పశ్చిమ రాజ్యాల వ్యవస్థను బలపరచేవారికి మధ్య ఎడతెగని బహుముఖ చర్చ సాగుతున్నది. ఈ ఉపన్యాసాలు ఆ చర్చా భాగాలు.

ఈ చర్చ మనిషికి సంబంధించిన అన్ని విషయాలను తరుస్తుంది .... ఈ రెండు వ్యవస్థల ఆర్థిక రాజకీయ లక్ష్యాలను, వాటి జయాపజయాలను, అవి అనుసరించే ఉత్పత్తి

---

* శ్రీ స్ట్రాచీ పూర్తి పేరు ది రైట్ ఆనరబుల్ ఎవిలియాన్ జాన్ సెయింట్ లియో స్ట్రాచీ. బ్రిటిష్ లేబర్‌పార్టీ ప్రముఖుడుగా, సోషలిస్టు వ్యాఖ్యాతగా ప్రసిద్ధి చెందాడు. 61 వ ఏట (1963 జులై 15 న) కాలధర్మం చెందాడు. ఆయన మరణం ప్రజాస్వామిక సోషలిస్టు ఉద్యమం మొత్తానికి తీరని నష్టంగా అందరూ భావించారు.

రాజకీయవాదిగా మాత్రమే కాక, గ్రంథకర్తగా, వ్యాసకర్తగా కూడా శ్రీ స్ట్రాచీ ప్రపంచ మేధావుల దృష్టిని ఆకర్షించాడు. ఆయనది పండిత కుటుంబం. తండ్రి సెయింట్‌లో స్ట్రాచీ. "ది స్పెక్టేటర్" పత్రికకు సంపాదకుడు, యజమాని. జీవిత చరిత్రల రచయితగా ప్రసిద్ధిచెందిన లిట్టన్ స్ట్రాచీ కూడా ఈ కుటుంబంవాడే.

జాన్ స్ట్రాచీ ఏవిధంగా చూచినప్పటికి 'ఈ శతాబ్దపు 'బిడ్డ'. ఆయన జన్మించిన నాటికి (1901) వున్న భద్రత కలిగిన ప్రపంచ వ్యవస్థ, ఆయన పెరిగి పెద్దవాడయ్యే నాటికి బీటలు ఇచ్చింది. పరిణామం చెందుతున్న పరిస్థితుల ప్రభావానికి గురి అయినాడు. సోషలిస్టు భావకుడుగా రూపొందాడు. పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికైనాడు. ప్రభుత్వంలో బాధ్యతగల పదవులు నిర్వహించాడు. ఈ పరిణామాలన్నీ ఆయన రచించిన గ్రంథాలలో స్పష్టంగా కానవస్తాయి. ఉత్తమ నవ సమాజ నిర్మాణం పట్ల ఆయనతరం వారిలో ఉన్న, మహోన్నతమైన ఆవేశాలకు చిహ్నంగా ఆయన గ్రంథాలు ప్రచారంలోకి వచ్చాయి. ప్రజాస్వామిక సోషలిజానికి మూల గ్రంథాలు అయినాయి. వీనిలో "ది కంటెం పోరరీ కేపిటలిజం"—"ది యండ్ ఆవ్ ఎంపైర్" అనేవి ప్రముఖంగా పేర్కొనదగినవి.

శ్రీ స్ట్రాచీ కేవలం గ్రంథకర్త మాత్రమే కాదు. మంచి వక్త. ప్రముఖ చరిత్రోపన్యాసకుడు. ఆయన గ్రంథాల వలెనే, ప్రసంగాలు కూడా విషయ వివరణకు, కూలంకష పరిశీలనకు, వాదనాపటిమకు, సమకాలీనమైన చారిత్రక దృష్టికి నిలయాలు. వీనిలో "The Great Awakeing" అనే శీర్షిక కింద ఇచ్చిన ప్రసంగాలను "మహత్తర పరివర్తన" అనే శీర్షిక క్రింద "భారతి" ప్రచురించింది. "The challange of Democracy" అనే శీర్షికకింద వచ్చిన ప్రసంగాలను ఇప్పుడు ప్రచరించట మవుతున్నది. —భా. సం

విధానాన్ని, రూపొందించే రాజకీయ పద్ధతిని—తరుస్తుంది. ప్రపంచం మొత్తంమీద ఈవిధమైన చర్చ జరగడం అద్భుతమైన విషయం. ఎందుకనంటే, మానవజాతి వ్యవహారాలను గురించి ప్రపంచ ప్రజ మొత్తం ఆలోచింప జేయడానికి, మొట్టమొదటి సారిగా ప్రయత్నించటం అవుతుందన్న మాట. ఈ చర్చ వేదాంతాన్ని గురించి చేసే చర్చ వంటిది కాదు. ప్రపంచ ప్రజలలో వీలైనంతమందిని తమవైపుకు తిప్పుకొనడానికి పోటీ ప్రయత్నమే ఈ చర్చ. పశ్చిమదేశ ప్రభుత్వాలు, కమ్యూనిస్టు దేశ ప్రభుత్వాలు ప్రథమంగా తమ ప్రజల మనస్సులను జయించవలసి ఉన్నది. తర్వాత తమ ప్రతిపక్ష రాజ్య ప్రజల మనస్సులను జయించవలసి ఉన్నది. ఆ తర్వాత వీటన్నింటికంటె ముఖ్యమైన సంగతి—ఏ పక్షానికీ చెందకుండా, తటస్థంగా ఉన్న ప్రజలను తమ వైపుకి తిప్పుకొనడం. ఇలా తటస్థంగా ఉన్నవారి సంఖ్య ఉభయ పక్షాలవారికన్నా ఎక్కువ.

ఇది చాలా బాగుంది. అయితే ఈ చర్చ జరిగే పద్ధతి మాత్రం బాగున్నదని అనలేను. నిజానికి ఇంతకంటె చెడుగా జరగదనవచ్చు. ఇంతవరకు ఈ చర్చ ఎక్కువగా పరస్పర దూషణ. అంతే గాకుండా, కొన్ని ప్రభుత్వాలు ప్రతిపక్షాల వాదాన్ని తమ ప్రజలు వినకుండా ఆటంకం కలిగించడం కూడా ఈ చర్చలో ప్రధాన భాగం. ముఖ్యంగా ఈ విషయంలో పశ్చిమ రాజ్యాల వైఖరి కన్న, కమ్యూనిస్టు రాజ్యాల వైఖరి గర్హ్యణీయమని నేను చెప్పక తప్పదు. బహుశా నేను పశ్చిమ రాజ్యానికి చెందిన వాడిని కాబట్టి నా కిలా అనిపించవచ్చు. కమ్యూనిస్టు దేశాలలో ప్రజలు పశ్చిమ రాజ్యాలు చెప్పేది వినకుండా చేయడం (రేడియో ప్రసంగాలు వినిపించకుండా "జావ్" చేయడం) చూస్తే అది కమ్యూనిస్టు రాజ్యాల బలహీనతకు చిహ్నంగా నాకు తోస్తున్నది. పశ్చిమ రాజ్యాలలో కూడా కొన్ని వర్గాలు ఇంత చెడ్డగాను వ్యవహరిస్తున్నాయి. వారు కమ్యూనిస్టు రేడియో ప్రసంగాలు విన్నా, కమ్యూనిస్టు పుస్తకాలు చదివినా, తమ ధోరణి తమదే కాని, వారేమి చెబుతున్నారనేది తెలుసుకొనడానికి కూడా ప్రయత్నించరు. పశ్చిమ రాజ్యాలవారు కొంతమంది, అమెరికనులు ఈ తరహా వారని నా అభిప్రాయం. ఈ దేశాలలో పై తరగతి వారికే కాక, కాయకష్టం చేసే కార్మికులకు కూడా ఇలాంటి తత్వం ఉంది.

ఈ విషయాన్నే స్వలాభం కోసమే కమ్యూనిస్టు ప్రచారకులు గమనించితీరాలి. వారు గనుక దానిని గురించి పర్యాలోచిస్తే, వా రనుకొనేటువంటిది ఒకటి, ఈ ప్రపంచంలో జరుగుచున్నదనేటటువంటిది చూడగలుగుతారు. ఏది ఎలా ఉన్నా ఈ గుడ్డితనం, ఈ చెవిటితనం, ఈ బండతనం ప్రపంచం మొత్తం మీద జరిగే ఈ చర్చలో ఎక్కువ భాగాన్ని వెలితిగా, విసుగుగా తయారుచేస్తుంది. చర్చలో పాల్గొనేవారు ప్రత్యక్షంగా ముఖాముఖిని వాదించుకొనడం జరగదు. అయినప్పటికి మహనీయమైన ఈ చర్చ జరుగుతూనే ఉంటుంది. మనం భస్మీపటలం అయితే తప్ప, ఇది సాగక తప్పదు. ఈ చర్చ ఎంత తక్కువ స్థాయిలో జరిగినా, మనం భస్మీపటలం అవడం కంటె, ఉత్తమమైనది.

మన మిప్పుడు చర్చించవలసింది ప్రజా ప్రభుత్వం సంగతి. ఈ సందర్భంలో విచిత్రమైన విషయం ఏమిటంటే ఇరు తెగలవారు తమవే ప్రజా ప్రభుత్వాలు అంటారు. ఎదిరి పక్షం వారివి కాదంటారు. దానినిబట్టి ఒకటి చెప్పుకోవచ్చు. అదేమిటంటే, ఉభయ పక్షాలు తమవి ప్రజా ప్రభుత్వాలని చెప్పటం మూలాన, ప్రజా ప్రభుత్వం అనేది చాలా ముఖ్యమైనదని, వాంఛనీయమైనదని తెలుస్తున్నది. లేకపోతే తమది అవునని, ఎదిటివారిది కాదని అనరు. ప్రజా ప్రభుత్వం అనేది మానవ సమాజం పొందితీరవలసినదే నని, ప్రతి ఒక్కరూ అనుకుంటారనేది తేలింది. అయితే ప్రజా ప్రభుత్వం అంటే ఎవ్వరి నిర్వచనం వారు ఇస్తున్నారు. వారివారి రాజకీయ, ఆర్థిక విధానాలకు వేర్వేరు లక్షణాలు ఉన్నవి. కాబట్టి ఏ నిర్వచనాన్ని బట్టి కూడా ఉభయుల ప్రజా ప్రభుత్వం ప్రజా ప్రభుత్వం కాజాలదు. ఈ ప్రపంచ చర్చలో ఈ ఉభయ పక్షాల వాదాలను పరిశీలించడమే ఈనాటి ఉపన్యాసాల ఉద్దేశ్యం. నేను ఒక రాజకీయవాదిని. ఒక సిద్ధాంతాన్ని బోధించే ఆచార్యుణ్ణి కాదు. కాబట్టి మీరు గనుక ప్రజా ప్రభుత్వం చరిత్రను గురించి, ప్రాచీన కాలంలో ప్రజా ప్రభుత్వ స్థితిని గురించి, గ్రీసు పట్టణ రాజ్యాన్ని గురించి, లేకపోతే రూసో సిద్ధాంతాన్ని గురించి నేను ఉదాత్తమైన ఉపన్యాసం ఇస్తానని అనుకుంటే మీకు చాలా ఆశాభంగం కలుగుతుంది. ఈ ఇరవయ్యో శతాబ్ద మధ్య కాలంలో ప్రజా ప్రభుత్వ మంటే, మనం అనుకొనే దానిని గురించి మాట్లాడతాను.

ఏమైనా ప్రజా ప్రభుత్వం అంటే, ఏదో ఒకటి అనుకొని ఉండాలి. ఎందుకనంటే, ఫలాన దేశం ప్రజా ప్రభుత్వం అని, ఫలానిది కాదని విడవకుండా చెబుతున్నాము. కమ్యూనిస్టులు కొన్ని దేశాలకు, పశ్చిమ రాజ్యాలు కొన్ని దేశాలకు ప్రజాప్రభుత్వమనే బిరుదును ఇస్తున్నాయి. కాబట్టి మనం నిత్యం ఘోషించే ఈ ప్రజా ప్రభుత్వం అంటే మన అర్థం ఏమిటి ? నేను ఒక దేశాన్ని ప్రజా ప్రభుత్వము అనే పేరుతో పిలిస్తే, నా ఉద్దేశ్య మేమిటో చెప్పగలను.

# ప్రజలు - ప్రభుత్వం

**తమ కే విధమైన అజ్మాయిషీ లేని అధికార సంస్థచేత పరిపాలింపబడకుండా, తమకు తామై ప్రయోజనులందరూ తమపై పరిపాలనను సాగించుకొనడానికి ప్రయత్నించేది ప్రజాప్రభుత్వం.**

ఈ నిర్వచనం చేసే సందర్భంలో ఒక విషయం చెప్పాలి. ప్రజలు తమను తాము పరిపాలించుకొనడం చాలా కష్టమైన సంగతి. మన మోస్తరు ఆధునిక సమాజంలోనే ఇంత వరకు ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా నైనా ప్రజలు తమకు తామై పాలించుకొనడం జరిగింది. అంటే తమకు ఇష్టమైన ప్రభుత్వాన్ని వరించగలగడమే తమకు తాము పరిపాలించుకొనడం అని నా ఉద్దేశ్యం. పరోక్షమైనటువంటి ఈ స్వప్రభుత్వం ఏర్పాటుచేసుకొనడానికి కూడా చాలా సున్నితమైన అప్రమత్తతతో కూడిన సాంఘిక ఏర్పాట్లు కావలసి ఉన్నవి. ఈమాత్రపు పరోక్ష స్వప్రభుత్వం సాగించడం కూడా చాలా గొప్ప విషయం. వాస్తవానికి ఈవిధమైన ప్రభుత్వాన్ని స్థాపించి, పోషించి అభివృద్ధి చేయడం ఏవిధమైనటువంటి ఆర్థిక విధానాన్ని స్థాపించాలనే దానికంటే, ప్రధానమైన విషయంగా నేటి ప్రపంచ ప్రజా జీవితంలో ప్రధానమైనదనే విశ్వాసం నాకు కలిగింది.

నే నిపుడు ప్రజా ప్రభుత్వమని నిర్వచించినది, సాధారణంగా ప్రజా "ప్రాతినిధ్య ప్రభుత్వమని" పిలవబడుతుంది. ఈ ప్రాతినిధ్య ప్రభుత్వము ప్రజాస్వామ్య ప్రభుత్వ లక్షణాలలో ఒకటనవచ్చు. మీరు తక్షణం అడ్డు చెప్పవచ్చు. ఆ విషయంలో మీతో నేనూ ఏకీభవిస్తాను. అయితే ప్రజా ప్రభుత్వానికి ప్రాతినిధ్య ప్రభుత్వం గుండెకాయ వంటిది. మిగతా లక్షణాలన్నీ దీనిని అనుసరించే ఉంటాయి. వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, సభా స్వాతంత్ర్యము, చట్టబద్ధమైన పాలన, ఇవన్నీ కూడా నిలవటానికి ప్రాతినిధ్య ప్రభుత్వము మీదే ఆధారపడతాయి. పెద్దగా కనబడే ఈ మాటల తాత్పర్యమేమిటో చూద్దాము. ఏవిధమైన ఆటంకంలేకుండా స్వేచ్ఛగాజరిగే ఎన్నికలందు పాల్గొనే వారిలో తమ క్లిష్టమైన వారిని ప్రభుత్వాధికారములో ఉంచటానికి ప్రజలకు హక్కు ఉండటమే ప్రాతినిధ్య ప్రభుత్వమని నా అభిప్రాయము. తరువాత జరిగే ఎన్నికలో ఇంతకుముందు ప్రతిష్ఠించిన ప్రభుత్వాన్ని తొలగించి మరొక ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించే అధికారాన్ని కలిగియుండటమూ, అలా ప్రతిష్ఠించిన ప్రభుత్వంపైనకూడా ప్రజలు కొంత అధికారాన్ని కలిగియుండటము కూడా దాని లక్షణము. ప్రాతినిధ్య ప్రభుత్వం ఇలా ఉంటేనే, నిత్య జీవితంలో అతి ముఖ్యమైన, అవసరమైన కొన్ని ఫలితాల్ని సాధించగలము. అంటే తోటివారితో కలిసి, వేతనాలను గురించి బేరం చేయగలిగి ఉండడము, విచారణలేకుండా నిర్బంధంలో ఉంచకుండా చెయ్యడము, కొన్ని స్థూల నియమాలకు లోబడి మన కిష్టము వచ్చినది వ్రాయగలగటం, దానిని ప్రచురించగలగటం, ఇష్టం వచ్చినది మాట్లాడటం, ఇవన్నీ ప్రాతినిధ్య ప్రభుత్వంలోనే సాధ్యమవుతాయి. ప్రజలు తమ కిష్టమైన ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించగలిగినపుడే అతి ప్రధానమైన ఈ హక్కులన్నీ ప్రాప్తిస్తాయి.

ప్రజా ప్రాతికూల్య వాదాన్ని గమనిద్దాము. తాము కోరిన ప్రభుత్వాన్ని ఏర్పరచుకోగలగటం అనేది ప్రజలకు పెద్ద ప్రధానమైన విషయం అని ఎందుకు అనుకోవాలి ? నిర్ణీతమైన కాలంలో దాన్ని తొలగించటం, ఉన్నన్నాళ్లు దానిపైన కొంత అజ్మాయిషి చలాయించటము గొప్పగా ఎందు కనుకోవాలి ! సమాజ నిర్వహణను ప్రత్యేక ప్రావీణ్యులకు (Few-proffesional Rulers) లకు-ఎందుకు వదలకూడదు ?

పైన వర్ణించిన హక్కులు, స్వేచ్ఛ, మొదలైనవి ప్రాతినిధ్యప్రభుత్వసూత్రంపైననే ఎందుకు ఆధారపడిఉండాలి? ప్రజల చపలచిత్తం మూలాన కలిగే అంతరాయం లేకుండా, పరిపాలన కేవలం ప్రావీణులకు వదలితే మంచిది కాదా ? తమ జీవిత పరిస్థితులనుబట్టి సామాన్య ప్రజలకు ప్రజా వ్యవహారాల గురించి ఆలోచించటానికి వ్యవధి ఉండదు. ప్రవీణులైన వారికి జనబాహుళ్యం కంటె ఎక్కువ అనుభవం, ప్రాజ్ఞత, విద్యా ఉంటాయి. కాబట్టి ప్రభుత్వం వారి పరం చేయటం మంచిది కదా ?

ఈ ప్రశ్నలకు సమాధాన మివ్వటానికి మనకి పూర్వానుభవం తగినంత ఉన్నది. ఇలాంటి ప్రవీణులకు ప్రభుత్వం అప్పజెప్పితే నడిచే పద్ధతిలోనే, పరిపాలన అనేది, అనాదిగా అన్ని దేశాలలోనూ జరుగుతూ వచ్చింది. రాజులు, మత గురువులు, జమీందార్లు, భూస్వాములు, వర్తకులు, ధన స్వాములు, ఉద్యోగులు—వారిని ఏ పేరుతో పిలిచినా సరే, మొన్నటి వరకు పరిపాలించారు. మొత్తం జనబాహుళ్యం వారి పైన ఏవిధమైన అజమాయిషి లేకుండా వారికి తలొగ్గింది. వారిని తొలగించి మరొకరిని ప్రతిష్ఠించే అధికారం అనేది లేకపోయింది. ప్రజా ప్రభుత్వ ప్రతికూల వ్యవస్థలను గురించి మనకి కావలసినంత అనుభవం వచ్చింది. వాటికి వైముఖ్యం ఏర్పడడానికి—అలాంటిది అవసరమైతే—తగిన వ్యవధి వచ్చే

ఉన్నది. అలాంటిది ఇప్పటికి వ్యక్తమైనది కూడాను. ప్రజా ప్రభుత్వ ప్రతికూల వ్యవస్థలు అప్పుడప్పుడు ఉత్తమంగా పని చేసినా మొత్తంమీద జనబాహుళ్యం దృష్ట్యా చూస్తే అతి హీనంగా పనిచేశాయనే చెప్పాలి. అవి బాగా పనిచేశాయా, చెడుగా పనిచేశాయా అనేది ఎలా ఉన్నా వాటి విషయంలో ఒకటి మట్టుకు నిజము. ఎక్కువగానో, తక్కువగానో వారి పాలకులందరూ వారి ప్రజల శ్రేయస్సు కోసం వ్యవహరించ లేదు.. అంటే, వారు స్వలాభం కోసం వ్యవహరించారు గాని, ప్రజా శ్రేయస్సును అభిలషించి వ్యవహరించలేదని నా అభిప్రాయం. ఇదే ప్రజా ప్రతికూల వ్యవస్థలకు గడ్డు అయిన ఆటంకం అవుతుంది. కఱడుగట్టిన కమ్యూనిస్టు, ఉబ్బిపోయే పశ్చిమ ప్రజాస్వామికవాది ఈ విషయమై ఏకీభవిస్తారు. మీరు కనుక ఇప్పుడు నేను నిరూపించిన వాటితో ఏకీభవిస్తే మీరు రెండు నిర్ణీత అభిప్రాయాలకి రావలసి ఉంటుంది.

ఇందులో మొదటిది—ఒక దేశ ప్రజ సవ్యంగా పాలించబడాలంటే, అనగా వారి శ్రేయస్సు కొరకే పరిపాలన అయితే వారికి వారే పరిపాలన చేసుకొనే పద్ధతిని కనిపెట్టక తప్పదు. ఎందుకనంటే మరింకొకరెవరూ ఆపని చేయరు. స్వపరిపాలనకు తృప్తికరమైన ప్రత్యామ్నాయ మంటూ లేదు. ఎందుకనంటే అన్యుని ప్రభుత్వం అనేటప్పటికి, అదెవరిదైనా, అన్యుల శ్రేయస్సుకే పనిచేస్తుంది. ప్రభుత్వ బాధ్యతను ఒక వ్యక్తికి గాని, ఒకే పార్టీకి గాని అప్పజెబితే వారు అధికారాన్ని స్వప్రయోజనం కోసమే వినియోగిస్తారు. కాబట్టి పరోక్షంగానైనా సరే ప్రజలు తమకు తాము పరిపాలించుకొనే పద్ధతిని నిర్మించుకొనగలిగితే, అది ఒకటే కొంత కాకపోతే కొంతవరకైనా తృప్తినిచ్చే ప్రభుత్వం కాగలదు. తమ శ్రేయస్సు అనేది ఏమిటో తెలుసుకోగలిగిన పరిస్థితికి ప్రజలు పెరిగారు. అందుకని ఇతరుల శ్రేయస్సుకోసం పనిచేసే పాలనకు ఎల్లకాలం తలొగ్గి ఉండరు. మానవ వ్యవహారాలలో ప్రజా ప్రభుత్వమనేది ఉదాత్తమైన, విప్లవాత్మకమైన ప్రయోగం. దీనికి ప్రాతినిధ్య ప్రభుత్వం గుండెకాయ వంటిది. పెద్ద ఎత్తున ప్రజా పాలన సాగించడానికి చేసే ఈ ప్రయత్నము నేడు ప్రపంచ మంతటికీ ఒక సవాలుగా ఉన్నది. ప్రపంచము ఈ సవాలును అంగీకరించి విజయం పొందుతుందో, లేదో గట్టిగా చెప్పలేము. కాని, ఈ ప్రయత్నంలోని జయాపజయాల మీదనే ప్రపంచ గతి ఆధారపడుతుంది.

ఆదర్శప్రాయమైన ఇట్టి ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించడానికి గత రెండువందల సంవత్సరాలుగా ప్రయత్నించడం జరుగుతూ ఉంది. ప్రాచీన కాలంలో ఉన్న గ్రీకు పట్టణ రాజ్యాలను నేనెప్పుడూ ప్రజా ప్రభుత్వాలుగా ఎంచలేదు. బాగా ఉన్నత స్థాయిని అందుకున్నప్పుడు కూడా ఏథెన్సులో నిజానికి కొన్ని కుటుంబాల పరిపాలనే సాగింది. రెండు తరాలుగా తల్లి—దండ్రులు ఇద్దరు ఏథెన్సు పౌరులుగా ఉన్నవారి స్వేచ్ఛా పురుష సంతతికే (Free male) ఓటింగు హక్కు ఉండేది. బానిసలైనవారు మొత్తం జనాభాలో నూటికి 90 మంది ఉండేవారు. వీరు కాక చాలామంది విదేశీయులు ఉండేవారు. కాబట్టి అసలు ఓటు కలవారు పురుష జనాభాలో నూటికి పదిమంది ఉండేవారు. అందుకని ఇది కొందరి పరిపాలనగాని, అందరి (ప్రజా) పరిపాలన కాదు.

నేను నిర్వచించే ప్రజాప్రభుత్వం రెండు వందల సంవత్సరాల క్రిందటనే ఆరంభమై, పరిణామం చెందుతూ వచ్చింది. ఈ సందర్భంలో స్థిరమైన సన్నివేశాలు 1776 లోని అమెరికా విప్లవం, 1789 లో ఫ్రెంచి విప్లవము, 1832 లో వచ్చిన ఇంగ్లండు రిఫారం బిల్లు అని నా అభిప్రాయం. వీటిలో ఏ ఒక్కటి నేను చెప్పింది—అంటే వయోజను లందరూ ఎన్నికల ద్వారా తమకు కావలసిన ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించ గలగడం—చేయలేదు. అలా ప్రతిష్ఠించడానికి అనువైన సంఘ నిర్మాణానికి ఇవి దోవ తీసినవి మాత్రమే అని చెబుతాను. నేను ప్రజా ప్రభుత్వం అని పిలవడానికి ఇష్టపడేది ఈమధ్యనే వచ్చింది. నా స్వదేశమైన బ్రిటన్‌ని కూడా 1918 వరకు ప్రజా ప్రభుత్వమని అనడానికి వీలులేదు. (అసలు ఓటింగు హక్కు అనేది 1929 వరకు పూర్తిగా విస్తరించబడలేదు.) 19 వ శతాబ్దం ఉత్తర భాగంలో ఫ్రాంసు, కొన్ని భాగాల అమెరికా, బ్రిటన్ కంటే ఎక్కువ ప్రజాస్వామికంగా ఉన్నాయని చెప్పవచ్చు. అక్కడ కూడా కేంద్రంలో నిజమైన ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పడింది మన తరంలోనే. ఇప్పుడు కూడా అమెరికాలో గాని, ఫ్రాంసు, జర్మనీలలోగాని మరి ఏ ఇతర ప్రజా ప్రభుత్వ దేశాలలోగాని, ప్రజా వ్యవస్థ నిర్దుష్టంగాను, పరిపూర్ణంగాను ఉన్నదని చెప్పలేము. అవి ఇంకా పెరుగుతూనే ఉన్నవి. మన మింకా ప్రయోగ దశలోనే ఉన్నాము. వాటిని ఇంకా దిద్దుతూనే ఉన్నాము. ఇంతేకాదు. వాటికి హాని కలిగే ప్రమాద స్థితి కూడా ఉన్నది. అవి వెనక్కు నెట్టివేయబడవచ్చు. మహా ఉపద్రవాలను ఎదుర్కొనవచ్చు. అయినప్పటికి, ఆదికాలంనాటి మూడు ప్రధాన ప్రజాస్వామిక దేశాలు—అమెరికా, ఫ్రాంసు, బ్రిటన్—తమకు తగిన ప్రజాస్వామిక సంస్థలను ఏర్పరచుకొనడంలో చాలవరకు విజయం పొందినవి. వానినే విశేషంగా ఇతర దేశాలు అనుకరించాయి.

# ప్రజలు - ప్రభుత్వం

నేడు ప్రపంచమంతటా— అయిదు ఖండాలలోను— ప్రజా ప్రభుత్వాలను స్థాపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. దీనిని కాదనడానికి వీలులేదు. తాము ప్రతిష్ఠింపగలిగిన, తొలగింపగలిగిన, అజ్మాయిషీ చేయగలిగిన ప్రభుత్వాలను ఏర్పరచడానికి ప్రతిదేశము ప్రయత్నిస్తున్నది. ఇది అపూర్వమైన విషయము. ఈ ప్రయత్నాలన్నీ జయప్రద మౌతాయని చెప్పలేం. అంతేగాదు—ఆ ప్రయత్నాలు విఫలం కూడా అవచ్చు. కాని ప్రజలు మాత్రం ప్రజా ప్రభుత్వ వ్యవస్థ స్థాపనకు తెగించి ముందుకు వెడుతున్నారు. దానిని స్థాపించి నిర్వహించగల శక్తి వారికి లేకపోవచ్చు. దాని నిర్వహణ చాలా కష్టం. అయితే దాని విలువ వెలలేనిది.

వర్తమాన కాలంలోని సంఘటనలను గురించి భవిష్యత్ చరిత్రకారుడు వ్రాసినప్పుడు, ప్రజా ప్రభుత్వ స్థాపనకు నేడు ప్రపంచ మంతటా జరుగుచున్న ప్రయత్నములే, అతి ప్రాముఖ్యమైన సంఘటనలుగా కనబడతాయి. ఈనాడు ఆర్థిక వ్యవస్థలను గురించి జరుగుతున్న ఘర్షణల కంటె కూడా ప్రజా ప్రభుత్వ వ్యవస్థల స్థాపనా ప్రయత్నమే ప్రధాన మైనదిగా తేలుతుంది. ఏది ఉత్తమమైన ఆర్థిక వ్యవస్థ అనే విషయము అప్రధానమని కాదు. వాస్తవానికి నిర్వహణ సాధ్యమైన ఆర్థిక వ్యవస్థను ఏర్పరచడం ముఖ్యావసరం. అసలు దాని నిర్మాణం జరిగితే కాని, రాజకీయ వ్యవస్థలను గురించి ఆలోచించడానికి ఓపిక ఉండదు. క్షుద్బాధకు గురి అవుతారు. కాబట్టి ప్రజా ప్రభుత్వమైనా, నియంతృత్వ ప్రభుత్వమైనా, మరొకటైనా, అది నిలవడానికి ఆధారంగా నిర్వహణ సాధ్యమైన ఆర్థిక వ్యవస్థ ఏర్పడకపోతే అవి పనికిమాలినవై పోతాయి. నేడు కమ్యూనిస్టు ఆర్థిక పద్ధతి, పశ్చిమ ఆర్థిక పద్ధతి బాగానే నడుస్తాయనే నా ఊహ. ఈ రెండింటిలో ఇప్పు డెవ్వరెవ్వరు ఏవిధంగా నడుస్తున్నదీ తర్వాత చర్చిస్తాను. ఏది ఎట్లా ఉన్నా, పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలు తమ ఆర్థిక వ్యవస్థను ఈ రెండిటిలో ఏదో ఒక పద్ధతి ద్వారా ఆర్థిక ప్రతిష్టంభన అనేది రాకుండా చేసుకోగలరని ఆరోజు కారోజు తేలుతున్నది. ఇరవై—ముప్ఫయ్ సంవత్సరాలు గడిచేసరికి ఈ రెండు విధానాలు ఇచ్చే ఆర్థిక ఫలితాలు ఒకే విధమైనవిగా ఉంటాయని నాకు అనిపిస్తూ ఉంది.

ఈ నా అభిప్రాయం, ఈ రెండు వ్యవస్థలు సరిగా పని చేయని దేశాల వారికి, అంటే కమ్యూనిస్టు తెగకు చెందిన చైనా వారికి, పశ్చిమ రాజ్యాలకు చెందిన దక్షిణ అమెరికా దేశాం వారికి వింతగా కనుపించవచ్చును. ఈ దేశాలలో ఆర్థిక భగ్నత అనేది ప్రజల కలవరానికి కారణమౌతోంది. ఎందుకనంటే, వారి ఆర్థిక పరిస్థితి పీడాకరంగా ఉండడం. కాని, ఇరు తెగల అగ్రరాజ్యాలైన రష్యా, అమెరికా, పశ్చిమ యూరపు దేశాలలో ఆర్థిక జీవన ప్రమాణం నెమ్మదిగా, నిస్సందేహంగా ఎగుడు దిగుడుగా పెరక్కపోతేనే ఆశ్చర్యపడాలి. ఇలా అభివృద్ధి జరిగినప్పుడు ఆ దేశ ప్రజల దృష్టి ఆర్థిక వ్యవస్థ జయప్రద మైనదా, విఫలమైనదా అనే దానిమీద కాకుండా, పటుత్వమైన ప్రజా ప్రభుత్వ వ్యవస్థల పెరుగుదల మీదికి వెడుతుంది. ఈవిధంగా ఈ శతాబ్దం రెండవ భాగంలో ప్రజా దృష్టి ఆర్థిక సమస్యల నుండి తొలగి, తమ రాజకీయ జీవిత గతికి అవసరమైన వ్యవస్థల నిర్మాణం మీదికి వెడుతుంది. అంటే ముఖ్యంగా వారు తమ కిష్టమైన ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించి, తొలగించి, దానిపైన అజ్మాయిషీ చేయడానికి వీలైనట్లుగా సంఘంలో నిర్మాణం జరిగిందా అనేది వారికి ఆలోచనీయ మవుతుంది. ఇదే ప్రజా ప్రభుత్వానికి గుండె కాయ.

(సశేషము)



# జాతక బలము

శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

ప్రజా ప్రభుత్వములు గల ఈ రోజులలో రాజ వంశీలు గాని, జన్మతః రాజ వంశీయులై సర్వాధికారములతో రాజ్యమేలుతున్న ప్రభువులు గాని లేరు. ప్రజల ఆదరాభిమానములకు పాత్రులైన ప్రజానాయకులే ప్రభువులు. అట్టివారి యందును, ఆచంద్రార్క కీర్తి, ఆజన్మాంత రాజభోగము ననుసరించు మహానాయకులు ప్రపంచమందు కానరారు. కాని ప్రపంచఖ్యాతి నొందుచు బహుకాలము మహారాజతుల్యమగు పదవి ననుభవించు త్యాగమూర్తులగు మహనీయు లున్నారు. అందు కూడ మన దేశమే అగ్రస్థానము నొందుట అత్యంత గర్వ కారణము. ఇట్టి మహాభోగ ప్రాప్తికి మూలాధారమైనది జాతక బలం. వారి తరునాత, ప్రజాస్వామ్య సిద్ధాంతముల ననుసరించి నిర్ణీత కాలము మాత్రము రాజయోగ మనుభవించు జాతకు లున్నారు. వీరిలో కొంద రనుభవించు రాజయోగ కాల ప్రమాణము హెచ్చు తగ్గులు గలిగియున్నది. ఇంతకన్న జాతక బలము తక్కువగా గల ప్రజానాయకులు నిర్ణీత కాలము గూడ పూర్తిగా రాజభోగ మనుభవింపక పదవిని విసర్జించుచున్నారు. అట్టి వారిలో కొందరు కొంత కాలానంతరమున మరల రాజభోగ మనుభవించుచున్నారు. కొందర కట్టి రాజభోగ ప్రాప్తి కలుగుటలేదు. గాన ఈ తారతమ్యముల గ్రహింపవలెనన్న వారివారి జాతకములందున్న గ్రహ, భావ బలముల నెరుగుట తప్ప వేరు మార్గము లేదు. అనగా రాజయోగముల ప్రభావము పలువిధములని, పలు స్థాయీలు గలదని గ్రహింపవలెను. అట్టి రాజయోగము లెట్లేర్పడుచున్నవో పరిశీలించుటకు పూర్వము గ్రహబలము, భావ బలము, జాతక బలముల నెరుగుట ముఖ్యము. ఏ భోగమైననూ ప్రాప్తించవలెనన్న గ్రహ, భావ బలము లుండవలెను. అందు గ్రహములు గాని, భావములు గాని వివిధ రకముల బలముల గలిగి యుండుటచే వివిధ స్థాయీలు గల రాజయోగము లేర్పడుచున్నవి. బలాధికము, మధ్యమ బలము, బలహీనము, బలశూన్యత, వ్యతిరేక బలము మొదలుగాగల స్థితులు గ్రహముల ఉచ్చ, మూల త్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, సమక్షేత్ర, శత్రుక్షేత్ర, అధిశత్రుక్షేత్ర, నీచ, వక్ర, అస్తంగత్వాది వివిధ స్థితులకులోనై వారున్న భావములమీద నాధారపడి యున్నవి. పూర్ణ బలులైన గ్రహములు గూడ తమ దశాకాల మంతయు సంపూర్ణముగా శుభఫలము లీయలేకుండుట అనుభవము. అట్టి దశలలో వ్యత్యస్తములగు ఫలములు అంతర్దశ, విదశ, సూక్ష్మదశ, ప్రాణదశానాథుల బలముల, స్థితులపై నాధారపడి యున్నవి. ఈ అంశములు సమగ్రముగా పరిశీలించినగాని ఫలముల నరయ వీలులేదు. జ్యోతిష శాస్త్ర ఫలభాగమందు పలుచోట్ల గ్రహ, భావ బలములను శబ్దము లున్నవి. ప్రతి యోగమునకు బలయుక్తుడగు గ్రహమే కారకుడని ఋషులు వక్కాణించి యున్నారు. శుభుడని, పాపియని, శుభరాసియని, పాపరాసియని, శుభస్థానమనే పాపస్థాన మనువచనములు అనేకమార్లు వచ్చుచున్నవి. ఒక లగ్నమునకు శుభులైనవారు మరొక లగ్నమునకు పాపు లగుట, వారే వేరొక లగ్నమునకు సములగుట, శత్రులగుట చూచుచున్నాము. పూర్ణ శుభులు పాపులుగను, పూర్ణ పాపులు శుభులుగను భోగ కారకులుగను చెప్పబడి యున్నది. ఈ భేదముల నెరిగిన ఫలభాగ మన్వయించుట సులభము. ఇట్టి అంశముల తారతమ్యతలకు గల హేతువుల దెలుపుమని పాఠకు లనేకులు కోరినందున, ప్రస్తుతము ప్రచురింపబడుచున్న పంచ మహా పురుషభోగములకు మధ్య ఈ అంశ వివరముల దెలుపుచున్నాను. భారతీయులకు జన్మహక్కగు ఈ శాస్త్రము నాదరించి, పాఠకులయం దభిమాన ముంచి, ఈ శాస్త్ర రహస్యముల నాశక్తి కొలది పలువుర కందజేయు నవకాశమిచ్చి ప్రోత్సహించుచున్న పత్రికా సంపాదకు లభినందనీయులు.

## గ్రహము అనుకూలుడా ? ప్రతికూలుడా ?

(1) జన్మలగ్న చంద్రలగ్నములలో ఏది బలమైనది, (2) మనము విచారణజేయు గ్రహము ఏ భావముల కధిపతి, (3) ఈ గ్రహమున్న భావ మేది, (4) ఈ గ్రహ గతమగు భావ ఫలము లెట్లుండును, (5) తన ఆధిపత్యము గల భావ ఫలముల సంపూర్ణముగ నీయగలడా, (6) తన ఆధిపత్య భావములకు

దుస్థానములందున్నాడా లేక శుభస్థానములం దున్నాడా, (7) తత్కాల దశాంతర్దశానాథుల శుభదృష్టి గలిగి యున్నాడా, లేక పాపదృష్టియా, (8) అట్టి దశాంతర్దశానాథులకు దుస్థానము ములం దున్నాడా, (9) ఏ నక్షత్రగతుడైనాడు, యను 9 అంశ ముల పరిశీలించిన గ్రహ అనుకూలత సంపూర్ణముగా తెలి యును. అందు చివర పేర్కొనబడిన 4 అంశములు ముఖ్యము.

## గ్రహబలమన నేమి ?

గ్రహముల, భావముల బల నిర్ణయము రెండు విధ ములు. గణితశాస్త్రరీత్యా బలముల నెరుగుట, స్థూల దృష్టిచే బలముల నెరుగుట. ఇందు గణితశాస్త్ర విధాన ముత్తమము. కాని, ఇది ఎల్ల జాతకులకు వీలుగాదు. ప్రథమమున పీఠిక మీద జాతకమునకు బలమున్నదని నిర్ణయించిన పిదప గణిత భాగ విధాన మవలంభించుట శ్రేష్ఠము. బలములేని జాతక ములకు గణితశాస్త్ర విధానము సల్పుట వృధా శ్రమ. కాన స్థూలదృష్టిచే పీఠిక బలము నెరిగి పిమ్మట శ్రీపతి పద్ధతి రీత్యా గ్రహ భావ బలముల నిర్ణయించుట ఉత్తమ మార్గము. శ్రీపతి పద్ధతి రీత్యా గ్రహముల బలములు :—

రవికి—390, చంద్రునకు—360, కుజునకు—300' బుధునకు—420, గురునకు—390, శుక్రునకు—330, శనికి—300 విరూపముల బలము షడ్బలమందు గలిగిన వీరు సామాన్య బలము గలవారని తెలియవలెను. అపుడు గూడ ఈ గ్రహముల బలములు వివిధ బలములందు ఈ క్రింది విధ ముగా నుండవలెను.

| | స్థాన బలము | దిగ్బలము | చేష్టా బలము | కాల బలము | ఆయన బలము |
|---|---|---|---|---|---|
| రవి | 165 | 35 | 50 | 112 | 30 |
| చంద్రుడు | 133 | 50 | 30 | 100 | 40 |
| కుజుడు | 96 | 30 | 40 | 67 | 20 |
| బుధుడు | 165 | 35 | 50 | 112 | 30 |
| గురుడు | 165 | 35 | 50 | 112 | 30 |
| శుక్రుడు | 133 | 50 | 30 | 100 | 40 |
| శని | 96 | 30 | 40 | 67 | 20 |

విరూపములు, భావ బలము భావాధిపతి బలముమీద నాధారపడి యుండును, గాన భావముల బల నిర్ణయము భావాధిపతి బలము ననుసరించి చూచుకొనవలెను. పై జెప్పబడిన బలములకన్న అధిక బలము గల గ్రహము లుండుట జాతకబలమునకు శ్రేష్ఠము. బలహీనత, అశుభము.

స్థూల దృష్టిచే బలనిర్ణయ మీ క్రింది విధమున జేయ నగును :—

1. గ్రహము షడ్వర్గులందు ఎక్కువ స్వవర్గుల గలిగి యుండుట.
2. శుభులు సమరాసులందు చంద్రహోరలందు, పాపులుబేసి రాసులందు రవి హోరయందుండుట.
3. కేంద్రగతులగు గ్రహములు పూర్ణ బలులు, అందు లగ్న మందు విశేష బలము, సప్తమమందు ముప్పాతిక, దశమ మందు అర్ధబలము, చతుర్థమందు పాతిక బలము (ఈ క్రమ మన్ని గ్రహములకు వర్తింపదు). పణ పరము లందు అర్ధబలము, ఆపోక్లిమములందు పాతిక బలము.
4. రవి, కుజులు దశమ కేంద్రమందు, శని సప్తమమందు చంద్ర శుక్రులు చతుర్థమందు, గురు బుధులు లగ్న మందు.
5. పురుష గ్రహములు రాశి ప్రారంభమున, స్త్రీ గ్రహ ములు రాస్యంత్యమందు, నపుంసకులు రాసి మధ్యన బలవంతులు.
6. వక్రించి అస్తంగతులు గానివారు.
7. రాహువు—మేష, వృషభ, కర్కాట, వృశ్చిక, కుంభము లందు; కేతువు—వృషభ, కన్య, ధనుః పూర్వభాగ, మీనములందు.
8. లగ్నాత్తుగాని,చంద్రాత్తుగాని ఉపచయములం దున్నవారు,
9. గురుదృష్టి పూర్ణ బలము, శుక్ర దృష్టి అర్ధబలము. బుధ దృష్టి పాతిక బలము.
10. స్వోచ్ఛ, మూల త్రికోణ, స్వక్షేత్ర, మిత్ర, శత్రు, నీచ క్రమమున శుభులు. ఇందుకు వ్యతిరిక్తమున పాపులు, క్రమమున బలవంతులు.
11. శని, శుక్రు లస్తంగతులైనను, కుజుడు శత్రు క్షేత్ర వర్తి యైనను.
12. రవి, శనులు 9 వ భావమందు, బుధుడు 8 నందు, గురువు—6 నందు, శుక్రుడు శని క్షేత్రములుగాని వ్యయభావమందు.
13. వర్గోత్తమాంశల నొందిన గ్రహములు (చరరాసులందు ప్రథమ నవాంశ, స్థిరరాసులందు 5 వ నవాంశ, ద్విస్వభావ రాసులందు 9 వ నవాంశ.)
14. అశ్వనీ నక్షత్రగతుడై లగ్నమందున్న శుక్రుడు.
15. అగ్ని తత్వరాసులు లగ్నములు కాగా అందున్న కుజుడు.
16. లగ్నము వర్గోత్తమము కాగా అందున్న చంద్రుడు; లేదా వర్గోత్తమాంశ నొందిన చంద్రుడు; లేదా కర్కాట

నవాంశయందున్న చంద్రుడు.

17. తుల, ధనుస్సు, మీనములు లగ్నములు కాగా అందున్న శని.

18. సింహ నవాంశయందున్న రవి. వీరు బలవంతులుగా గ్రహింపవలెను.

## గ్రహదృష్టులు :

అన్ని గ్రహములు పూర్ణ దృష్టితో సప్తమ భావమును అందున్న గ్రహములను జూచును. ముప్పాతిక దృష్టితో 4, 8 స్థానములను అందలి గ్రహములను; అర్ధ దృష్టితో 5, 9 స్థానములను అందలి గ్రహములను; పాతిక దృష్టితో 3, 10 స్థానములను అందలి గ్రహములను చూతురు. ఇందు గురునకు 5, 9; కుజునకు 4, 8; శనికి 3, 10 విశేషదృష్టి యగుటచే ఈ గ్రహముల దృష్టి ఉత్తరోత్తర క్రమముగ బలము గలది.

## గ్రహముల సంబంధములు

(1) పరివర్తన, (2) ఏకరాశియం దుండుట, (3) పరస్పర వీక్షణ, (4) పరస్పర కేంద్రగతి (5) పరస్పర కోణ స్థితి. ఇట్టి సంబంధములు గల గ్రహములుబలము గలవి.

## యోగ కారకు లెవరు ?

ఉచ్చ, మూల త్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, కేంద్ర, కోణ, ఉత్తమాంశల నొందిన, శుభగ్రహ దృష్టి, శుభగ్రహ మధ్యమమందున్న, కేంద్ర కోణాధిపతులై అన్యోన్య సంబంధము గలవారైన గ్రహములు యోగకారకు లగుచున్నారు.

## రాజయోగ కారకులు:

అష్టమ లాభాధిపత్యములేని భాగ్యరాజ్యాధిపతులు భాగ్య రాజ్యములందున్నను, ఏక భావ గతులైనను, వీరికి పరివర్తన గలిగినను, పరస్పర దృష్టి గలిగినను, వీరు ప్రథమశ్రేణికి చెందు రాజయోగ కారకు లగుచున్నారు. 1, 4, 5, 7 భావాధిపతులలో భాగ్య రాజ్యాధిపతులు కూడిన లేక భాగ్యరాజ్యాధిపతులు 1, 4, 5, 7 స్థానములందున్న, ద్వితీయశ్రేణికి చెందిన రాజయోగ కారకు లగుచున్నారు. 1, 9, 10 అధిపతులు; 5, 6 అధిపతులు; 6, 7 అధిపతులు క్రమముగా ఉత్తమమధ్యమ, అధమాధిపత్యము గల రాజయోగ కారకులు. వీరలకుఏకభావ స్థితి గాని, పరివర్తన గాని, పరస్పర దృష్టిగాని, గలిగిన తృతీయ శ్రేణికి చెందిన రాజయోగ కారకు లగుదురు. మిగిలిన కారకత్వములచే ప్రాప్తించు రాజయోగములు లేకపోలేదు.

## శుభు లెవరు? పాపు లెవరు?

గురువు, శుక్రుడు, పాపయుతుడు గాని బుధుడు, పూర్ణ చంద్రుడు— నైసర్గిక శుభులు.

శని, కుజుడు,రాహువు, కేతువు, పాపయుతుడగు బుధుడు, క్షీణ చంద్రుడు—నైసర్గిక పాపులు.

వీరుగాక ప్రతి భావమునకు కేంద్ర కోణాధిపతులు ఆధిపత్య శుభులు, దుస్థానాధిపతులు ఆధిపత్య పాపులు. అనగా మేషమునకు—బుధుడు, వృషభమునకు—చంద్ర గురులు, మిధునమునకు—రవి కుజులు, కర్కాటమునకు—బుధుడు, సింహమునకు—చంద్రుడు, కన్యకు—రవి—కుజులు, తులకు—గురువు,వృశ్చికమునకు—బుధుడు, ధనుస్సుకు—చంద్ర శుక్రులు, మకరమునకు—రవి గురులు, కుంభమునకు—చంద్రుడు, మీనమునకు—రవి, శుక్ర, శనులు పాపులు. 6, 8, 10, 12 భావములకు శని పాపకారకుడు. షష్ఠమునకు—కుజుడు, దశమమునకు—రవి, కుజ, బుధులు, శుభకారకులు. రవి భాగ్యమందు, చంద్రుడు చతుర్థమందు, కుజుడు—తృతీయమందు, గురువు—పంచమమందు, శుక్రుడు—సప్తమమందున్న ఆ భావములకు పాపము సంభవించును. శని అష్టమమందు, కుజుడు షష్ఠమందుండుట శుభము.

1. కోణాధిపత్యము గల నైసర్గిక శుభులు, కేంద్రాధిపత్యము గల నైసర్గిక పాపులు కేంద్రములందు కలియుకున్న మంచి యోగము.
2. కేంద్రాధిపతులకు నైసర్గిక శుభులు, కోణాధిపతులకు నైసర్గిక పాపులు, 3, 6, 8, 11, 12 లందు విడిగా నుండుట శుభము. వారికలయిక యోగమును తగ్గించును.
3. కేంద్రాధిపతులగు నైసర్గిక శుభులు, పాపులలో కలిసి కేంద్ర కోణములందుండుట శుభము.
4. కోణాధిపత్యము గల నైసర్గిక పాపులు శుభులలో కలిసి కేంద్ర కోణములం దుండుట శుభము.
5. కేంద్రాధిపత్యము గల నైసర్గిక శుభులు, కోణాధిపత్యము గల నైసర్గిక పాపులు దుస్థానాధిపతులలో కలయుట యోగము. అందు అష్టమాధిపతితో కూడిన ప్రబలయోగము.
6. ఏ గ్రహమైనను ఉచ్చరాసిలో ఉచ్చ నవాంశ నొందినను, స్వక్షేత్రమందు స్వనవాంశయందున్నను, మిత్ర క్షేత్రమందు మిత్ర నవాంశగతుడైనను, మూల త్రికోణమందు మూల త్రికోణాధిపతి నవాంశ నొందినను పాపులైనను శుభు డగును.
7. ఏ గ్రహమైనను తన సమరాశిలో తద్రాశ్యాధిపతికి శత్రు నవాంశయందున్న, ఆ రాశ్యంశాధిపతులు స్థానబలము గలవారైన, ఆ స్థానమందున్న గ్రహ మశుభుడె లాభ మొసగును.

8. గ్రహము నీచరాశిగతుడైనను, అట్టి రాశి మిత్ర క్షేత్ర మైన, తద్రాశ్యాధిపతిఅంశయందు మరొక మిత్ర గ్రహమున్న, వా రిర్వురుషడ్బలపూర్ణులైన, రాశ్యాధిపతి శుభుడై శుభమిచ్చును.

9. 6, 8, 12 స్థానములు, ఆస్థానాధిపతులు, వారి ఆధి పత్య రాసులు అశుభములు. ఇవిగాక 6, 8,12 లందున్న వారికి ఆ స్థానములు మిత్ర, ఉచ్చ, స్వక్షేత్రములైనను, వారు శుభులచే చూడబడినను, వారిని శుభులుగా గ్రహింపవలెను.

10. 6, 8, 12 స్థానాధిపతులు, శత్రు, నీచ క్షేత్రవర్తులై అస్తంగత్వము నొందిన ఆ స్థానములందుండు గ్రహ ములు శుభు లగుదురు.

11. నైసర్గిక శుభులు వ్యయమందు తప్ప శుభులు. నైస ర్గిక పాపులు ఉపచయ స్థితిచే శుభులు.

శుభపాప స్థానములు—పై జెప్పబడిన శుభుల రాసులు శుభ స్థానములు. పాపుల ఆధిపత్యరాసులు పాప స్థానములు. ఇవిగాక కేంద్ర కోణములు శుభ రాసులు. దుస్థానములు పాప రాసులు. దుస్థానములు 2, 11, 3, 6, 12, 8 ఉత్తరోత్తర క్రమముగా బలము గలవి.

భావబల మెట్లు?

భావాధిపతి, భావమందున్న గ్రహము, భావ కారకుడు బల వంతులై శుభస్థానములందున్న భావము బలము గలిగి యుండును. భావాధిపతి కేంద్ర కోణములందును, 3, 11 లందును ఉచ్చ, స్వ, మూల త్రికోణ, మిత్ర క్షేత్రములందు, స్వ అంశలందు, శుభ మధ్యమందు, తానున్న రాశ్యాధిపతి ఉచ్చ నొందిన, శుభ సంబంధము గలిగియున్న, బలవంతుడగును. లగ్నగత శత్రు, నీచస్థానగతుడైన, దుస్థానములకు 6, 8, 12 లందున్న, అస్తంగత్వము నొందిన, శుభగ్రహ సంబంధము లేకున్న, పాపగ్రహ సంబంధము గల్గిన, నీచ, శత్రు అంశ లందున్న, గ్రహ యుద్ధమందు పరాజితుడైన బలహీనుడగును. ఇట్లే భావమందున్న గ్రహమును, భావకారకుని చూచుకొని భావ బలము నిర్ణయింపవలెను.

1. భావమును శుభులు జూచిన, తదధిపతులు భావమందున్న, షడ్వర్గులందు బలము నొందిన గ్రహము భావమందున్న, ఆ భావమందు పాపులు లేకున్న, లేదా భావమునకు పాప దృష్టి లేకున్న, భావము నుండి ద్వితీయము, కేంద్ర కోణములందు శుభులున్న, భావాధిపతి వానియం దున్న, భావము బలీయమగు చున్నది.

2. భావగతుడగు గ్రహమునకు ఆ భావము మిత్ర క్షేత్ర మైనను, స్వక్షేత్ర మయినను, ఉచ్చ యైనను, భావ గతుడగు గ్రహము శుభుడైనను, లగ్నాధిపతి భావమం దున్నను, భావాధిపతి దుస్థానములం దుండకున్నను, 3, 6, 11 లందు పాపు లున్నను, కేంద్ర కోణము లందు శుభు లున్నను భావ మశుభ ఫలముల నొసగును.

3. భావము నుండి కేంద్రములందు స్వక్షేత్ర గ్రహము లున్నను, ఉచ్చ నొందిన గ్రహము లున్నను భావమునకు శుభము జేకూరును.

4. పాపసంబంధములేని లగ్నాధిపతి గాని, చంద్ర లగ్నాధిపతి గాని భావమం దున్నను, భావమును చూచినను— భావాత్తు కేంద్ర కోణము లందున్నను శుభము.

5. కేంద్ర కోణములు గ్రహ వర్జితములు కాగా, కేంద్రాధి పత్యము గల గురు శుక్రులు 3, 6, 8, 11, 12 లందున్న భావము శుభఫల మిచ్చును.

6. భావాధిపతికి, భావగతుడగు గ్రహములు, భావమును వీక్షించు గ్రహములు మిత్రులైన భావము బలము గలదని గ్రహింపవలెను.

7. భావము శుభరాసియై, భావమందు శుభులు గాని, భావాధి పతి గాని, మిత్రులు గాని యుండి బలవంతులైన గ్రహ ములు వారిని చూచిన, లేదా భావాధిపతిగాని, భావకారకుడు గాని బలవంతులైన భావము శుభఫలముల నిచ్చును.

8. భావము శుభగ్రహ మధ్యమైనను, శుభులు భావాత్తు 4, 5, 8, 9 లందున్నను భావమునకు శుభము గల్గును.

9. పాపియైన భావాధిపతి బలహీనుడై భావమందున్న, భావమును చూచిన కొంతవరకు శుభము.

10. భావాధిపతి ఏ గ్రహమునకు సంబంధించినను ఆ గ్రహము స్వరాశ్యంశలందున్న, అట్టివాడు బలవంతుడు, మిత్రుడు శుభుడు నైన, భావమునకు లాభము.

11. వక్రించిన నీచగ్రహము అస్తంగత్వము నొందక 6, 8, 12 లందున్న భావము ఫలించును.

12. పాపాధిపత్యము గల భావమందు భావాధిపతియున్న భావము ఫలించును.

13. 6, 8, 12 ఆధిపత్యములు లేని పాపులు ఉచ్చ నొందిన భావమునకు శుభము.

14. ఆధిపత్య పాపిగాని కుజుడు బలవంతుడై యోగించును.

15. ఆధిపత్య పాపిగాని శని బలహీనుడై యోగించును.

16. నవమాధిపతి భావమందుండి గురుదృష్టి నొందిన, నవమాధిపతి లాభమందున్న, భావ నవమాధిపతులు భావమందున్న, ద్వితీయాధిపతి ద్వితీయ మందు, చతుర్థాధిపతి చతుర్థమందున్న లేదా చతుర్థాధిపతి భావమందున్న, భాగ్యాధిపతి భాగ్య స్థానమును చూచిన శుభము.

17. బలవంతులైన పాపులు శుభవర్గుల నొంది, శుభవర్గులందున్న బలవంతులైన శుభులచే చూడబడియున్న భావము శుభఫల మిచ్చును.

18. భావాధిపతిగాని, కారకుడు గాని నీచనుపొంది బలహీనులై లాభమందున్న శుభమిత్తురు.

## భావమెట్లు నశించును ?

1. ఏభావాధిపతి అష్టమమందు అస్తంగతుడై, నీచ శత్రు క్షేత్రవర్తియై, శుభగ్రహ సంబంధము లేకుండిన ఆ భావము నశించును. ఇట్టి అవయోగ కారకుడు శుభగ్రహ సంబంధముచే శుభఫల మిచ్చును.

2. భావము, భావ కారకులు, భావాధిపతి పాప మధ్యములైనను, బలవత్పాపులతో సంబంధించినను శుభులచే వర్జింపబడినను, వీరుండు స్థానమునకు 4, 5, 8, 9, 12 లందు పాపు లున్నను, వీరి అంశాధిపతులు శత్రు, నీచ, అస్తంగత్వాది దోషయుక్తులై భావమందున్న నాశము.

3. ప్రతి భావమునకు 2, 7 భావాధిపతులు మారకులు. 2, 3, 4, 8 లందున్నవారు కష్టముల నిత్తురు. 8 యందు పాపులున్న కష్టము లినుమడించును. శుభులున్న కష్టము లుండవు.

4. 6, 8, 12 స్థానాధిపతులు కేంద్ర కోణాధిపతుల సంబంధముచే సుఖము లైనను మారకమునైన నిత్తురు. సుఖముల నొసగినవారు మారకము జేయక మారక స్థితి సంభవించునట్టి వ్యాధుల గల్పింతురు.

5. పాపులు దుస్థానములందున్న భావనాశము. వీరు శుభులతో కూడినను నిష్ప్రయోజనము.

6. అష్టమాధిపతి దశ, 22 వ ద్రుక్కోణాధిపతి దశ, 64 నవాంశాధిపతి దశ, 6, 7, 8 స్థానములందున్న వారి దశలందు ఆయా గ్రహములు బలహీనులైన భావ నాశము.

7. లగ్నాత్తు లేక చంద్రాత్తు 3 వ స్థానాధిపతి దశ, అష్టమమందున్న గ్రహ దశ, లేదా అష్టమమును వీక్షించు గ్రహదశ, శనిదశ, మాంది యున్న స్థానాధిపతి దశ, మాంది స్థానాధిపతి యున్న రాశ్యంశాధిపతుల దశలు, బలహీనుడగు రాహువు 6, 8, 12 లందున్న లేక పాపులతో కూడిన లేక వీక్షింపబడిన దశలలో భావము నశించును.

8. పాపులు నీచ నొంది శత్రుక్షేత్రములందున్న భావమునకు నాశము.

9. 6, 8, 12 ఆధిపత్యము గల శుభులు ఉచ్చ నొందిన వారున్న భావములకు హాని.

10. 6, 8, 12 ఆధిపత్యముగల పాపులు ఉచ్చనొందినవారున్న భావములకు హాని.

11. శని 4, 5, 10 లందు శత్రుక్షేత్రములందున్నపాపము సంభవించును.

12. ఉచ్చ, స్వ, మిత్రక్షేత్రవర్తులై శుభవర్గుల నొందిన భావాధిపతిగాని, భావకారకుడుగాని 6, 8, 12 లందున్న పాపము.

## జాతకబలము నిర్ణయించుటకు ప్రధానమగు యోగములు:

1. లగ్నము, లగ్నాధిపతి, రవి, చంద్రుడు, ధర్మభావము బలమునొందుట.
2. ఎక్కువ గ్రహములు ద్విస్వభావరాసులయందుండుట.
3. నైసర్గిక పాపులు యోగకారకులై నీచయందు గాని, వ్యయమందు గాని యుండుట లేదా వ్యయమే నీచస్థానమైన అత్యంత శుభయోగము.
4. సూర్యున కాపోక్లీమములందు చంద్రుడు వర్గోత్తమాంశ లందుండి, ఆ స్థానము అధి మిత్రక్షేత్రమై, చంద్రుడు గురుదృష్టి నొందుట.
5. చంద్రాధియోగము; లగ్నాధి యోగము.
6. చంద్రునకు గాని, లగ్నమునకు గాని శుభం ఉపచయ స్థితి.
7. రవి గాక ఇతర గ్రహములు 4, 10 లందుండుట.
8. కేంద్రగతులకు గ్రహముల పరస్పర వీక్షణ.
9. పెక్కు గ్రహములు స్వక్షేత్రములందుండుటగాని, స్వక్షేత్రములను వీక్షించుట గాని.
10. సునఫ, అనఫ, దురధుర శుభయోగములు.
11. వేసి, వాసి, ఉభయచారాది శుభయోగములు.
12. లగ్నము శుభగ్రహ మధ్యమగుట—శుభ కర్తరి యోగము.
13. శుభమాలా యోగము.
14. కేంద్ర కోణాధిపతుల పరివర్తన గల మహాయోగము.
15. శంఖ యోగము.

# జాతకబలము

16. 2, 11 స్థానాధిపతుల పరివర్తన.

17. పురుషులు పగలు పురుష నక్షత్రములందు జనన మొందగా లగ్న, రవి, చంద్రులు బేసి రాసులందుండుట.

18. స్త్రీలు రాత్రులందు స్త్రీ నక్షత్రములందు జనన మొందగా లగ్న, రవి, చంద్రులు సమరాసులం దుండుట.

19. వర్గోత్తమాంశ నొందిన లగ్నమునకు, శుభులు బేసి స్థానమందుగాని కేంద్ర కోణములందు గాని యుండుట. భావ కారకులు లగ్నాత్తు గాని చంద్రాత్తు గాని కేంద్ర కోణములందుండుట.

20. నవమాధిపతి ఉచ్ఛ నొంది 1, 3, 9 స్థానములం దుండుట.

21. వృషభ, ధనుర్మీనములనలందు గ్రహము లుండుట.

22. లగ్నాత్తుగాని, చంద్రాత్తుగాని శని 4, 11 లందు, కుజుడు 6, 10 లందు, గురువు, 5, 9 లందుండుట.

23. శుభులు 1, 2, 3, 10, 11, 12 లందుండుట.

24. శని లగ్నమగు మేష, మకర, కుంభములం దుండుట.

25. కుజుడు మకరమందు; కర్కటమందు; గురువు కర్కట మందు, రవి మకరమందు; శని తుల యందు; రవి మేష మందుండుట.

26. గురువు శుక్రునికి కేంద్రమందుండ, చంద్రుడు పం మందు, రవి గురుని కేంద్రములందుండుట.

27. గురునకు కేంద్రములందు చంద్రుడు, లేదా నీచ అస్త త్వము నొందని బుధ, గురు, శుక్రులు చంద్రుని చూ

28. లగ్న వ్యయాధిపతులు పరస్పరము కేంద్రములందు శుక్రదృష్టి గలిగిన.

29. ఇర్వురు శుభులు ఏక కేంద్రమునందున్న.

30. నభాసయోగములు గలిగిన,

31. భాగ్య రాజ్యాధిపతులకు భాగ్యస్థాన సంబంధము న నను, ఉచ్ఛ నొందినను, భాగ్యరాజ్యములందున్నను, 6, 12 స్థానములకు సంబంధించకున్నను; ఇందు క నకు భాగ్యాధిపత్యము గల్గి అష్టమమందుండకుం (6, 12 లందు దోషము లేదు), భాగ్యాధిపతి బలహీ డైనను, భాగ్య రాజ్య భావ కారకులగు రవి గురులు, ఉ నొందినను లేక భాగ్యస్థాన సంబంధము గలవారైన కుజునకు తృతీయ స్థాన సంబంధము గలిగి, షష్ఠా పతికి, షష్ట భావమునకు సంబంధించిన, కుజ స్వోచ్ఛగతుడైన అమాత్య యోగము ప్రాప్తించును. పై చెప్పబడిన యోగములు ప్రజానాయకులై మం పదవుల ననుభవించువారి జాతకములలో ఎక్కు కన్పించుచున్నవి.



# కవిప్రయోగ పరిశీలన

శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునను, దానికి సంగ్రహరూపమైన బాల వ్యాకరణోద్ద్యోతమునను, తద్గ్రంథకర్తలగు శ్రీ వజ్ఝలవారు తెలుగు వ్యాకరణ రచనకు మూలాధారములైన కవి ప్రయోగముల నామూలాగ్రముగ పరిశీలింపకయే భాషా పరిణామ సంప్రదాయ విరుద్ధములును, నసంబద్ధములు నగు సిద్ధాంతములను చేసిరి. పై వానిలో మొదటిది యైన, సంహితా సర్వస్వము నందలి ప్రయోగములు కొన్ని నాచేత భారతి పత్రికా ముఖమున (భారతి—ఏప్రియలు 1959. 54—60 పుటలు.) (జులై—1959. 22—25 పుటలు) విమర్శితములైనవి. వానిని పరిగణింపకయే, వజ్ఝలవారు బాల వ్యాకరణోద్ద్యోతమున వందల కొలది యేండ్లుగా, నాంధ్ర వైయాకరణుల చేతను, లక్షణ గ్రంథకర్తల చేతను, లక్ష్య లక్షణ పూర్వకముగా నుదాహృతములైన పాఠములను తమ యిచ్చ వచ్చిన రీతిని దిద్దుటకు సాహసించిరి.— ఈ రెండింటి యందును, వీరు ప్రయోగములను గూర్చి ప్రదర్శించిన వైఖరిని బట్టి చూడగా, ప్రసిద్ధ ప్రబంధముల మాట యటుండ నిచ్చి భారతాది గ్రంథముల నైన సావధానముగా పరిశీలింప లేదని స్పష్టమగుచున్నది. ఇంతే కాదు. ఆంధ్ర వైయాకరణ సంప్రదాయములను గ్రహించుటకు వీరు, ఆంధ్ర శబ్ద చింతామణ్యా థర్వణకారికావ ళ్యహోబలపండితీయములు తక్క, తెలుగులో నున్న యాంధ్రభాషా భూషణాదులను గాని, యితర లక్షణ గ్రంథములను గాని సాకల్యముగా చూడలేదని కూడ విశదమగుచున్నది. కవిప్రయోగములకు మూల గ్రంథములను చూడక, ముద్రితములైన నిఘంటువులను మాత్రమే ప్రమాణముగ గైకొనినందువలన, నీ రెండింటి ప్రామాణ్యమునకు భంగము గలిగినది — పై విషయములను నిరూపించుటకే యీ వ్యాస ముద్దేశింపబడినది.

**1. దయాళురు**— బాలవ్యాకరణోద్ద్యోతము— పుట112.

బాల వ్యాకరణము – తత్సమ పరిచ్ఛేదము 38 వ సూత్రమున దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. 'దయాళురు'— దయాళురను -- దయాళుర చేతను— అని రూపముల నిచ్చియున్నాడు. పై పుటలో నీ శబ్దము దయాళురుగూర్చి యిట్లున్నది.

"సూరి 'దయాళురు' అనునదియుఁ గలదని వ్రాసెను. కాని యట్టి కవి ప్రయోగము లేదు." కాని కవి ప్రయోగమును లేకపోలేదు. కేతన యాంధ్రభాషాభూషణములో బహువచనములు చెప్పునప్పు డిట్లు వ్రాసియున్నాడు:

క. లులమీద లులకురుఙ్గగు
   నిల బెక్కడ బాలురన మహీపాలు రనన్
   లలిత దయాళు రనంగా
   నలవడ వర్తిల్లు గాన నభినవదండీ. 71 వ పద్యము

సూరి పై గ్రంథమును చూచియే నీ శబ్దము నిచ్చి యున్నాడని దలంపనగును.

**2. ఋత్విక్కు**— ఋత్విగాదులకు ద్వితీయైక వచనాంత తుల్యంబులు విభాషనగు. "ఋత్విజుఁడు—ఋత్విక్కు" .... ఋత్విగాదికం బాకృతి గణంబు—అని. తత్స. 73 వ సూత్రము.

సర్వస్వమున ఋత్విక్కు శబ్దము సాధువు కాదు—అని వీరు వ్రాసిరి. (1 సం. 631 పుట) ఆపైని నేను శబ్దరత్నాకరమున ననుబంధములో (15 వ పుట) నీ పదమునకు వరాహ పురాణమున ప్రాస ఘటితమగు నీ క్రింది ప్రయోగము చూపితిని:

సీ. స్రుక్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి (వరాహ 5— 115 పద్యము)

ఉద్ద్యోతమున పుట 136 లో నీ శబ్దమును గూర్చి యిట్లున్నది :

"సూరి యుదాహరించిన ఋత్విక్కు, నీవృత్తు, వీరుత్తు మున్నగునవి కవిప్రయుక్తములుకాలేదు. 'స్రుక్కుల విఱిచి, ఋత్విక్కుల బాధించి' (వరాహ పురాణము 5 ఆ. 115) అను పాఠ మగపడుచున్నది. 'స్రు[illegible]ములఁ జెఱిచి ఋత్విజులను బాధించి' కవి ప్రయుక్త పాఠమై యుండును. భారతమందంతటను "ఋత్విజుడు" అనియే ప్రయుక్తమై యున్నది."

పై రీతిగా ప్రాచీన కవ్యుద్దిష్ట పాఠములను వజ్ఝలవారు, వారి మతానుసారముగా మార్చుట పరిపాటియై పోయి

నది. కాని 'బుత్విక్కు' అను రూపము, వరాహ పురాణమునందే గాక అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయము నందును ప్రయుక్తమై యున్నది.

దశరథుఁడు పుత్రకామేష్టియాగము చేయు సందర్భమున:

వ. అలఘు శ్రీ నిధి విశ్వ భూతల వరుండా ఋష్యశృంగి ర్షిము
ఖ్యుల బుత్విక్కుల నప్పు డేర్పఱచి యాగోద్యోగ రాగాంకురం
బుల సందీక మదిం బెనంగ నుచితంబుల్ ద్రవ్య ముల్ తోర హ
త్తులుగాఁ గూర్చి నిజాంగనా జన సమేతుండై ప్రమో దంబునన్.

తృతీయాశ్వాసము పుట. 42.

ఇంతేకాక, తంజావూరి రఘునాథుని రామాయణమునను "ఆ బుత్విక్కులు సంత నిష్టికలచే" అని 3—78 లో నిర్ధారకముగా గలదు.

135 వ పుటలో పై నుదాహరించిన వాక్యముల వెంటనే 136 వ పుటలో యిట్లు వ్రాయబడినది. "లేదా దీని (బుత్విక్కును) సత్యవదాదులలో జేర్చవలెను—ఇవెల్ల ద్వితీయైక వచన ప్రాతిపదికములుగాన బుత్విజుఁడు—నీ వృతము—వీరుధము మున్నగు రూపములే సాధువులు—బుత్విజుఁడు (సభా. 1 ఆ. 11 ప) (సభా 2 ఆ 4 ప) గమి కర్మీకృతనైక నీవృతుఁడనై నైష. (2 ఆ 21 ప) గాన బుత్విగాదులు ద్వితీయైక వచ నాంత తుల్యములు—విభాషనగు బాల తత్స. 73 వ సూ. అను సూత్రము—ప్రత్యాఖ్యాన మయ్యెను."

కాని యిందుదాహరింపబడిన నైషధ పాఠములో— "నీవృత్తుఁడై" అను రూపమునకే—"నీ వృతుఁడై" అని తేల్చి పల్కిన రూపము శ్రీనాథుఁడు వాడియుండెనని కవి సంశయ విచ్ఛేదకారుఁ డుదాహరించిన విషయమును, నింతకుముందే— తెలిపియుంటిని. (చూ. భారతి—జనవరి 1964. శృంగారనైష ధము—సుపరిష్కృత ముద్రణము.) పైని నే నిచ్చిన బుత్విక్కు — నీవృత్తు ప్రయోగములనుబట్టి వజ్ఝలవారి వ్రాతయే ప్రత్యాఖ్యాన మైనది.

**3. హనుమానుఁడు** — ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్త్కారంబున కానాదేశంబు విభాషనగు.

బాల. తత్స. 74 వ సూత్రము.

హనుమానుఁడు — హనుమంతుఁడు — భగవానుఁడు— భగవంతుఁడు—ఇత్యాది.

దీనిని గూర్చి 136 వ పుటలో నిట్లు గలదు.

"అట్లే—హనుమానుఁడు, భగవానుఁడు, ప్రశానుఁడు మొదలైనవియు నపశబ్దములె కాన." ఒకానొకచో మహత్త్వం బున కానాదేశంబు విభాషనగు అనునదియుఁ బ్రత్యాఖ్యేయమే— అహోబలుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగువారి యను రోధమున నిట్టి ప్రమాదములు గల్గియుండును.

ఉద్ధృత కర్తలు భావించినట్లిది పదునెనిమిదవ శతాబ్దినాటి లాక్షణికుల యనురోధముచే గలిగిన ప్రమా దము గాదు. అది ప్రామాణికమే—క్రీ. శ. 1260 ప్రాంతము వాడగు కేతనయే యాంధ్రభాషా భూషణమున దీని కిట్లు లక్షణము చెప్పియున్నాడు :

క. పుట్టిగు నుట్టింతముపై
ముట్టిగు నట్టింత శబ్దములపై రెంటన్
దుట్టిగుఁ బురుషాఖ్యలపై
నట్టు ట్టిగునట్టి యెడల నభినవదండీ —35 ప.

క. వానునకున్ వంతుండును
మానుకును మంతుఁడును గ్రమంబున నగు శ
బ్దానీ కాంత న కారము
మానించి విభక్తు లెక్కు మఱి యొక్కొకచోన్.
—36 ప.

క. తనువు తనువు ధన మర్థము
గురుఁడు పురుషుఁ డుత్తముండు గుణవంతుఁడు సు
స్థిర మతిమంతుఁడు యశమున
నరుదుగ హనుమంతుఁ డన నుదాహరణంబుల్.
—37 ప.

పై లక్ష్యములలో హనుమానుఁడు—హనుమంతుడుఁ అను నుదాహరణములే—చిన్నయసూరి—భాషా భూషణమును బట్టి పై సూత్రము రచించెనని స్పష్టమగుచున్నది. ఈ పట్టున పై వ్రాతయుఁ బ్రత్యాఖ్యాత మైనది.

**4. సమాసములు—పదాంతర వ్యవధానము.**

ఉద్ధృతమున— 245వ పుటలో—

క. చిక్కని చక్కని నున్నని
ద్రుక్కని తోలాడ్వుఁ బడని చుర్లి సెగలచే
నొక్కబడని దండంబులు—

విజ్ఞా. ఆచార కాండ.

ఇట్టి ప్రయోగములు కవిత్రయము వారివి దొరకలేదు" అని కలదు. పై ప్రయోగమే కేతనది— విజ్ఞా అనగా విజ్ఞా నేశ్వరీయము— భారతమున నిట్టిది లేక పోలేదు. చూడుఁడు:

విరాట పర్వము— తిక్కన ప్రయోగము—
క. చక్కని చిక్కని మేనులు
నిక్కోదండములు— (1—156)

**5. పెన్నింట—పెన్నింట.**

ప్రాచీన కవి ప్రయోగములను తమ ఇచ్చ వచ్చిన రీతిని మార్చి వేయుటకు వీరెట్లు వెనుదీయరో పై పెన్నింట శబ్దము తెలుపును.

'పెన్నింట' అను పద మీ వరకు నిఘంటువుల కెక్క లేదు. శబ్ద రత్నాకరాను బంధమున నేనీ పదము నిచ్చితిని. ఎఱ్ఱన హరివంశమున దీనికి రెండు ప్రయోగములున్నవి.

1. మధువాహిని పెన్నింటం దేలుచు— హరి. ఉ. భా 6.27

2. పెన్నింటలఁ గూర్చు కామమును— నిబ్బరమైన— —7.94

పై వానిలో రెండవది యతి స్థానమున నుండుటచే 'నిర్ధారకము. పై రెండింటి యందు పెన్నింట అని హ్రస్వ రూపమే యుండగా, వజ్ఝల వారు సర్వస్వము— మొదటి సంపుటము 936వ పుటలో వీనికి— పెన్నీంటను— అని దీర్ఘ రూపమును జూపుటయే గాక దానికీ క్రింది యుప పత్తులు జూపిరి :

1. నీరు శబ్దము యొక్క ఔప విభక్తిక రూపము నీట అనునది 'నీంట' అని యుండ వచ్చును.

2. దీర్ఘపూర్వకపూర్ణ బిందువు లక్షణవిరుద్ధముగాదు. మూండు— పోండిమి— పూంచు—కాంచు మున్నగునవి గలవు.

3. నన్నయాధర్వణీయము చొప్పున నిషేధమైనను నిది విశేష విషయము.

పై యుపపత్తు లెంత యసంగతములో చూడుడు.

1. మూండు, పోండిమి— అను వానివలె— నీంట, నీంటి, యను నర్ధాను స్వార ఘటిత శబ్దములున్నవా ? ఉన్నచో కవి ప్రయోగములను చూపగలరా ?

2. పూంచు, కాంచు— అనునవి మధ్య నకార మున్న పదములు గదా—

నీటికి— నీన్టి.... నీన్ట.... అను మూల రూపము లున్నవా?

ఇంతకు 'నీంట' అను పూర్ణ బిందు రూపము వీరు స్వంతముగా సృష్టించినది. 'నీంట' అను రూపము, తాళ పత్ర మాతృకలలో 'నీంట' అని యున్నదట. అది వీరి కాధారము. తాళపత్ర మాతృకలు తప్పుల కుప్పలు అని వీరి యభిప్రాయము· ఇక్కడ మాత్రము— పాఠము సరి యైనదే—ఏల ననగా నదితప్పైనను వారికి నచ్చినది—అంతే.

వీరింతటితో నాగలేదు. తామీ శబ్దమును 1951లో వ్రాయుటయే గాక— క్రీ. శ. 1961 లో బాల వ్యాకరణో ద్యోతమున— ఈ రూపము చిన్నయసూరి యెరుంగడని వ్రాయుటకు సాహసించిరి.

"సూరి— ఇ—టి—తి— వర్ణంబులనే ఔపవిభక్తి కములని సూత్రించి హ్రస్వము మీది 'టి' వర్ణము— పూర్ణ బిందు పూర్వకమగునని సూత్రించెను. (బా ఆచ్ఛి. 28—33 సూ. దీర్ఘము మీద 'నీంట' అని కలదే" (పుట 202).

1951లో సర్వస్వ కర్తలు సృష్టించిన శబ్దమును' 1858లో బాల వ్యాకరణము ప్రకటించిన చిన్నయసూరి యెట్లు చూడగలడో దురూహ్యము— తనకు ముందన్ని ప్రయోగములను చిన్నయసూరి చూడ కున్నను నీటి శబ్ద మున కిట్టి విశేష రూపమున్న— నది— చిన్నయసూరియే కాదు, తక్కిన లాక్షణికులును దీనిని గుర్తించి తమ గ్రంథము లలో నుదాహరించియే యుందురు. నీంట అను రూప మున్న గదా, అది లక్షణ గ్రంథములలో నుండుట సంభ వించును? వారు నిరంకుశముగా పూర్వము లేకున్న నేమి ? మన మెట్లు నూతన సృష్టిచేసి వ్రాసినను విమర్శించు వారెవ్వరున్నారు అనే ధీమాతో చేసిన పని ఇది. ఈ నీంట శబ్ద మొక్కటియే, వజ్ఝల వారి యప్రామాణికతకను వెల్ల డించుటకు చాలును— చూడుడు:

ఉద్ద్యోతమున 203 వ పుటలో పై హరివంశ ప్రయో గము రెండవదాని 'పెన్నింట' అను సమస్త పదమునుదాహరింప కుండ— నీంటను.. మనం బొంటికి (హరి. ఉ.భా 8.94) అని యుదాహరించుటయే— వీరీ శబ్దమును సృష్టించి, ప్రాచీన పద స్వరూపమును మార్చిరని స్పష్టము.

పెన్నింట అను పదముపై రెండు ప్రయోగములలో 'ని' హ్రస్వముగ నున్నను— నది బిందు పూర్వక మగుటచే, బిందుపూర్వకమైనది. హ్రస్వమైనను, దీర్ఘమైనను గుణ భంగము నొదవింపని కారణముచేత, వజ్ఝలవారి పదమును, తమ కనుకూలముగ నీంట— అని దీర్ఘ పూర్వకము చేసిరి— పై రెండింటి యందు న్నింట యన్నను నీంట యన్నను గణ భంగము లేదుకదా.

కాని 'పెన్నింట' అనునది హ్రస్వరూపముతో నను ప్రాసలో నొక ప్రయోగమున్నదని వారి కెరుకలేదు. ఇట్టిది రావిపాటి త్రిపురాంతకుని [1]త్రిపురాంత కోదాహరణమున నున్నది. సంబోధన యుత్కళికలో :

తాపసుల యాలువుల తనరు తపముల పంట
చూపులకు నెల్ల పరసుఖ వార్ధి పెన్నింట.

ఇచట యను ప్రాసమున— పంట—న్నింట— అని రెండును బిందుపూర్వక హ్రస్వరూపములే కలవు. లేని యెడల నది యనుప్రాస కాదు గదా.

ఇక పద్యములలో వలె నిందును, దీర్ఘ పూర్వకముగ నున్నను, గణ భంగమొదవింపదనుకొనుటకు వీలులేదు— కళి కోత్కళికలు మాత్రాగణములలో చేరినవి. అవి కేవలము— ఒక లఘువు— మాత్ర హ్రస్వము. రెండు లఘువులు— అనగా రెండు మాత్రలు దీర్ఘమ్ము— అను ఛందశ్శాస్త్ర సిద్ధాం

1. ఈ త్రిపురాంత కోదాహరణమును నేను ప్రథమమున క్రీ. శ. 1937లో ప్రకటించి, ఆంధ్ర వాఙ్మయమున నుదాహరణము అనుప్రత్యేక సాహిత్య శాఖ యున్నదని నిరూ పించితిని. ఆ వెనుక ఉదాహరణ వాఙ్మయ చరిత్రము. ఆ శాఖ యొక్క సంపూర్ణ చరిత్రను రచించితిని.

# కవి ప్రయోగ పరిశీలన

తమునకు సంబంధించినవి. అందుచేత కళికోత్కళిక లలో—న్నింట— అని యున్నను నది బిందు పూర్వక హ్రస్వ మగుటచే— రెండు మాత్రలు లేక రెండు లఘువులుగా పరి గణితము— అయితే అక్షర గణముల యందు వలె, వీని యందును దీర్ఘ పూర్వక బిందువును దీర్ఘముగా పరిగణింప రాదా యన్న— నీ కళికోత్కళికలు సంగీత శాస్త్రమునకు సంబంధించినవి— ఇవి— కొన్ని తాళములతో పాడదగినవి. లాక్షణికు లీయీ కళికోత్కళికల నీయీ తాళములతో పాడ వలెనని స్పష్టముగా నిర్దేశించి యున్నారు— ఆ తాళములు కళికోత్కళికల యందుగల మాత్రల ననుసరించి యుండును.

ప్రస్తుతము పెన్నింట పదము గల కళిక— జయ భద్ర రగడ— దీనికి తాళము జంపెతాళము. ఈ తాళ నిర్ణయ మాయా రగడల మాత్రా లక్షణములను బట్టి నిరూపిత మగును.

జయ భద్ర రగడ యైదేసి మాత్రలకు ఎఱుగునది. అనగా ఖండ గతిని నడచునది— ఖండ గతికి తాళము—జంపె—

2111 2111 11111 1121
తాపసుల— యీాలువుల— తనరుతప— ములపంట

ఇందు— తాదీర్ఘము— 2 లఘువులు లేక 2 మాత్రలు. ప— హ్రస్వము— ఒక మాత్ర లేక 1 లఘువు.

అట్లే—
2111 2111 1121 221
చూపులకు— నెల్లపర— సుఖవార్ధి— పెన్నింట

ఇచట— వజ్ఝలవారి ననుసరించి— పెన్నింట— అని నిల్పిన నందారు మాత్రలగును— పెన్నింట— 6 మాత్రలు. 'నీ' దీర్ఘము గావున రెండు మాత్రలు— బిందు పూర్వకము గావున— మరియొక మాత్ర— అట్లయినచో తాళము పడదు సరికదా— రగడ లక్షణమునకు, సంగీత శాస్త్రమునకు విరు ద్ధమే కాక— భాషా సంప్రదాయ విరుద్ధముకూడ.

పై వివరణను బట్టి యొక ప్రాచీన ప్రయోగమును, మనము మార్చిన నెట్టి యవ్యవస్థ యప్రామాణికత రచనకు గలుగునో తెలియగలదు— ఒక్కొక్క ప్రయోగ మును గూర్చి యెంత సూక్ష్మముగా పరిశోధన చేయవలెనో అప్రక్రియనిది నిరూపించును.

## 1. ఎల్లిదము :

ఇక సూర్యరాయాంధ్ర నిఘంటువుపై నాధార పడుట చేత సర్వస్వకర్త లీక్రింది శబ్దములకు కవి ప్రయో గము లేదని వ్రాసిరి. కాని యవి ప్రసిద్ధ కావ్యముల యందే గానవచ్చు చున్నవి. ఎల్లిదము— సర్వస్వము రెండవ సంపుటము పుట 1759 ఏలిదము చులకదనము.... అను దానికి "ఏల్లి దము, ఎల్లిదము— అను రూపద్వయము సిద్ధించును." అని వ్రాసి, ఏలిదము, ఏల్లిదము అనువానికి గవి ప్రయోగ ములు చూపి ఇట్లు వ్రాసిరి.

సూ. రా. నిఘంటువునం (సూర్య రాయనిఘంటువు పుట 837) బెక్కు ప్రయోగములు చూపం బడెను గాని "లద్వితవము" ప్రాసఘటితముగా నొక్కటైన లభింప దయ్యె" ఇచట లద్విత్వము అనగా ఎల్లిదము అనిప్రాసలో 'ల్లి' యుండుట. సూ. రా. నిఘంటువు చూపలేదు గాని— చేమకూర వెంకట కవి ఈ శబ్దము నెంత చమత్కారముగా ప్రాసలో వాడినాడో చూడుడు:

ఎల్లిదమ కంచుం బల్కిరి
నెల్లిదమగు గాదె తిరిగి యొబైకొన్నన్— (3.22)

2. **ఏమిటి**— సర్వస్వము ప్రథమ సంపుటము 929 పుట. ఔప విభక్తి నిరూపణ వివరణమున నిట్లున్నది: "ఏమిటి" అనునది వ్యవహారమున నున్నను మహాకవి ప్రయోగ దృష్టము కాలేదు—"

సర్వస్వ కర్త లిట్లు వ్రాయుటకు గారణము లేక పోలేదు. వారు సూర్యరాయాంధ్ర నిఘంటువునే తప్ప మూల గ్రంథములను చూడరు— ఏమిటి శబ్దమందు లేదు. కావున సర్వస్వకారుల కంట బడలేదు—

ఈ శబ్దము ఏమిట, ఏమిటి, ఏమిటన్— ఏమిటి కిన్—అనురూపములతో నన్నయ తిక్కన శ్రీ నాథాది మహా కవులందరును ప్రయోగించిననే గాని క్రొత్తది గాదు. ఇవిగో ప్రయోగములు:

నన్నయ :

ఆది. 8.34 వారలతోడ నీవు నిగ్రహ మొనరింప నేమిటికి
సభా. 2.63 నీకూర్మియు నీ యలుకయు నా కవి యేమిటికి—
ఆరణ్య. 1.138 భీమార్జునుల బాహు బలమేమిటికిన్.
ఎఱ్ఱన, ఆరణ్య. 5.115 మా కేమిటం గడవ.
7.423 అద్దేవుడస్త్ర మించు కేమిటన్.
తిక్కన. విరాట. 1.187 మనకడకు నేమిటికి వచ్చెనొకో.
2.214 ఏమిట నెట్టు లరయ వలసె నమ్మెయి.
భీష్మ. 1.48— ఏమిటి వాఁడు.
ద్రోణ. 2.257—4.134, 5.105 ఏమిట.
శల్య. 2.74 ఏమిటి వాడవై ఇచ్చితి పుడమి.
శాంతి. 5.3 ఏమిట రూపగు బురుషుండే.
అశ్వ. 2.185 ఏమిట కైనన్.

తిక్కనకు ముందుగనే పాల్కురికి సోమనారాధ్యుడీ పదమును పండితారాధ్య చరిత్రమున ప్రయోగించి యున్నాడు:

ఏమిటికి :

శివు మహత్త్వము మీఁదు జెప్ప నేమిటికి మహిమ—21 పుట

వినయుఁ బంచాక్షరి ఇంత యేమిటికి — 146 పుట

మాట లేమిటికి ముమ్మాటికి భక్తి — 256 పుట

మోచు డేమిటికి — 506 పుట

ఏమిట :

తక్కునా గమములు జిక్కనేమిటను—పర్వత 5—12 పుట

శ్రీనాథుడు— నైషధము— 4.86 ఏమిటి కేడ్చెదవాసన తామరసం బెత్తి.

పోతన—భాగవతము—చతుర్థ స్కంధము— ఏమిటియందు—

పింగళి సూరన— కళా పూర్ణోదయము— 5.51 ఏమిటి కతల్.

3. **తాయత:** తాయెతుకు తాయత అనురూపాంతర మున్నట్లు కవి ప్రయోగము వలన తెలియుచున్నది. ఈ శబ్దమును గూర్చి సర్వస్వమున నిట్లు గలదు. పుట. 1755. " 'తాయతు' అను 'అ' కార మధ్య స్థితికిఁ బ్రయోగములు లేవు—" కాని తంజావూరి రఘునాథ రాయని రమాయణమున:

సీ. పా. మున్నిటి రాయని ముంజేతి వజ్రము
యంపు హం వీరు తాయత యనంగ

అని యకార మధ్య స్థితికినిర్ధారకముగా ప్రయోగము కలదు. ఈ గ్రంథ మాంధ్ర సాహిత్య పరిషత్తు వారిరువదేండ్ల క్రిందట ప్రకటించిరి. అందు 4—11లో పై ప్రయోగమున్నది. కాని సూర్యరాయాంధ్ర నిఘంటు తృతీయ సంపుటమున పుట 784లో నీ ప్రయోగ ముదాహృతము కాలేదు.2 పై విషయములు ప్రయోగ సేకరణమున మన మెంత జాగరూకతతో నుండవలెనో విశదీకరింప గలవు.

2. శబ్ద రత్నాకరాను బంధము కొరకు నే ననేకముద్రితాముద్రిత గ్రంథముల నుండి యపూర్వములగు నెన్నియో ప్రయోగములను సేకరించితిని. కాని వానిలో కాల, స్థల పరిమితులను బట్టి కొన్ని మాత్రమే (500) ఆ యనుబంధమున— నీయ గలిగితిని— సమగ్రాంధ్ర వ్యాకరణమునకేమి, సమగ్రాంధ్ర నిఘంటువున కేమి, ప్రయోగములే— మూలాధారములు. అట్టి మహా గ్రంథముల నిర్మాణమునకై నేను మూడు దశాబ్దాల నుండి కృషి సేయుచున్నాను. కాని నా వంటి ఏకైక వ్యక్తి మూలమున నిట్టివి ఫలోన్ముఖములు కాజాలవు. మహోదారుల, సాహిత్య సంస్థల సహాయమున నట్టివి పూర్తిగా గలవు— కాబట్టి యట్టి వారీ గ్రంథ రచనా కార్యక్రమములకు పూను కొందురుగావుతమని విన్నపము.



# కేంద్ర అకాడమీల ప్రచురణలు - గ్రాంటులు

కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యాన నేషనల్ బుక్ ట్రస్ట్, సాహిత్య అకాడమీ, లలితకళా అకాడమీ, సంగీత నాటక అకాడమీ అనేవి పనిచేస్తున్నవి. వీని కింద లక్షల రూపాయలు వ్యయం అవుతున్నది. పెక్కు గ్రంథాలు ప్రచురించారు. అనేక సంస్థలకు గ్రాంటులు ఇచ్చారు. ఇకముందు కూడా ఈ కార్యక్రమాలను కొనసాగించ దలచారు. అయితే వీనికింద లక్షలు ఖర్చువేసి గ్రంథాలు ప్రచురించినా అవి అమ్ముడు పోవడం లేదని, గ్రాంటుల మంజూరులో అనేక అవకతవకలు ఉన్నాయని వీనికి సంబంధించిన 1962—63 ఆడిట్ రిపోర్టు బయట పెట్టింది. భారత ప్రభుత్వం, ప్రచురించిన ఈ రిపోర్టులోని వివరాలు ఇవి :—

జాతీయ గ్రంథ ప్రచురణ సంస్థ (నేషనల్ బుక్ ట్రస్ట్) 1957 జూన్‌లో స్థాపించబడింది. 1962 డిసెంబరు 31 నాటికి వివిధ భాషలలో 65 గ్రంథాలు ప్రచురించింది. ఉచితంగా పంపించిన కాపీలు పోగా, ప్రజలలో అమ్ముడుపోయిన కాపీలు నూటికి 5 మొదలు 42 వంతుల వరకు ఉన్నవి. కొన్ని గ్రంథాలు "అసలు అమ్ముడుపోకుండా ఉండిపోయాయి."

ఈ ట్రస్టు కింద 1962—63 లో జరిగిన ఖర్చులు: జీతాల కింద రు. 1, 22,134. ప్రయాణాల కింద ఖర్చులు రు. 20,498. అద్దెలు—విద్యుత్ ఛార్జీలు రు. 47,748. ప్రచురణ వ్యయం రు. 63,470. అంటే ఈ సంస్థ అసలు లక్ష్యమైన గ్రంథ ప్రచురణల మీద కంటె, ఇతరత్రా వ్యయం నూటికి 340 వంతులు హెచ్చు అని ఆడిటర్లు తేల్చారు.

అయితే తమ "ప్రచురణల అమ్మకాలను గురించి సరైన నిర్ణయాలకు రావడానికి తగిన సమయం 1962 డిసెంబరు నాటికి రాలేదు." అని ఈ ట్రస్టువారు వ్యక్తంచేసిన అభిప్రాయాన్ని కూడా ఆడిటర్లు నమోదు చేశారు. 1962 సెప్టెంబరులో ఈ ట్రస్టువారు ఒక పరిశీలక సంఘాన్ని నియమించారు. వీరు ట్రస్టు ఉద్దేశించిన ప్రచురణలను పరిశీలించి, తయారౌతూఉన్న 44 గ్రంథాల పనిని ఇక సాగించవలసిన అవసరం లేదని, 22 గ్రంథాల ప్రచురణను నిలిపి వేయాలని, 13 గ్రంథాల ప్రచురణకు ప్రయివేటు పబ్లిషర్లను ప్రోత్సహించాలని సిఫారసు చేశారు. ఇందుకింద నిరుపయోగంగా జరిగిపోయిన ఖర్చు రు. 64,000 లు.

సాహిత్య అకాడమీవారి ప్రచురణలకు 15.38 లక్షల రూపాయలు ఖర్చు జరిగింది. సాహిత్య ప్రయోజనం గల విదేశీ భాషా గ్రంథాలను ఒకటి, రెండు భారతీయ భాషలలో ప్రచురించారు. అయితే గత అయిదేళ్లలోను (1962 నాటికి) వీనితో అమ్ముడు కాకుండా ఉన్న గ్రంథాలు నూటికి 41 నుంచి 71 వంతుల వరకు ఉన్నవి. ఈ గ్రంథాల "అచ్చు ఆర్డరు, ప్రతి పుస్తకం విషయంలోను దాని అమ్మకానికి గల అవకాశాలు, ముద్రణ వ్యయంలో పొదుపు దృష్ట్యా ఇవ్వడం జరిగిందని "ఇలాంటి ఉద్గ్రంథాలకు పాఠకులు లభించడానికి కొంత వ్యవధి అవసరం" అని కేంద్ర విద్యా శాఖవారు అభిప్రాయ పడ్డారు. అయినప్పటికీ "20 గ్రంథాలు నూటికి 10 కి తక్కువగాను, 8 గ్రంథాలు నూటికి ఒక్కటి కూడాను అమ్ముడుపోలేదు" అని ఆ రిపోర్టు వెల్లడించింది.

లలితకళా అకాడమీవారు 10.48 లక్షల రూపాయల వ్యయంతో 19 ప్రాచీన గ్రంథాలను 11 నవ కాలీన ఉద్గ్రంథాలను ప్రచురించారు. వీని కాపీలలో నూటికి 52 వంతులు అమ్ముడు పోలేదు. అచ్చు వేసినది 151 వేల కాపీలు, నిల్వ ఉన్నది 78,885. నిల్వఉన్న వానిలో చాలా కాపీలు చెదలుపట్టి, కుట్లు పరిగా లేక చెడిపోయాయి. స్వల్పవ్యయంతో వానిని బాగుచేయడానికి కూడా వీలుపడదు.

సంగీత నాటక అకాడమీవారు మూడు గ్రంథాలు ప్రచురించారు. 1963 మార్చి నాటికి వీనిలో అమ్ముడు పోకుండా ఉన్నవి నూటికి 85 నుంచి 95 వంతుల వరకు ఉన్నాయి. ఈ గ్రంథాల పేర్లు "100 రవీంద్రనాథ టాగూరు గీతాలు" (వెల రు. 25) "సంగీత గాయకా సంస్మరణ్" "టాగూరు శతవర్ష సంచిక" (వెల రు.. 10). వీనిలో మొదటిది 1000 కాపీలు వేశారు, 42 అమ్ముడు పోయాయి.

86 కాపీలు కాంప్లిమెంటరీల కింద పంపారు. రెండవది 970 కాపీలు వేశారు. 19 అమ్ముడు పోయినవి. 20 కాపీలు కాంప్లిమెంటరీలుగా వెళ్లినవి. మూడవది 2200 కాపీలు వేయగా 100 మాత్రమే అమ్ముడు పోయినవి. కాంప్లిమెంటరీలుగా వెళ్లినవి 181.

ఈ స్వంత ప్రచురణలు కాక, అయిదు గ్రంథాలు ప్రచురించడానికి (1956—60 లో) అయిదుగురు ప్రయివేటు పబ్లిషర్లకు సంగీత నాటక అకాడమీవారు రు. 19,100 లను సహాయక గ్రాంటులుగా ఇచ్చారు. అయినా ఇంతవరకూ ఈ గ్రంథాల ప్రచురణ జరగలేదు.

## గ్రాంటులలో లోపాలు

ఈమధ్యనే పార్లమెంటుకు అందజేసిన ఈ ఆడిట్ రిపోర్టులో సంగీత నాటక అకాడమీవారు గ్రాంటులు ఇవ్వడంలో చేసిన అవకతవకలు కూడా ఉదాహరించబడినవి. వివరాలు ఇవి :

1958 ఏప్రిల్‌లో ''కథక్ నృత్యం'' మీద రంగుల డాక్యుమెంటరీ తీయడానికి ఒక ప్రయివేటు ప్రొడ్యూసరుతో లక్ష రూపాయలకు కంట్రాక్టు చేసుకున్నది. ఒక్కొక్కదఫా రు. 20,000 లు చొప్పున మూడు దఫాలు ''ఆన్ అకౌంట్'' మీద సొమ్ము చెల్లించింది. కాని, అసలు కంట్రాక్టులో ఉన్న షరతుల ప్రకారం, రంగుల నెగిటివ్ ఫిల్ము వచ్చిందనే సాక్ష్యాధారాన్ని చూడకుండానే ఈ సొమ్ము చెల్లించింది. ఇప్పటికి అయిదేళ్లు గడిచినా ఈ డాక్యుమెంటరీ ఫిల్ము బయటికి రాలేదు.

వివిధ సంస్థలకు ఈ అకాడమీవా రిచ్చిన గ్రాంటులను పరిశీలించి చూడగా, గ్రాంటులు ఇవ్వడానికి సంబంధించిన నిబంధనావళిని సరిగా పాటించలేదని తెలియవచ్చినట్టు ఆడిట్ రిపోర్టు వెల్లడించింది. ఉదాహరణలుగా న్యూఢిల్లీలోని కథాకళి అంతర్జాతీయ కేంద్రం, న్యూఢిల్లీలోని కర్ణాటక సంగీత సభ, మద్రాసులోని కర్ణాటక సంగీత కేంద్ర కళాశాల, కలకత్తాలోని గారీపూర్ ట్రస్టులను పేర్కొన్నది. నిబంధనల ప్రకారం ఈ సంస్థలకు అకాడమీవారి ''రికగ్నిషన్'' ముందు రావాలి. ఆ తర్వాత గ్రాంటులు ఇవ్వాలి. కాని, వీని విషయంలో అలా జరగలేదు. కర్ణాటక సంగీత కేంద్ర కళాశాలను ప్రభుత్వం నిర్వహిస్తున్నప్పటికి 1955—56 నుంచి 1962—63 వరకు మొత్తం 190 వేల రూపాయల గ్రాంటులు మంజూరు చేశారు.

1962 మార్చి 19 న ఒక కార్యదర్శిని ''అపసవ్యంగా'' నియమించడాన్ని గురించి కూడా ఆడిట్ నివేదిక వెల్లడించింది. మూడు నెలల తర్వాత ఈ నియామకం సంగతి పునః పరిశీలన జరుగగలదనే షరతుమీద దీనికి ప్రభుత్వం అనుమతించింది. ఈలోగా ఈయన (కార్యదర్శి) తన పదవికి రాజీనామా చేశాడు. 1962 జూన్ 19 న దానిని ఆమోదించారు. అయితే ఆయనకు, ఆయన సతీమణికి, కుమార్తెకు ఢిల్లీ నుంచి పారిస్‌కు విమాన ప్రయాణ ఛార్జీలను పరిహారం కింద చెల్లించారు.'' ఇలా చెల్లించాలని ఉద్యోగ నియామక పత్రంలో ఎక్కడా లేదు.

కేంద్ర విద్యా శాఖవారు 1961 డిశంబరులో మద్రాసులోని రసికరంజని సభ (మైలాపూరు) వారికి 25,000 రూ. ల గ్రాంటు ఇవ్వడాన్ని గురించి కూడా ఆడిట్ నివేదిక వెల్లడించింది. ఈ సభ జమాఖర్చుల (1958 నుంచి 60 వరకు) లో సాలుకు 14,000 రూ. ల మిగులు కనిపిస్తున్నప్పటికి ఈ గ్రాంటును మంజూరు చేశారు. ఈ పథకానికి సంబంధించిన నిబంధనలను సడలించి కేంద్ర ఆర్థిక శాఖ అనుమతితో దీనిని చెల్లించినట్టు విద్యాశాఖవారు వివరించారు. తన భవన నిర్మాణానికి 83,000 రూ. లు అప్పు చేసినందున, అందులో ఇంకా చెల్లగట్టవలసిన 56,000 రూ. తన స్వల్ప రాబడికి మించిన భారంగా ఉన్నందున కేంద్రం సహాయాన్ని రసికరంజని సభవారు అర్థించారు.. వారు మంజూరు చేశారు.

పార్లమెంటు పబ్లిక్ అకౌంట్సు కమిటీ అధ్యక్షులు శ్రీ మహావీర్ త్యాగి మార్చి 31 న లోక్‌సభకు సమర్పించిన 24 వ నివేదిక ద్వారా సంగీత నాటక అకాడమీకి సంబంధించిన మరికొన్ని కింది వివరాలు తెలియవచ్చినవి.

సంగీత నాటక అకాడమీ నిధులలో హెచ్చు మొత్తాలను నగదు రూపంలో చేతిలో ఉంచుకొనడం, నగదు చిట్టా వ్రాయడంలో తీవ్రమైన లోపాలు, చెల్లింపుల పద్ధతిలో తప్పులను గురించి ఆడిట్‌వారు 1957 ఆరంభంలోనే కేంద్ర సాంస్కృతిక—శాస్త్రీయ పరిశోధనల శాఖ దృష్టికి తీసుకువచ్చారు. ఆ తర్వాత వార్షిక నివేదికంలో కూడా ఈ లోపాలు సవరించబడలేదు. 1959 లో మాత్రం ప్రాథమిక దర్యాప్తు జరిపించారు. ఈ అకాడమీ ఆర్థిక వ్యవహారాలను దర్యాప్తు చేసిన అధికారి తన నివేదికలో, లాసు కనుగొన్న అంశాలను బట్టి ప్రజా నిధుల దుర్వినియోగ నివారణ దృష్ట్యా, మరింతగా దర్యాప్తు అవసరం కాగలదని ధృవపడినట్లు సిఫారసు చేశారు. అయినప్పటికి 1960 మార్చి 21 న ఈ దర్యాప్తుకు కూడా ఉత్తరువు జరిగింది. ఈలోగా ఏ కార్యదర్శి హయాములో ఈ లోపాలు జరిగినవో ఆ కార్యదర్శి 1960 మార్చి 12 న (దర్యాప్తు ఉత్తరువు జరగడానికి తొమ్మిది రోజులు ముందుగా) రాజీనామా చేయడానికి అనుమతించారు. 1960 మార్చి 21 న జరిగిన దర్యాప్తువల్ల అకాడమీ నిధులలో 189 వేల రూపాయల మోసం (డిఫాల్ కేషన్) 55,600 రూ. ల వరకు తాత్కాలిక దురుపయోగం (మిస్ అప్రోప్రియేషన్) జరిగినట్టు తెలియవచ్చింది.

ఆడిట్‌వారు తీవ్రమైన లోపాలను, తప్పులను చూపుతూ వచ్చినప్పటికి కేంద్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖవారు ఈ అకాడమీకి గ్రాంటులు చెల్లిస్తూ వచ్చారు. 1955—56 నుంచి 1960—61 వరకు 48 లక్షల రూపాయలు చెల్లించారు. 1961—62 లో 12 లక్షల రూపాయలు ఇచ్చారు. లోపాలు కలవన్న సూచనలు ఉన్నప్పటికీ

సహాయక గ్రాంటులను అకాడమీవారు సక్రమంగానే, వానిని ఉద్దేశించిన ప్రకారం వినియోగించారన్న నిర్ణయానికి కేంద్ర శాఖవారు ఎలా రాగలిగారో బోధపడకుండా ఉందని పబ్లిక్ అకౌంట్సు కమిటీవారు తమ నివేదికలో వ్యాఖ్యానించారు. ఈ సందర్భంలోనే ప్రభుత్వానికి కింది సూచనలు చేశారు.

(1) చాలవరకు లేదా, పూర్తిగాను ప్రభుత్వ నిధులతో నడిచే సంస్థలకు ఇచ్చే గ్రాంటులకు అనువైన షరతులు పెట్టి, ఆ గ్రాంటులు ఉద్దేశించిన దానికి గాక మరొక విధంగా వినియోగించిన సందర్భాలలో గట్టి చర్యలు తీసుకొనే ఏర్పాట్లు జరగాలి. (2) ఇలాంటి సంస్థల నిర్వాహక వర్గంలో ఉండే ప్రభుత్వ ప్రతినిధి తగు జాగ్రత్త తీసుకొని నిధుల దుర్వినియోగం, లేదా మరొకందుకు వ్యయం జరుగుతున్న సందర్భాలు కానవచ్చినప్పుడు ప్రభుత్వానికి తగునివేదికను పంపాలి.

## షేక్స్పియర్ మహాకవి 400 వ శత జయంతి

అమరకవి విలియం షేక్స్పియర్ 1564 ఏప్రిల్ 23 వ లండన్‌కు సుమారు 90 మైళ్ల దూరంలో ఉన్న వార్విక్‌షైర్‌లోని స్ట్రాట్‌ఫర్డ్ అపాన్—అవన్‌లో జన్మించారు. ఈ ఏప్రిల్ 23 వ తేదీకి ఆయన జన్మించి 400 సంవత్సరాలు అవుతుంది. ఈ సందర్భంలోనే ప్రపంచ వ్యాపితంగా ఆయన 400 వ శత జయంతి ఉత్సవం జరుగుతూ ఉంది. ఆ కవి మేధాశక్తి ఈనాటికీ అపూర్వమే. కాలం గడిచినా మార్పు చెందని విశిష్ట కవితాసృష్టి ఆ మహాకవిది.

షేక్స్పియర్ జన్మించినది మొదటి ఎలిజబెత్‌రాణి హయాములో. స్వర్ణయుగము ఆమె పరిపాలనా కాలము. విద్యా వ్యాసంగంలో, సాహిత్య వికాసంలో, వాణిజ్యరంగంలో కొత్తలు అనేకం కనుగొన్న కాలమది. ఎనిమిదవ హెన్రీ క్రైస్తవ పీఠాలను రద్దుచేసిన పర్యవసానంగా ఉత్పత్తిల్లిన విపరీత పరిస్థితులు అప్పటికి సద్దు మణిగినవి. భూస్వాములు తెర వెనుకకు పోయారు. మధ్యమ తరగతి వ్యాపారస్థులూ, సాహస యాత్రికులు రంగంలోకి వస్తున్న సమయమది.

అప్పటి ఇంగ్లండు గ్రామీణంగానే ఉంది. ఇండ్లలో నూనె దీపములు, కొవ్వు వత్తులు. రాకపోకలకు గుర్రములు. ఏ వ్యక్తికి ఆ వ్యక్తియే రక్షకుడు. ఇంటికి కంచె వేసుకొనడం నేర్వడం విద్యాశిక్షణలో మొదటి అంశము. భూస్వాములు రాకుమారులు, బిరుదులు కలవారు, నగర వాసులు, వ్యాపారులు, శ్రామికులు, ఆధునిక పద్ధతిలో కలసి మెలసి ఉండేవారు. వ్యాపారస్తులు బాగా సంపాదించేడివారు. భూస్వాములకు పెద్దరికం గల సమాజంలో వ్యాపారులకు కూడా పెద్దరికం లభించింది. కలవారిలో కొందరు తమ బిడ్డలను శిక్షణ కోసం వ్యాపారస్థుల వద్దకు పంపేవారు. సంతలూ, ఉత్సాహభరితమైన ఉత్సవాలు ఆనాడు విశేషంగా జరిగేవి. జన రద్దీ కల చోట జేబు దొంగలు ఉండేవారు. నిర్జన ప్రదేశాలలో దారి దోపిడి ముఠాలు కూడా ఉండేవి.

అలాంటి సమాజంలోనే ఎలిజబత్‌రాణి పేదల చట్టం అమలు జరిపించింది. ఐరోపాలో అలాంటి చట్టమును అమలు జరిపిన మొదటి దేశం ఇంగ్లండు. రాజ్యంలో శాంతి ఎక్కువ కనుక గృహాలలో సౌకర్యాలకు ప్రజలు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు. గృహాల అంతర్భాగాలు చాలా అందంగా ఉండేవి. కొత్త దేశాలు తెలియవచ్చి, వాణిజ్యం విస్తృతం అయినది ఆనాడు. ఈవిధంగా షేక్స్పియర్ నాటి ప్రపంచం చైతన్యవంతంగా ఉంది.

ఎలిజబత్‌రాణి హయాములో నటునికీ, నాటక రచయితకు కొత్త హోదా వచ్చింది. నటులు దేశమంతా పర్యటించి కోటలలోను, ప్రభువుల పెద్ద భవనాలలోను నాటకములు ప్రదర్శిస్తూ ఉండేవారు. లండన్‌లో థేమ్సు నది ఒడ్డున సేల్‌వార్క్‌లోని గ్లోబ్ థియేటర్ వంటి వానిలో షేక్స్పియర్ నాటకములు ప్రదర్శించేవారు. ఆ కాలంలో తెరలు కాని, కింద నుంచి వెలుగు ప్రసరించే దీపాలు కాని ఉండేవికాదు. కాని, షేక్స్పియర్ పదజాలం నగరంలోని వ్యాపారస్తులను, వారి వద్ద ఉండి శిక్షణ పొందేవారిని, వారి ప్రియురాండ్రను, న్యాయవాదులను సమ్మోహితులను చేసేది. లండన్‌లోని ఓల్డ్‌విక్, ఆల్విడ్ థియేటర్ వద్దా షేక్స్పియర్ నాటకాలు చూచేందుకు నేటివలెనే ఆనాడు కూడా ప్రేక్షకులు గుమిగూడేవారు.

—రోనాల్డ్ ఫారెల్.

## మహాకవి జన్మస్థలం

షేక్స్పియర్ జన్మస్థలం కావడమే స్ట్రాట్‌ఫర్డ్—అపాన్—అవన్ యొక్క విశేషం. పరిశ్రమలు ఇంతగా అభివృద్ధి చెందినా స్ట్రాట్‌ఫర్డ్ వీధులు, భవనాలు, అంగళ్లూ, ఉద్యానవనాలు పురాతన కాలాన్ని గుర్తు చేస్తాయి. ఆ కాలపు భవనం, ఇంగ్లీషు పల్లెల పూలచెట్లు, పచ్చిక బయళ్లు, పట్టణం మధ్యగా ప్రవహించే అవన్ నదీ, ఆ నది ఒడ్డున ఉన్న షేక్స్పియర్ థియేటర్ నేటికీ అందాలు చిమ్ముతూ ఉంటవి.

ఈ నాటక మందిరం షేక్స్పియర్ మహాకవికి స్మారక చిహ్నం. మందిరం నమూనా రూపొందించినది మిస్ ఎలిజబత్ స్కాట్. ఎర్రని ఇటుకలతో ఆధునిక పద్ధతులలో నిర్మించిన ఆ మందిరానికి 1932 లో ప్రారంభోత్సవం జరిగింది. అక్కడ ఉండే పాత నాటక మందిరం 1926 లో అగ్నిప్రమాదానికి గురి అయింది. దాని స్థానే ఈ కొత్త మందిర నిర్మాణానికి, నిర్వహణకు నిధులు ప్రపంచం నలుమూల నుంచీ వచ్చాయి.

కలపతో, వజ్రపు టాకారపు కిటికీలతో నిర్మించిన ఈ భవనం స్థానంలో ఒకప్పుడు రెండు గృహాలు ఉండేవి. అందులో ఒకటి షేక్స్పియర్ నివాస గృహం. రెండవది అతని తండ్రి జాన్ షేక్స్పియర్ దుకాణము, గిడ్డంగి. 1847 లో

ఈ భవనాన్ని జాతీయ స్మారక మందిరంగా కొన్నారు. ఇది ప్పుడు ధర్మకర్తల నిర్వహణలో ఉంది. గత నాలుగు శతాబ్దాల లోను కొన్ని మరమ్మతులు అవసరమైనా భవనం చక్కగా ఉంది.

షేక్స్పియర్ జన్మించిన పడకగదిలో ఆనాటి సామానులు అలాగే ఉన్నాయి. చిత్తరువులు చెక్కిన ఎనిమిదవ హెన్రీ పెట్టె, 17 వ శతాబ్దంనాటి ఊయేల, నాటి అల్మికలు, ఒక కొయ్య మంచం ఆ గదిలో ఉన్నాయి. షేక్స్పియర్ నివాస గృహం తోటకు మధ్యగా ఉంది. షేక్స్పియర్ జీవితాన్ని, సమకాలీన పరిస్థితులను, అప్పటి అపూర్వ గ్రంథాలను, వ్రాత ప్రతులు, బొమ్మలు వగైరాల ప్రదర్శనకు ఆ భవనంలో కొంత భాగం వినియోగించారు.

షేక్స్పియర్ సతీమణి ఆన్‌హాతవే. ఆమె గృహం కూడా ఆమె కాపురం ఉన్న రోజులలో ఎలా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంచారు. అది ఆనాటి శిల్పకళా నైపుణ్యానికి అపూర్వ చిహ్నం. ఆదిలో అది పశువుల కొట్టమట. 1892 వరకు అది హాతలే కుటుంబం కింద ఉంది. ఆ సంవత్సరమే షేక్స్పియర్ జన్మదినోత్సవ సంఘంవారు దానిని కొన్నారు. ఇప్పటికీ అది వారి అధీనంలో ఉంది.

షేక్స్పియర్ విశ్రాంతిగా కాలక్షేపం చేసి 1616 లో కన్ను మూసిన భవనం ''న్యూ ప్లేస్''. స్ట్రాట్‌ఫర్డ్‌లోని అందమైన పెద్ద భవనాలలో ఇదొకటి. మొదటి ఛార్లెస్ సతీమణి హెన్రిట్టా మెరియా ఒకప్పుడు ఈ భవనంలో నివసించింది. 18 వ శతాబ్దారంభంలో దీనిని పునర్నిర్మించారు. 1759 లో ఈ భవనం కూలిపోయింది. కాని, దీనికి చెందిన నాట్ గార్డెన్‌ను మాత్రం ఆనాటి దానివలెనే నేటికి షేక్స్పియర్ స్మారకచిహ్నంగా పరిరక్షించుతున్నారు. తోటకు వెనుకవైపున పచ్చికబయలు ఆకుపచ్చరంగు వెల్వెట్ పరచినట్టు ఉంటుంది. ఆనాడు షేక్స్పియర్ నాటిన మల్బరి చెట్లు నేటికీ అక్కడ పెరుగుతున్నవి. ఆనాడు ఇది షేక్స్పియర్ ఇంటి పెరటి తోట. ఆ తోటలో కూర్చునే కలలు కనేవాడు మహాకవి. దాని ప్రక్కనే 15 వ శతాబ్దంనాటి క్రైస్తవాలయం, గ్రామర్ స్కూలుఉన్నాయి. గిల్డ్ సభ్యుల విద్యాభ్యాసానికి గిల్డ్ ఆఫ్ ది హోలీ క్రాస్ ఏర్పాటుచేసిన పాఠశాల ఇది. దీనిలో షేక్స్పియర్ విద్యాభ్యాసం చేశాడు. దీనికి దిగువగా గిల్డ్ హాల్ ఉంది. దానిలో జరిగిన నాటక ప్రదర్శనల వల్లనే నాటకాలంటే షేక్స్పియర్‌కు చిన్ననాటి నుంచి అభిమానం ఏర్పడింది. వీటన్నింటి కంటె ఎత్తుగా హోలీ ట్రినిటీ తాలూకు చర్చి ఉంది. దీనిలో ప్రాచీన బైబిల్ ఒకటి ఉంది. పారిస్ రిజిస్టరులో షేక్స్పియర్ బాప్టిజమ్ స్వీకరించిన తేదీ వివరాలు, మరణం వివరాలు ఉన్నాయి. మహాకవి మరణం తర్వాత కొన్ని సంవత్సరాలకు గర్భగుడిలో ఆయన విగ్రహాన్ని నెలకొల్పారు. షేక్స్పియర్ శాశ్వత విశ్రాంతి పొందిన చోట ఒక ఫలకాన్ని ఏర్పాటు చేశారు.

ఏటేటా మహాకవి జన్మస్థలం నుంచి ఒక ఊరేగింపు ఈ సమాధి వద్దకు వచ్చి అక్కడొక పుష్పగుచ్ఛాన్ని ఉంచి వెడుతుంది. చాలామంది అమెరికనులు సాలీనా ఇక్కడికి యాత్రకు వస్తారు. షేక్స్పియర్ మ్యూజియం ఏర్పాటుకు అమెరికనులు భూరి విరాళాలు ఇచ్చారు. అమెరికనులకు ఈ పట్టణం యాత్రాస్థలం కావడానికి మరొక కారణం కూడా ఉంది. హార్వర్డ్ విశ్వవిద్యాలయాన్ని స్థాపించిన జాన్ హార్వర్డ్ 16 వ శతాబ్దంలో స్ట్రాట్‌ఫర్డ్‌లో ఉన్నాడు. ఆయన గృహాన్ని చూడడానికి కూడా అమెరికనులు అధికంగా ఇక్కడికి వస్తూ ఉంటారు.

— డెన్నిస్ బార్డెన్స్.

# డాకర్ ఎల్విన్ రచనలు

## శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

డాక్టర్. ఎల్విన్ గొప్ప, ఆదివాసులసాంస్కృతిక పరిశోధకుడు. మహా విజ్ఞాని. ఈయన మరణం భారతదేశానికి తీరని లోటు. ఇంగ్లండులో పుట్టినా భారత జాతీయోద్యమంలో పాల్గొన్నారు. మధ్యప్రదేశ్‌లోని, నీఫాలోని ఆటవిక జాతుల సంస్కృతి—సాంప్రదాయాలను చరిత్రగా పెక్కు పుస్తకాలు వ్రాశారు. మధ్యప్రదేశ్‌లోని బస్తర్ ప్రాంత వాసులుగా ఉన్న గోండ్లు మాట్లాడే ''ముండ్రా'' భాష తెలుగులోని భాగమని, తెలుగు నుడికారము, ముగింపు ఆ పదాల్లో ఉందని ఆయన పరిశోధనచేసి నిర్ణయించారు. ''పద్మ విభూషణ'' బిరుదును పొందిన ఈయన రచనలు అనేకములు అముద్రితాలు. వాటిలో ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన రచనలు అనేకములు ఉన్నందున, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రద్ధ తీసుకొని, వాటి నన్నింటిని అచ్చు వేయించటము దాని ప్రథమ కర్తవ్యము.



**లేఖలు :**

# "యతిగీతము" యతిభంగము


### శ్రీ దేపరెడ్డి వెంకటరెడ్డి


భారతి సంపాదకులకు,

మహాశయా !

జనవరి భారతిలో ప్రచురించబడిన శ్రీ విశ్వనాథ వారి "యతిగీతము" లలో కొన్ని యతి భంగములు కానవచ్చినవి. ఫిబ్రవరి సంచికలో నేను వ్రాసిన విమర్శకు సమాధానము శ్రీ ఎ.రామమోహనరావుగారు మార్చి సంచికలో వ్రాసినారు. కాని ఈ సమాధానము వ్రాయుటలో శ్రీ రామమోహనరావు గారు తొందరపడినారు. అసలు ఆయన నా విమర్శను పూర్తిగా గ్రహించినట్లు కూడా లేదు.

ఇప్పుడైనా వారు పునఃపరిశీలన చేయుదురని ఆశిస్తున్నాను.

"కవి సమ్రాటులు ఇంత సాధారణ దోషాల పాల్పడుదురా అని ఆశ్చర్యచకితుడనై సందేహ నివృత్తి కొరకు సవిమర్శకముగా వ్రాస్తున్నాను".

"ఇన్ని పొరపాట్లకు బాధ్యులు ముద్రాపకులా? లేక కవిగారేనా........ అన్నింటినీ అచ్చు తప్పుల క్రింద త్రోసి వేయడానికి వీలులేకుండా ఉన్నది."

"సహృదయంతో పండితులు గమనిస్తారని ఆశిస్తున్నాను" అని వ్రాయుచు దోషముల నొక్కొక్కటే చూపించినాను. దానికి ఆయన ఒప్పుకున్నారు.

"వారు చూపించిన దోషములలో రెండు మాత్రమే నిజమైన దోషములు. మిగిలినవి ముద్రా దోషములే". అని అన్నారు. సంతోషము. కాని అంతటితోనే ఊరుకొనియుంటే బాగుండెడిది.

"మూల గ్రంథము పరిశీలింపకయే 'ఇత్యాది దోషాలు కవి సమ్రాటుల లేఖిని నుండి వెలువడవలసినవి కావు........' అని వ్రాయుట సాహసము" అని వ్రాసినారు.

నిజమే ! నేను మూల గ్రంథమును చూడలేదు. దానిని విమర్శించనూ లేదు. భారతిలో ప్రకటితములైన పద్యాల వరకే నా విమర్శ పరిమితమై యున్నది. అన్నీ ముద్రా దోషములు కావని నేనన్నమాట సత్యమైనది కదా ! పొరపాట్లను "సందేహ నివృత్తి కొరకు" చూపించడము సాహసమా ? ఎన్నటికీ గాదు. చూపించిక పోవడము మాత్రము భీరువుల లక్షణము. వారు "కవి సమ్రాటు" లనే అభిమానముచేత వారు పల్కినది వేదముగా భావించడము అజ్ఞానము.

"ఆ పర్వతాగ్రదరీ ప్రాంతములయందు"

ఇందులోని ప్రాసయతి "సమర్థ నీయముగనే తోచును" అని సాధారణముగా వ్రాసినారు. నిజమే! ఇటువంటి ప్రయోగ ములు కొన్ని యక్కడక్కడ నున్నవి. అయినా అది అసాధారణ మైనది. ఎక్కడో మారుమూల మాత్రము ఇట్టివి కానిపించు నవి. ఇటువంటి ప్రాసమును "సంయుతా సంయుత ప్రాసము" అని అందురు కూడ. కాని ఈ ప్రయోగమును సర్వసాధారణముగా కాక అసాధారణముగా, విధిలేని సమయా లలో, అధమపక్షముగా మాత్రమే వాడియున్నారు.

రెండు చోట్ల మాత్రము స్పష్టముగా యతి భంగ మైనదని ఆయన అంగీకరించినారు. అయినా "నిజమారసినచో ఒకటో, రెండో యతి దోషములు కవి సమ్రాట్టులకు గాక, గణ యతి ప్రాసైక బద్ధులగు అల్ప కవులకు పడవు గదా!" అని సమర్థించుచున్నారు. ఆహా ! ఏమి వైచిత్రి ! యతి దోషములు కవి సమ్రాట్టులకే పడతాయట !! అల్ప కవులకు పడవట !!! ఈ వీరి ప్రవచనము తెలుగు సాహిత్యమునకే నూతనముగా నున్నది. కవి సమ్రాట్టులయిన వారు విధిగా యతి దోషములు పాటింపవలెనా? 'ఆవేశంలో' పొరపాటు జరగవచ్చును. తిరిగి సహృదయంతో అంగీకరించి దిద్దుకోగూడదా?

వీరి అమాయకపు రోజులలో అనగా వీరు "గణయతి ప్రాసైక అల్పకవు (బద్ధు) లుగా" నున్నప్పుడు వీరు చూపించిన ప్రాస దోషమును శ్రీ విశ్వనాథ వారు అంగీకరించిరట.' ఇప్పుడైనా వారు అంగీకరించెదరనే నా తలంపు. కాని వీరు మాత్రము వింత వాదముతో సమర్థింప చూచినారు.

ఆవేశంలో పరవళ్ళు త్రొక్కుతున్న భావతరంగిణిని ఛందోబద్ధము చేసి అనగా క్రమబద్ధముగా చెప్పడమే మహా కవుల లక్షణ మౌతుంది. "ఛందాంసి ఛాదనాత్" అన్నయా స్కుని నిర్వచనము ప్రకారము భావాలకు ఛందస్సు తొడుగ వంటిది.

"యతులను, ప్రాసములును అలంకారతుల్యములనియు నవి విడిచిపెట్టిన బాధ లేదనియు నేటి కవులు కొందఱందురు. కాని, వీనివలన తెలుగులోని ఛందోరీతులకు ఎంత మాధు ర్యము, శ్రావ్యత పెంపొందినవో చూడవలసినదని నా ప్రార్థన."

—(తెలుగులో ఛందోరీతులు—డా. గి. వే. సీ. పతి)

"పురుషు డఖిలాంగయుతుడయ్యు జరణయుగము
లేక నడవ సమర్థుడే లోకమునను ?

వేదమునకుఁ బాదంబులై వెలయు కతన
ఛంద మన్నిటలో నవశ్యంబు గాదె ?"
—(అప్పకవి)

అందువలన ఛందస్సును అప్రధానముగా భావించరాదని నారు. విమర్శ గాని, వాదముగాని సత్య సమన్వితమై యుండ వలెను. ఇక్కడ ఆత్మాభిమానము గానీ, పక్షపాతము గానీ, అడ్డు రారాదు. నేను శ్రీ విశ్వనాథవారి పద్యములు చదివి పులకించక పోలేదు. పెద్దలు, అనుసరణీయులు, ప్రామాణికులు కావలె నన్నదే నా అభిమతము.

(హైదరాబాద్) — దేవరెడ్డి వెంకటరెడ్డి.

## ఆవేశం : యతిదోషం

అయ్యా,

కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి "యతి గీతం"లో యతి దోషాలున్నాయని శ్రీ దేవరెడ్డి వెంకటరెడ్డిగారు వ్రాశారు. శ్రీ ఎం.రామమోహన్‌రావుగారు కవిసామ్రాట్ రచనను గూర్చి ఇలా వ్రాయడం సాహసమన్నారు. దానికి కారణ మిలా చెప్పారు: "నిజమారసినచో ఒకటో, రెండో యతి దోషములు కవిసామ్రాట్టులకు గాక, గణయతి ప్రాసైక బుద్ధులగు అల్ప కవులకు పడవుగదా" అని. అంటే గణయతి ప్రాసలను పాటించేవారందరూ అల్ప కవులు అవుతారా? అల్ప కవులు మాత్రమే వాటిని పాటిస్తారా? అవి పాటించకపోవడం కవిసామ్రాట్ అనడానికి లక్షణమా?

"అసలు యతి దోషమెందువలన కలుగునో ఆలోచింప వలయును" అని కవిసామ్రాట్‌గారికి తమకూ జరిగిన ఒక కథను చెప్పి ఇలా అన్నారు : "కవి మహావేశములో వ్రాయు చున్నప్పుడు..............ఇట్టి పొరపాటు సంభవించును." ఆవేశ మంటే మామూలు అర్థం వళ్లు తెలియకపోవడం. మహావేశ మంటే ఇంకా వళ్లు తెలియకపోవడం. అది కవితావేశమైనా, ఏ ఆవేశమైనా ఆవేశం ఆవేశమే, తప్పు తప్పే. ఆవేశంలో చేసే తప్పులకు కోర్టువారు అప్పుడప్పుడు తక్కువ శిక్ష వేయడం కద్దు. మహావేశంలో చేసిన తప్పు అని చెప్పడంలో శ్రీ రామ మోహనరావుగారి ఉద్దేశ్యం అదేమో! తప్పులు ఉన్నాయని ఒప్పుకుంటూనే వాటిని మరొకరు చూపించినప్పుడు అది సాహసమనడం నిజంగా సాహసం. కవిసామ్రాట్టుగారు ఆవేశంలో చేసే తప్పులు సంగతి ఎలావున్నా, శ్రీ రామమోహనరావు గారికి మాత్రం వట్టి ఆవేశం వచ్చినట్టు ఉంది. అసలు యతి దోషం రావడానికి ఆవేశంకూడా అవసరమా? యతిదోషం లేకపోతే ఆవేశం లేకపోయినట్టేనా?

(మద్రాసు) —ఒక సామాన్య పాఠకుడు.

## చిత్రకవి సింగరాచార్యుడు

ఆర్యా,

చిత్రకవి సింగరాచార్యుని శ్రీ వైష్ణవత్వమును దెలుపుచు 1963 నవంబరు నెల భారతిలో లేఖల యందుఁ ప్రచురించిన మా మిత్రులు శ్రీ కొమండూరు రామానుజా చార్యులవారి లేఖయు, పిదప 1964 ఫిబ్రవరి నెల భారతిలోఁ బ్రచురింపఁబడిన శ్రీ రావూరు దొరస్వామిశర్మ గారి విపులమయిన వ్యాసములు చాల ప్రశంసనీయములైనవి. సింగరాచార్యుని సంతతిలోని ఇప్పటి తరములు, బంధు స్థానములు, సింగరాచార్యులు స్వయముగ గ్రంథములలో నుడివిన స్వీయ శ్రీవైష్ణవత్వము మున్నగు విషయములను ఉగ్గడించుచు ఆయన శ్రీవైష్ణవత్వమును చక్కగ చాటి కన్నుల కగుపించుచున్న దానిని వెలె నొనర్చిరి.

శ్రీ శర్మగారు సింగరార్యుని బిల్హణీయము, రాఘవ వాసు దేవీయము అను రెండు కృతులను మాత్రము పేర్కొని ఆయన రచనయగు మూఁడవ కృతిని లోకమునకుఁ దెలుపు భాగ్యము నాకు వదలివైచిరి. అది చిత్రరత్నాకరము అను ప్రబంధము. చిర కాలము క్రిందట ముద్రితమైనది. అప్పుడు సంపాదించి పెట్టుకొనిన వారివద్ద తప్ప ఇప్పుడు దొరకుటలేదు. నేను పూర్వోక్తమైన వ్యాసమును వ్రాయునప్పటికి అది మా యింట, మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు స్థాపించిన మా సొంత పుస్తక భాండాగారమున నుండెడిది. పిమ్మట కొంతకాలము నకు పరహస్తగతమైనది. పిదప దాని ముద్రణ దేశకాలము లను విచారించుచుండ విశ్వదాత దేశోద్ధారక శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులువారు ప్రచురించిన ఆంధ్ర వాఙ్మయ సర్వస్వము ముద్రిత గ్రంథముల పట్టిక నుండి ముద్రణ కాలము 1822 సంవత్సరము అని తెలిసినది. సంస్కృతములో చక్రకవి రచితమైన చిత్ర రత్నాకరముతో సమాన నామధేయము గలిగినందుకు నిదియు నట్టే యవస్థ పాలైనది కాఁబోలు.

మఱియు శ్రీ శర్మగారు సదరు వ్యాసములో 34 వ పుట 2 వ దొంతితో (2 వ కాలంలో) "చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము ద్రితిని వ్రాసికొన్న చిత్రకవి రామా చార్యుఁ డొకఁడు గలఁడు. అతఁడు రఘునందన విలాస కృతి కర్త. అతఁడు వైష్ణవుఁడని ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన లక్షణసార సంగ్రహోపోద్ఘాతములోఁ దెల్పినారు" అని వ్రాసినారు. ఈ చిత్రకవి రామాచార్యుఁడు మా విక్రాల వంశీయుఁడు. ఇప్పటికి సుమారు 190—200 (నూట తొంబది—ఇన్నూరు) ఏండ్లనాటివారు. ఆయన కవితా చమత్కృతులంబట్టి ఆయన పేరుకు ముందు సముచితమైన ఆయన బిరుదునుఁ జేర్చి ఆయనను వాకొనియెదరు. గద్యములో తన వంశనామము 1 విక్కిరాల అని తెలిపియున్నాఁడు. మొత్తముమీద మా వంశములో ఈ రామాచార్యుఁడు, నీయనయన్న బుచ్చయాచార్యుఁడు, నిద్దఱు చిత్ర కవితాచతురులైనందున ఇంటిపేరు కంటెను తరుచుగ బిరుదనామముతోటి వ్యవహృతు లగుట విశేషము—చిత్రకవి

1. విక్రాలవారే విక్కిరాలవారని యనియు, ఎక్కిరాల వారనియును రూపాంతరములతోఁ జెప్పఁబడుట గలదు.

బుచ్చయాచార్యులు చిత్రకవి రామాచార్యులు అని. 2వేద వ్యాసుఁడు, వేదాంతదేశికుఁడు, విశ్వనాథుఁడు మొదలగువారు వారి పూర్వనామములైన కృష్ణద్వైపాయనుఁడు, వేంకటనాథాచార్యులు, అగస్త్యుఁడు మున్నగు పేళ్లను వదలి పై బిరుద నామములతోనే వ్యవహరింపఁబడుచున్నట్లు ఈ సోదరులు, ఇంటిపేరు కలిపి గాక బిరుదు పేరు గలిపి వాకొనుబడుట వారి తద్విద్యాశక్తి విశేషము. ఈ ఇంటిపేళ్లు నాలుగు విధముల నేర్పడుచుండును. ఆ నాలుగు విధములలో వంశములోని గొప్ప పండితుని బిరుదుతో నా పండితుఁడు మొదలు (తద్వంశీయులు) చెప్పఁబడుట ఒక విధము. ఇందుకు ఈ సింగరార్యుఁడు మొదలుకొని తద్వంశము క్రొత్తపల్లి యను వారి మొదటి ఇంటిపేరు సన్నగిలి చిత్రకవియని వారి బిరుదముతోఁ బేర్కొనఁబడుటయే నిదర్శనము.

కలికివాయి — శ్రీ విక్రాల శేషాచార్యులు.

## మొల్ల తులసీదాసుననుసరించినదా?

ఆర్యా,

కడచిన నెల భారతిలో శ్రీ నిడదవోలు వేంకటరావుగారు 'మొల్లకాల నిర్ణయ సమస్య'ను గురించి వ్రాసిన సంపాదక లేఖ ప్రకటితమైనది. అది లోగడ శ్రీ ఆరుద్రగారు ఈ విషయములో వ్రాసినదానికి సమాధానము. శ్రీ ఆరుద్రగారు మొల్ల రామాయణములోని :

సుడిగొని రాము పాదములు సోకిన ధూళివహించిరాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనట పన్నుగ నీతని పాదరేణుని
య్యెడ నొక నోడసోక నిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాము పదకంజ యుగంబు భయంబు పెంపునన్."

అను పద్యమునుదహరించి, మొల్లకాలము నాటికీ ఊహకెట్లు ప్రచారము వచ్చినదని శంకించి వసుచరిత్రకారుని "శ్రీ భూపుత్రి" ఇత్యాదిగాగల పద్యములోకూడ ఇదే కల్పన కాన్పించుచున్నదని చెప్పిరి. 'కాని వ్యాసకర్త ఊహించినట్లుగా నీ కల్పన వసుచరిత్రననుసరించినది కాదు. ఇది తెలుగుననే రామాయణమునందు నుండదు. ఈ కల్పన — జగద్వంద్యమై తుల లేని కీర్తి గడించిన తులసీదాసకృత రామచరిత మానసమను పేరుగల హిందీ రామాయణ మందలిది—' అని వ్రాసి శ్రీ వేంకటరావుగారీపై పద్యమునకు సంబంధించిన భాగమును తులసీ రామాయణము, అయోధ్యాకాండమునుండి యెత్తి హిందీ మూలమును, దానికి నూరేండ్ల క్రిందట హిందీ చౌపాయీ ఛందములోనే వ్రాసిన తెలుగు అనువాదమును కూడ ఉదహరించిరి. 'పై అనువాదము చూచిన మొల్ల— తులసీ రామాయణమునే యనుసరించినట్లు స్పష్టమగుచున్నది. తులసీదాసుకాలము క్రీ. శ. 1530— 1623 అని హిందీ వాఙ్మయ చరిత్రకారులు, అని వ్రాసి శ్రీ వేంకటరావుగారు 'ఈ అనుసరణమునుబట్టి మొల్లకాల నిర్ణయ సమస్య పరిష్కారమగునా?' అని ప్రశ్నించిరి.

2. చూ—1959 ఆగస్టునెల భారతిలో నా రచించిన బిరుద నామధేయులు" వ్యాస శేషము.

కాని మొల్ల పద్యములకుగాని, తులసీదాసు రచనకుగాని మూలమనదగిన శ్లోకములు అధ్యాత్మరామాయణము, బాల కాండ ఆరవ సర్గలో నున్నవి. ప్రసంగము రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటనేగుట, అహల్యనుద్ధరించిన వెనుక గంగనుత్తరించి మిధిలకేగుట. మూలమందలి పంక్తులీ క్రింద నుదహరించుచున్నాను:

"నావిక ఉవాచ:

క్షాలయామి తవ పాద పంకజం నాథ దారుదృషదోః కిమన్తరమ్
మానుషీకరణ చూర్ణ మస్తితే పాదయోరితి కథాప్రథీయసీ,
పాదాంబుజం తే విమలంహి కృత్వా పశ్చాత్పరం తీరమహం నయామి
నో చేత్తరీ సద్యువతీ మలేనస్యా చ్ఛేద్విభో విద్ధికుటుంబ హానిః,
ఇత్యుక్త్వా క్షాలితే పాదే పరం తీరం తతో గతాః.

(అధ్యా. బాల. 6 సర్గ-శ్లో. 3,4,5)

తులసీదాసు వలెనే హిందీలో సూరదాసుకూడ ఈ భావము నిట్లే గ్రహించి తన 'సూర్‌సాగర్' లో వాడుకొనెను. మొల్లకూడ వారివలెనే ఈ భావమును తానధ్యాత్మరామాయణము నుండి గ్రహించియుండును. పాయస విభాగము వంటి మరికొన్ని విషయములలోకూడ మొల్ల అధ్యాత్మముననుసరించినట్లు తోచుచున్నది. కాగా, పై పద్యమును భాగము మొల్ల రామాయణములోను, తులసీరామాయణములోను కూడ అయోధ్యా కాండమున, రాముడడవి కేగుచు గంగదాటినప్పటి కథకు సంబంధించినది. అధ్యాత్మములో అది బాల కాండలో నున్నది. ఇంతే భేదము. కాని ఈ మార్పు చేసినదెవరు? మొల్ల కొంత క్రొత్తదనము చూపనెంచి మార్పు చేసినదేమో!

తులసీదాసు విరాగియై, కాశీనుండి రామేశ్వరము వరకు గల క్షేత్రములన్నియు దర్శించి, చిత్రకూటమున చిరకాలము వసించి, చిట్టచివరకు కాశీలో తన రామాయణమును వ్రాసి ముగించెను. ఆనాటి యాత్రలు పాద యాత్రలు. తులసీదాసు వంటి భక్తుల కాయా క్షేత్రములలో ఏ పురాణ కాలక్షేపముల లోనో, ఏ సాధు సజ్జన గోష్ఠులలోనో, ఏ భక్త కూటములతోనో పరిచయ భాగ్యమేర్పడి యుండకపోదు. తన నాటికిగల దేశ భాషా కావ్యములలోనున్న రామ కథా విధానములన్నియు అతడు వినియే యుండును. కనుకనే, 'నానా పురాణ నిగమా గమ సమ్మితం యద్రామాయణే నిగదితం, క్వచిదన్య తోపి' అని వ్రాసి తాన న్యత్రా గ్రహించిన రామకథా విశేషములెన్నో తన రామాయణములో పొందుపరచినట్లు తులసీదాసు "రామచరితమానస్" అవతారికలో చెప్పుకొనెను. వాల్మీకి రామాయణమునగాని, అధ్యాత్మ రామాయణమునగాని కనపడనివియు, తెలుగులో భాస్కర రంగనాథుల రచనలో మాత్రము కనిపించునవియు నగు కాలనేమి వృత్తాంతము వంటివి కొన్ని తులసీ రామాయణములో కాన్పించుచున్నవి. అనగా, తెలుగునాట ప్రచారములో నున్న రామాయణ కథలతోకూడ తులసీదాసునకు పరిచయమున్నదని తెలుచున్నది. కనుక, మొల్లకు హిందీ తెలుసునను కొనుటకన్న, తులసీదాసే, తన తీర్థయాత్ర కాలమున మన తెలుగునాటగల భాస్కర రంగనాథాదుల రచనలతోపాటు మొల రామాయణమును గూర్చి కూడ విని తెలిసికొని యుండవచ్చును.

ఉదాహరణమునకు, పై పద్య భాగమేకాక ఈ క్రింది ఘట్టము కూడ చూడవచ్చును.

ఇది సీతా స్వయంవరమునకు సంబంధించిన ఘట్టము. వాల్మీకములో గాని అధ్యాత్మములోగాని సీతాస్వయంవర వేళలో రాజకుమారు లెల్లరు వచ్చినట్లును సభ జరిగినట్లును చెప్పబడలేదు. మొల్లరామాయణములో, సీతా స్వయంవరమునకు ద్రవిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్రాది షట్పంచాశద్దేశాధిపతులును వచ్చి సభనలంకరించినట్లు వ్రాయబడినది. తులసీ రామాయణములో దేశముల పేర్లు లేవుకాని రాజులెందరో వచ్చి సభలో కూర్చుండినట్లు వర్ణింపబడినది. జనకుని ప్రతిజ్ఞ రాజకుమారుల అడియాసలు మొదలగునవన్నియు మొల్ల తులసీదాసు లిరువురును సమానముగనే వర్ణించిరి. రాముడు ధను వందుకొని నంతనే లక్ష్మణుడీ క్రింది విధముగా పలికినట్లు మొల్ల వ్రాసినది:

ఉర్వీనందన కై, రా
మోర్వీపతి యెత్తు నిప్పు డుగ్రుని చాపం
బుర్వింబట్టుడు దిగ్దం,
త్యుర్వీధర కిటి ఫణీంద్రు లూతంగఁ గడిమిన్.''

తులసీ రామాయణములో కూడ లక్ష్మణు డిట్లే పలికినట్లు వ్రాయబడెను:

''దిసి కుంజరహు, కమఠ, అహికోలా,
ధరహు ధరణి ధరిధీరన డోలా
రాము చహహిఁ శంకర ధనుతోరా,
హోహు సజగసుని ఆయసుమోరా.''

తులసీదాసు శంకర చాపము రావణ బాణాసురులకు కూడ వశ్యము కాలేదని వర్ణించెను. మొల్ల రామాయణమున నట్టి వర్ణన లేదు. కాని భాస్కరాదుల రచనలో, అన్యత్ర 'నీ వెత్తజాలని నీలకంఠుని విల్లు' ఇత్యాదిగా గల వాక్యములలో నీ విషయము సూచింపబడినది. కనుక, తులసీదాసును మొల్ల అనుసరించిన దనుట కన్న తులసీదాసే తెలుగువారి నొకటి రెండు చోట్ల ననుసరించె ననుట సమంజసము.

(తిరుపతి) ముట్నూరి సంగమేశం.

## మొల్ల కాలనిర్ణయము

ఆర్యా,

ఫిబ్రవరి భారతిలో (పుటలు 72—73) మొల్లకాల నిర్ణయ సమస్యను పురస్కరించుకొని 'శ్రీ ఆరుద్ర' గారు:

''చనుచు రాఘవుండు స్వర్ణది యొడ్డున
గుహుని గాంచి యతని గుస్తరించి
తడయ కోడ బెట్టి దాటింపు మనవుడు
నట్లు చేయదలచి యాత్మలోన.
సుడిగొని రామపాదములు సోకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొకకాంత యయ్యెనట పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడ నొక యోడ సోక నది యేమగునో యని సంశయాత్ముడై
కడిగె గుహుండు రాము పదకంజయుగంబు భయంబు పెంపునన్.
మొల్ల రామాయణము — 2: 31,32

అను పై పద్యముల నుదాహరించి, ''ఇంకే రామాయణంలోనూ కనబడకుండా, ఒక మొల్లరామాయణంలోనే ఉన్న ఈ ఘట్టం కూడా ఒకటి మొల్లకాల నిర్ణయానికి పనికొస్తుందేమో. వసు చరిత్ర అవతారికలోని 'శ్రీ భూపుత్రి' అను మొట్టమొదటి పద్యంలో కూడ ఇటువంటి కల్పనే ఉంది. వసు చరిత్ర 1569—70 ప్రాంతమున రచితమైనది'' అని వ్రాసినారు. ఈ ఘట్టం మొల్ల కాలనిర్ణయమునకు పనికి వస్తుందేమో అని సందేహించుట కూడ అవిచారిత రమణీయం.ఇది ఇట్లుండగా:

నిడదవోలు వేంకటరావు గారు—హైదరాబాదు— మార్చి భారతిలో ''కాని వ్యాసకర్త ఊహించినట్లుగా నీ కల్పన వసు చరిత్ర ననుసరించి రచించినది కాదు. ఇది తెలుగున నే రామాయణమునందు నుండదు'', అని శ్రీ ఆరుద్రగారిని కాదని, ''ఈ కల్పన జగద్వ్యాప్తమై తులలేని కీర్తి గడించిన తులసీదాసకృత రామచరిత మానసమను హిందీ రామాయణమందుంచెరిని;'' అని చెప్పి పై పద్యములకు సంబంధించిన భాగమునుదాహరించి, ''మొల్ల తులసీ రామాయణమునే అనుసరించినట్లు స్పష్టమగుచున్నది'' అని సిద్ధాంతీకరించినారు. కానిఇది అప సిద్ధాంతము. అధ్యాత్మ రామాయణంలోని ఈ క్రిందిశ్లోకముల భావమును తులసిదాసు గ్రహించి తన రామచరిత మానసములో చొప్పించినాడు. శ్రీ రావుగారు పోల్చి చూచుకొందురుగాక.

''క్షాలయామి తవపాదపంకజం
నాథ దారుదృషదోః కిమన్తరమ్
మానుషీకరణ చూర్ణ మస్తితే
పాదయోరితి కథా ప్రథీయసీ — 3 శ్లో.
పాదాంబుజం తే విమలం హి కృత్వా
పశ్చాత్పరం తీర మహం నయామి
నో చే త్తరీ సద్యువతీ మలేన
స్యాచ్చే ద్విభో విద్ధి కుటుంబ హానిః'' — 4 శ్లో.
— అధ్యాత్మరామాయణము, బాలకాం. 6 సర్గ.

సుమారు నలుబది సంస్కృత రామాయణములు వినబడుచున్నవి. పెక్కు తెలుగు రామాయణములలో అవాల్మీకములుగా భావింపబడిన భావములు ఏదియో ఒక సంస్కృత రామాయణములో కనిపించుచునే ఉన్నవి. అధ్యాత్మ రామాయణమునకు ఆంధ్రదేశములో వాల్మీకి రామాయణమునకు వలె మంచి ప్రచారమున్నది. మొల్ల రామాయణమునకు గాని, తులసీదాసు రామాయణమునకు గాని ఈ ఘట్టమున వ్యాస మహర్షిప్రోక్త బ్రహ్మాండ పురాణాంతర్గతమైన అధ్యాత్మ రామాయణమే మూలము. ఈ విషయమును బట్టి మొల్ల కాల నిర్ణయ సమస్య పరిష్కృతము కాదని, సాహిత్య పరిశోధనమునం దిట్టి వేగిరపాటు తగదనియు శ్రీ నిడదవోలు వేంకటరావు గారికి మనవి చేయుచున్నాను.

(విజయవాడ) —శనగన నరసింహస్వామి.

# గ్రంథ విమర్శలు

## కూనలమ్మ పదాలు

కర్త : ఆరుద్ర. వెల : 1.00. ప్రాప్తిస్థానము : జ్యోతి బుక్స్ విజయవాడ—2.

పల్లెపదాలుగా ఈసడింపబడిన జానపద గేయ వాఙ్మయమును పునరుద్ధరించుట నవీన యుగమున నొక విశేషము. ఒక నాడు బహుళ ప్రచారము పొందిన పదములలో కూనలమ్మ పదాలు ముఖ్యములైనవి. అవి నీతిని బోధించు పదములు. ఏని మిడి మాత్రమే లభించినవి. ఆ కూనలమ్మ పదముల స్వరూప స్వభావములను లెస్సగా గుర్తించి యుగానుకూలమైన నీతులు నేర్పుచు, ఆరుద్రగారు క్రొత్త కూనలమ్మ పదములను రచించిరి. ఇవి ఒకానొక మాస పత్రికలో ధారాళముగా వెలువడినవి. ఆ పత్రికాధిపతులు పుస్తక రూపములో వాని నన్నిటిని ప్రకటించిరి. ఈ క్రొత్త కూనలమ్మ పదములను పఠియించి ఆ పత్రిక పాఠకులు పరవశించి, పేరడీలుకూడా రచించిరి. ఆ పాఠకుల అభిమానము ఆశీస్సుగా ఈ పుస్తకము వెలువడినది. కూనలమ్మ పదములను, చరిత్రను, ఛందో విశేషములను వివరించుచు ఆరుద్రగారొక విపుల పీఠిక రచించిరి. ఈ పీఠిక పుస్తకమున కలంకారము. సాహిత్య పరిశోధకు లవశ్యము పఠింపదగ్గది. "నీవు పలికిన రీతి, నేను పాడెద నీతి, నీకు చెందుత ఖ్యాతి, ఓ కూనలమ్మ" అని ఆరుద్రగారు పలికిరి. ఈ పద మిందలి వస్తువునకు చెందినట్టిది. అట్లే "చిన్ని పాదములందు, చివరి ప్రాసల చిందు, చేయు వీనుల విందు, ఓ కూనలమ్మ" అను పదము ఈ రచనము నందలి పదముల స్వరూపమును వివరించును. మఱియు "పరుల మేలును కోరి, పదము లల్లెడువారి, పథము చక్కని దారి, ఓ కూనలమ్మ" యని ఆరుద్రగారు కవితా మార్గము నిర్దేశించిరి.

ఆరుద్రగా రేది వ్రాసినను క్రొత్తగా నుండవలయునని కోరుదురు. ఒకనాడు వారు భాషా స్వరూపములో క్రొత్తదనము కావలయునని ఒక కొన్ని ప్రయోగములు చేసిరి. ఈనాడు తెలుగు మాగాణము మఱచిపోయిన ఛందోరీతులను స్వీకరించి, ఈ కూనలమ్మ పదములను రచించిరి. భాషా భావ ఛందోరీతులలో నవ్యత ఎంతగా వాంఛనీయమో, అది విస్పష్టరూపము ధరించుటయు అంతగా గణనీయము. నూతన ప్రయోగములు చేయుచున్నందులకు ఆరుద్రగారిని ప్రశంసింపవలె. ఆరుద్రగారి కూనలమ్మ పదములు తత్త్వమును బట్టి బహు విధములుగా నున్నవి. కొన్ని పదములు తాత్త్వికములు. కొన్ని సాంఘికములు. కొన్ని రాజకీయములు. కొన్ని కేవల మేదో యొక చమత్కారముతో భాసించునట్టివి. ఎట్టివైనను ముందు చెప్పినట్లుగా సర్వ పదములు నీతిని బోధించునట్టివే. "సన్యసించిన స్వామి, చాలినంత రికామి, చాన దొరికిన కామి, ఓ కూనలమ్మ". "పేదలే కానిమ్ము, ప్రభువులే కానిమ్ము, చివర కవరా దుమ్ము, ఓ కూనలమ్మ". "గడ్డి పోచలు పేని, గట్టి ఏనుగు నేని, కట్టువాడే జ్ఞాని, ఓ కూనలమ్మ" అను పదముల భావములలో ప్రాచీన భావచ్ఛాయలు గలవు. ఈ పదములు పాఠకుల హృదయములకు సూటిగా హత్తుకొని పోగలవు.

కూనలమ్మ పదముల సొగసంతయు వాని అంత్యప్రాసలలో నున్నది. ఆ అంత్యప్రాసల నియమమును ఆరుద్రగారు లెస్సగా పాటించిరి. వా రొక్కొక్కసారి అంత్యప్రాసల కొఱకో, యతి నియతి కొఱకో, చమత్కారసృష్టి కొఱకో పద స్వరూపమునే మార్తురు. ఉచితముగా నుండని క్రియలను వాడుదురు. ఈ పదములను చూడుడు: "లంచ మనియెడి పట్టి మంచ మేమిటి గట్టి ఇనుపమేకుల తొట్టి ఓ కూనలమ్మ". "మనసు కుదరని పెళ్లి, మరు దినమ్మున కుళ్లి, సుఖము హుళ్లికి హుళ్లి, ఓ కూనలమ్మ". "పేజి పేజికి వథలు, ప్రెజలు వొల్లని కథలు, ఆరగించును చెదలు, ఓ కూనలమ్మ". "హాస్యమందున అబుఱ, అందెవేసిన కబుఱ, బుడుగు వేంకటరమణ, ఓ కూనలమ్మ". భాషా ప్రపంచములో మడి గట్టుకొనవలయు ననుట మా యభిమతము గాదు. వస్తుశిల్ప ప్రయోజనములను బట్టి భాషా స్వరూపము మారక తప్పదు. కాని, యా మార్పున కొక నియమ ముండును. ఆరుద్రగారు సాహిత్య—మావోసేటుంగ్. మావోసేటుంగ్ స్వప్రయోజనార్థము సత్య స్వరూపమును కప్పిపుచ్చును. వక్రవ్యాఖ్యానము చేయును. అట్లే ఆరుద్రగారును అంత్యప్రాసల సాధించు నెపముతోడనో, చమత్కారసృష్టి కొఱకో భాషను విఱుతురు. పద్య స్వరూపమును స్వేచ్ఛగా మార్తురు. ఇది వారికి నచ్చినట్టిది.

ఈనాడు సాహిత్య ప్రయోజనమును నిర్వచించుట దుశ్శక్యముగ నున్నది. చమత్కారము, తాత్కాలికానందము, సంఘ సంస్కరణము, రాజకీయ మత సిద్ధాంత ప్రతిపాదనము, రసానందము —వీనిలో ఏదియో యొకటి మాత్రమే సాహిత్య ప్రయోజనము కాదగునని నవీనులు చెప్పుదురు. ఎవరికి కావలసిన యుపపత్తులు వారికి గలవు. ఆరుద్రగారి కూనలమ్మ పదములలో ఒక కొన్ని నీతులు, ఒక కొన్ని వినోదములు, ఒక కొన్ని చమత్కారములు గలవు. ఆ నీతులు ఈనాటి సంఘమునందలి దోసగులవలన నేర్పడినవే. కాలక్షేపమునకు చదువుకొనదగిన రచన. పత్రికా రచనము ఉత్తమ సాహిత్య మగునో కాదో కాలమే నిర్ణయింపవలయును.

# వేదనావాసుదేవము

కర్త : నాయని సుబ్బారావు, వెల : 1.00. ప్రాప్తి స్థానము : భారత సాహిత్య కళా పరిషత్తు, ఖమ్మం.

వేదనా వాసుదేవమను ఈ లఘుకృతి జీవుని వేదనను ఆవిష్కరించును. ధూర్జటి కాళహస్తీశ్వర శతకమును తల పించును. ప్రాయికముగా శతక కృతులలో జీవుని అరిషడ్వర్గ ప్రకోపనము, భగవదుపేక్ష, దానికి ఫలముగా కలిగిన ఆవేదన, భగవంతుని నాశ్రయించి వానికి సర్వస్వము సమర్పించుట, ఆయన దర్శనానవాప్తిచే నిరాశా దైన్యములు జనించుట, మాయామయమైన సంసారముపట్ల వైముఖ్యము దట్టమగుట, మోక్షాభిలాష మున్నగునవి వర్ణింపబడును. నాయని సుబ్బా రావుగారును ఆ త్రోవగనే పోయిరి. గుండెలోతులలోని సూక్ష్మ వేదనలను వెలువరించు శక్తియుక్తులు, అవి ప్రతిఫలించు భావన, ఆ భావనను సంప్రదాయపద్ధతిలో ప్రకటించు భాషా బలము మున్నగునవన్నియు సుబ్బారావుగారిలో సమృద్ధిగా నున్నవి. ఈకృతియందధిష్ఠానదైవము వాసుదేవుడు. ఈ కృతియంతట భక్తునకు భగవంతునిపట్లనుండు భక్త్యాత్మీయతలు పుష్కల ముగా వర్ణింపబడినవి. "నిందాస్ఫురదార్త వాక్యములు" "ఆవేశ పూరమ్మౌ లౌకవితల్" కలిగినట్టిది.

వేదనావాసుదేవ మందలి భావశబలత పాఠకులను గిలి గింతలు పెట్టును. ఒకచో భావము తొమ్మిది పోకడలలో ఉత్ప్రే క్షింపబడినది. సాభిప్రాయమంత్రణమునందు సుబ్బారావుగారు సిద్ధ హస్తులు. చమత్కారమును ప్రతిపాదించుట ఈ కావ్య మందలి మరియొక వైశిష్ట్యము.

పుట్టినకొట్టు కన్మొరగిపోయి నిశీథమునందు నేటి యా
గట్టున గొల్లపల్లెనొక కాపురమై, తదనంతరంబుచే
పట్టిన పట్టణమ్మొకని బారికి నగ్గముగా, పయోధిలో
కట్టిన కొంపయే శరణుగా, మనుదేవుడవేమి చేయువున్.

మకుట నియమము లేని శతక ప్రాయమైన కృతియిది. "బిగించు 'కొనంగా........ నాతెలివి మండున్........" అనుచో యతి విచిత్రముగానే యున్నది.

# మానవ సంగీతం

కర్త : కవిరాజమూర్తి. వెల : 1.00. ప్రాప్తి స్థానము : ప్రజా సాహిత్య పరిషత్తు, ఖమ్మంమెట్టు.

"మానవ సంగీతం" దీర్ఘమైన వచన గీతి. మానవుని ఆవేదనను వ్యక్తీకరించునట్టిది. నవీన కాలమున అభ్యుదయ కవిత్వ మనబడు కవితా మార్గము కోవకు చెందిన కృతి ఇది. శ్రీరంగము శ్రీనివాసరావుగారు ఇట్టి కవితా పద్ధతికి శ్రీకారము చుట్టిరి. ఆర్థిక నియతివాదము, వర్గ కలహము, కార్మిక కర్షక ప్రభుతా నియంత్రణము, విశ్వమానవ సౌభ్రాత్రము ఈ కవితా శాఖకు మూల ద్రవ్యములు. రాజనీతి సిద్ధాంతములు ప్రధానమై ప్రాచీన ఛ్ఛందో వ్యాకరణాది సంప్రదాయములను పట్టి పల్లార్చు కవిత్వమిది. ఇట్టిది ఇంతకుముందు లేదు. తెలుగునాట కొన్ని ఏండ్లు దీని శక్తి ఇంతింతని రాని రీతిగా నున్నది. ఎందఱో ఈ యదభ్యుదయ కవిత్వమును వ్రాసిరి. వారు వ్రాసినదంతయు చేవగలట్టిది గాదు. దానిలో అవ్యవస్థ యున్నంతగా సమగ్రాకారము లేదు. ఉద్వేగ మున్నంతగా సమ దర్శనము లేదు. ఇది రానురాను దూషణ కవిత్వముగా పరిణ మించినది. ఆ తిట్టులు కూడ వ్యంగ్యముతో, చమత్కారముతో భాసించునట్టివి గావు. మఱి నగ్నములు, నీరసములును. భావ శబలతతో ఈ అభ్యుదయ కవితాగానము చేసినవారు, చేయు చున్నవారు లేకపోలేదు. కాని వారి సంఖ్య తక్కువ. ఉన్న యా తక్కువ మందిలో కవిరాజమూర్తిగా రొక రనుటకు "మానవ సంగీత" మే సాక్షి.

"విద్యుద్దీపంలోని
విద్యుత్తులాగా వెలుగొందు
పరాధీన భావంతో,
బ్రతుకకు —"

అను ఆశౌ స్వాతంత్ర్యపు ప్రభోధముతో ఈ లఘు కావ్యము ప్రారంభమైనది. తరువాత

"అన్నార్తులం మనం
అభాగ్యులం మనం
అనాథులం మనం
అవని అంతటా కమ్ముకొన్న
అసమర్థులం మనం
భూమిపై మొలచిన కుక్క గొడుగులం"

అను నిరాశా వాదము మొదలగును. ఇది పాత పాటయే. ఆ పిదప

ఎంతో దూరంనుంచి
నిన్ను నేను చూస్తున్నాను
ఎన్నాళ్లనుంచో నిన్ను నేను పిలుస్తున్నాను
హిమాలయం ఎత్తు పెరిగి
చాచాను నీకు చేతులు
ఇంద్ర ధనుస్సులా వంగి
నిన్ను అందుకో బోయాను
నీవు నాకు అందలేదు."

అనుచు మానవత, మానవ సంస్కృతి సౌభాగ్యమును వర్ణిం చును. మహా సంస్కృతిని పొదుకొల్పిన ఈ మానవత తుదకు

"ఇంతటి లోకం చూచినాను
అంతటి చరిత్ర కారకుణ్ణి
అయినా ఎక్కడనుండి కదిలానో
అక్కడనే ఉన్నాను"

అని ఈ కావ్యమునకు స్వస్తి పలుకును. ఈ స్వస్తియందలి సొగసు దొడ్డది. ఇది చదివి పాఠకుడు పుస్తకమును మూసి లిప్తకాల మయిన అంతర్ముఖ భావాలోకనము చేయగలడు. కావ్యాం తము ఈ నాటి మానవుని నిస్సహాయస్థితి సూచించును.

కవిత్వమునకు భావము ప్రాణము. కవి రాజమూర్తి గారు భావనా బలముగల కవియే. కాని ఈ రచనయందలి కతి పయ భావములు శ్రీశ్రీ భావముల ఛాయలతో గోచరిం చును. సర్వ గీతి యొక్కయు శయ్యా నిర్వహణము మేలుగా

మున్నది. భావానుకూలమ్మైన లయ గలదు. ఈ నాటి మానవ సమాజ మెట్టిదో చూపు ఈ కవితా ఖండము చూడుడు :

"బలిపీఠం దాపున వణకుతూన్న
మేకను చూడలేని సమాజం
హంతకుని చేతిలోని కత్తిని
చూచి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తోంది"

"మానవ సంగీతం" ఈషద్విషాద నీరసస్వర శబలితమ్మైనది. బెల్లంకొండ రామదాసు గారి "దర్శనం" కావ్యమునకు దీటుగా నున్నది. కవులమనుకొను వారు రామదాసుగారి పీఠికను తప్పక చదువవలయును. వారికి స్వస్వరూప దర్శనమగును. మానవ నాగరకత ఈ నాడొక మహా పరివర్తనము పొందు చున్నది. ఈ పరివర్తనమును స్వతంత్ర భావనాశక్తితో వర్ణించిన నాడు కవిరాజమూర్తిగారు అన్వర్థ నామధేయులగుట తథ్యము.

——శాక్యసింహ.

## కాటూరి వేంకటేశ్వర స్మారక సంపుటము

సంపాదకుడు : శ్రీ కె. బి. రావు. ఎం. ఏ. ప్రతులకు : ప్రవాస సాహితీ ప్రచురణలు, 330 క్రొత్తవీధి, తిరుపతి. డెమ్మీ సైజున వంద పుటలు. వెల: రు. 3.25.

పంజాబు రాష్ట్రములోని హోషియార్‌పూర్ నగరము నందలి యాంధ్రులు ప్రవాస సాహితీ సంస్థను నెలకొల్పుకొని స్వభాషాభిమానమును నిల్పుకొనుచుండుటతోబాటు పుస్తక ప్రచురణకు గూడ పూనుకొనుట చాల సంతోషకరమ్మైన విషయము. ఈ స్మారక సంపుట ప్రచురణతోడనే ప్రచురణ కార్యక్రమమును ప్రారంభించుట మరియు మెచ్చదగినది. ఒక మహాకవి పరమపదించగా నా రాష్ట్రములోని యా భాషా భాషీయుల కేమియు పట్టలేదు. ప్రవాసమునందున్న వారికి పట్టినది. కీర్తిశేషులైన కాటూరి వేంకటేశ్వర రావుగారి పేర నొక సాహిత్య వ్యాససంపుటము నా ప్రవాసాంధ్రులు ప్రచురించినారు. ఈ సంపుటమునకు సంపాదకత్వము వహించిన శ్రీ కె. బి. రావుగారి "మొదట్లో మూడు వందల పుటలు గల గ్రంథాన్ని ప్రకటించా లనుకొన్నాము. అయితే ప్రసిద్ధులయిన అనేకమంది రచయితలు ఏమీ పట్టనట్లు ఊరుకోవడంతో లభించినంత సహకారంతోనే ఈ చిన్న పుస్తకాన్ని ఆంధ్రలోకం ముందు పెడుతున్నాము" అను వాక్యములు గమనింపదగినవి.

ఈ సంపుటములో "ఎల్లోరా", "స్వామి శివశంకరులు", "డాక్టరు దివాకర్ల వేంకటావధాని", "జమ్ముల మడక మాధవరామశర్మ", "యడ్లవల్లి ఆదినా[illegible]యణ", "డాక్టరు ఎస్వీ. జోగారావు", "కాండూరి నరసింహాచార్యులు", "వసంతరావు వేంకటరావు" గార్ల వ్యాసము లున్నవి. ఇవిగాక మొట్టమొదట కీర్తిశేషులైన కాటూరివారి పద్యా లున్నవి. మరియు "కమల' సమకూర్చిన పలువుర సంతాప వాక్యములు కొన్ని యున్నవి. ఆ తరువాత గల శ్రీ రాచకొండ నరసింహము గారి వ్యాసము శ్రీ వేంకటేశ్వరరావుగారిని గూర్చిన 'స్కెచ్, చాల బాగున్నది. శ్రీ పువ్వాడ శేషగిరిరావు, శ్రీ అద్దేపల్లి నాగ గోపాలరావుగార్ల పద్యములు సముచితములు.

'ఎల్లోరా' వ్రాసిన "ఆంధ్ర సాహితికి కాటూరి కానుక" పెద్ద విశేషములేని సామాన్యమ్మైన వ్యాసము. శ్రీ స్వామి శివ శంకరుల "సంకలనములు" సంకలన గ్రంథముల పుట్టు పూర్వోత్తరములను స్వరూప స్వభావములను విశదీకరించుచు కొద్దిలో స్వయం సంపూర్ణముగా నున్నది. డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారి "ఆధునికాంధ్ర కవితారీతులు" అను వ్యాసము సాహిత్య చరిత్రమువలె విషయ ప్రాధాన్యము గలిగి చక్కని చిక్కందనముతో నున్నది. శ్రీ మాధవరామశర్మగారి "నవ్యకవితా ప్రతిష్ఠ" నవ్యాంధ్ర సాహిత్యాభినివేశము కల వారు ఏకాగ్రతతో చదివి మననము చేసుకొనవలసినంత కండ గలిగియున్నది. శ్రీ యడవల్లి ఆదినారాయణగారి "నవ్యాంధ్ర సాహిత్య పరిణామ వికాసములు" సాధారణ రామణీయకము నిముడ్చుకొనియున్న వ్యాసము. శ్రీ జోగారావుగారి "బాణుని అవస్థా చిత్రణము" అన్న వ్యాసము వారి మిగిలిన రచనలను బోలి చమత్కార మయమ్మై యున్నది. శ్రీమాన్ నరసింహాచార్యులుగారు వ్రాసిన వ్యాస మొక హెచ్చరిక. శ్రీ వసంతరావు వేంకటరావుగారి "తెలుగులో విజ్ఞానము" అను వ్యాసము విషయ వివేచనము కలిగి నిండుగా నున్నది.

ప్రవాస సాహితివారు పూనుకొని ఆంధ్రభాషా మహాకవియ్మైన వారి స్మృత్యంకముగా నొక సంపుటమును ఈమాత్రముగా నైనను ప్రకటించుట మిక్కిలి ప్రశంసింప దగిన విషయము.

——క్షేమేంద్ర.

## వేకువ రేకలు

కవితాసంకలనం. యువ రచయితల సమితి, సహకార ప్రచురణలు. గుంటూరు. వెల : రు. 2.00. ది పాపులర్ పబ్లిషింగ్ కో, పి. బి. నెం. 228. గుంటూరు—2.

నలభై ఐదుమంది యువ రచయితల గేయాలు, పద్యాలు, వచన గేయాలు ఈ సంకలనంలో ఉన్నవి. ఈ ప్రయత్నము ప్రోత్సహించదగినది. యువ రచయిత లిట్లా సాహిత్య లోకానికి పరిచయం కావడం అత్యంత ముదావహం.

గ్రంథం ముద్దుగా అందంగా తయారైంది. ఇందులో కవిత్వం "వేకువ రేకలు" అనే నామాన్ని సార్థకం చేసు కొన్నది. పురిటిపాపల చిరునవ్వులను—, స్మరింపజేసే ఈ రచనలలో రచయితల భావి సాహితీ శ్రీలరేకలు అస్పష్టంగా కన్పిస్తున్నవి.

ముందు మాటలో—,

"పెరిగిన పెద్దన్నల
ముఖం మొత్తు పీఠికలను
మురిపె మొప్ప ప్రింటు చెయ్య

విప్పి చూడకుండ దాన్ని
గొప్పగ కొంటారురా."

అంటూ వ్యంగ్యంగా అన్న మాటలలో పెద్దవారి పట్ల యువ రచయితల ఏహ్యభావాన్ని వ్యక్తీకరించుకొన్నారు.

పోనీగాక ! అందరూ కొత్తగా కలం పట్టి సాధించిన ఈ సంకలనంలో కన్పించే ఈ కవిత్వాన్ని పరిశీలిస్తే కొన్ని విషయాలు స్పష్టమవుతున్నవి.

గేయాలు, పద్యాలు కొంత శ్రద్ధ తీసుకొని సంస్కరించిఉంటే మరెంతో బాగుండెడివి. అట్టి ప్రయత్నం కన్పించదు.

రెండవ విషయం. వీటిలో కొన్ని రచనలు ఎందుకు వ్రాయబడినవో—ఏ ప్రయోజనార్థం ప్రచురించబడినవో అర్థం కాదు. వారు వ్రాశారు, వీరు వేశారు, అనే సంతృప్తి; అంతే ఫలితం.

శ్రీ ముకురాం రామారెడ్డిగారి శ్రీ నైవేద్యము వంటి రచనలు కొన్ని బాగున్నవి.

"నీ ముద్రపై ముద్ర నిలుచురా మద్రాసు
బీచి వయ్యారుల చూచుకములు
కులుకదా నీ వన్నె గోల్కొండ చిప్పిం
నీటు కాటుక కంఠ్న నీడలందు
నీ సిరి గంధంబు వాసించు గుజరాతి
గుమ్మల వీడెంపు కమ్మరుచులు
ఢిల్లి బల్బులుల కౌగిళ్లరాయిడి కల
కలలాడదేర నీ కౌస్తుభంబు
వయసు వయ్యారములలోని పంపు సొంపు
లబ్బె వడబోయు నైలాను కట్టుగట్టి
కల్గి మెరుపులట్లు మిటారు కత్తెలంత."

ఇలాంటి వింకా ఉన్నవి. రచనలను సేకరించడంతోనే సంపాదకుల పని పూర్తికాదు. ఆ రచయితల సమక్షంలోనో— లేదా వారి అనుమతితో పరోక్షంలోనో ఆ రచనలకు మెరుగులు దిద్ది, సంస్కరించి—అనవసరంగా కన్పించే వాటిని విసర్జించి అత్యంత శ్రద్ధాసక్తులతో ఏరి కూర్చియున్న యెడల ఈ గుంటూరు యువ రచయితల కవితా సంకలన సౌరభాలు గుబాళించి ఉండెడివి. యథాతథంగా ముడిసరుకు నచ్చే ముద్రించినందుకు ఏటుకూరి, జాషువా, అభినవ తిక్కనాదుల నిలయమైన గుంటూరు మాగాణ మందలి యువ రచయితల కవితా సంకలన మిదేనా, ఇంతేనా, అనే నిస్పృహ కల్గుతున్నది.

రాబోవు సంకలనం వేకువరేకలు గాక ఉషఃకిరణాలై వెలుగొందుగాక!

## ప్లాను పాగింది

పంచవర్ష ప్రణాళికపై జరిపిన పోటీ ప్రదర్శనములో ప్రథమ బహుమతి పొందిన నాటిక. రచయిత : శ్రీ కె. శ్యాలన్న, బి. ఏ., ప్రచురణ : విద్యార్థి సంఘము, ప్రభుత్వోన్నత పాఠశాల, గద్వాల.

## స్వామి రామతీర్థ జీవితగాథ

### (ఆంగ్లము)

రచన : చిల్కర సుబ్రహ్మణ్యం బి. ఏ., ఎల్. ఎల్. బి. లా డిపార్టుమెంటు, హైదరాబాదు, వెల: రు. 0.75.

## శ్రీరామ పూజ

శ్రీరామ షోడశోపచార, శ్రీరామ సహస్రనామ, శ్రీరామ సీతాంజనేయాష్టోత్తర శతనామ సంభరిత పూజా విధాన మిది. వెల : రు. 0 30.

కె. సభా.

## అంబికాస్తవ కదంబమ్

గ్రంథకర్త : శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మ ప్రాప్తిస్థానము : మాతృ శ్రీ గ్రంథమాల, జిల్లేళ్లమూడి (వయా) బాపట్ల. వెల : 0.25 న. పై.

ఇందులో దేవీస్తవః, అంబికాష్టకమ్, అంబికా కరావలంబస్తోత్రమ్, అంబికా నవరత్న మాలికాస్తవః, జగదంబికాస్తవః— అనే దేవీస్తవము లైదు సంస్కృత భాషలో కలవు. భాష సులభగ్రాహ్యమై సలక్షణముగా నున్నది. పూర్వ కవి కృత స్తోత్రముల ఛాయలు సర్వత్ర గోచరించు చున్నవి. కవికి శబ్దాలంకారములందు అభిమానము ద్యోతమగు చున్నది.

## అనంతనామ శతకము

గ్రంథకర్త : శ్రీ గుమ్మళ్ల వేంకటేశ్వరరావు, బి. ఏ. పద్మా ప్రచురణలు, ఏలూరు. వెల : తెలియరాదు.

విష్ణు పరమైన శతకము. 108 పద్యములున్నవి. ప్రతి పద్యమునకు మకుటముగా ఒకే నామ ముంచక అనేక నామ సంబోధన లుండుటచేత ఇది అనంత నామశతకమైనది. గ్రంథకర్త పద్య రచనా సాధన భగవత్పరముగా చేయుచుండుట ముదావహము

—నోరి నరసింహశాస్త్రి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The AndhraPatrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.